# భారతి

సాహిత్య మాసపత్రిక



అక్టోబరు 1955

వెల ఒక రూపాయి

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1955

సంపుటము 32 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1955



త్రివర్ణ చిత్రము: విద్యావతి—చిత్రకారుడు: శ్రీ కేతినీడి భాస్కరరావు



వి ద్యా వ తి

చిత్రకారుడు : శ్రీ కేతినీడి భాస్కరరావు

# సంధ్యా సుందరి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

పశ్చిమాశాంతరమ్మున బగలు రేయి
రాపిడి జనించు నగ్నిహోత్రం బదేమొ !
కాక — కనకాద్రి రవి తురంగమ ఖురాళి
గలయ రేగినదేమొ బంగారు ధూళి !

ధాతుప్రస్తరముల్ ద్రవింపగ దినాంత స్వర్ణ నైపథ్య సం
కేతస్థానమునన్ హిరణ్మయ విపంచీ తంత్రులన్ మీటి సం
గీతం బిమ్ముగ నాలపించెడి శుభాంగీ! మాకు నొందివు మ
ద్వైతానందపదమ్ము రూప రస గంధ స్పర్శ శబ్దంబులన్

ఈ నీరామని మబ్బు తున్కల కొనల్ హేమింప, సిందూర శో
భానందంబులు సందడింపగను సంధ్యారంగమం దీవు కా
లూనన్ గేలు గదల్ప రక్తిమలు కాయున్ రాగముల్ సాగు; బా
లా! నర్తింపుము రాగరక్తిమలు కొల్లల్ కొల్లలై పోవగన్

రాలె ముత్యాలు నీ నాట్య రభసమందు
ప్రీలె కబరీభరంబు — నా కాలి క్రింది
కసవునుండి నక్షత్ర లోకంబు దాఁక
ప్రాఁకి పోయె నిశ్శబ్దతాభరము తమము.

# కాంతిలేని దీపాలు

శ్రీ మంథా వెంకటరమణారావు

## రంగం : పానశాల

* * సమయం. రెండవ ఝాము రాత్రి. ద్వారంవద్ద చేతులు లేని కుర్చీమీద ముస్తాక్ కూర్చొనిఉంటాడు. అతని ముందు డ్రాయరున్న చిన్న టేబిలు. దానిమీద ఇత్తడిగంట - ఒకమూల పొగవల్ల మాసిన 'స్టాండ్ స్క్రీను' - గది రకరకాల వ్యక్తులతో నిండి ఉంటుంది. సెర్వర్లు తలలకు నల్లటి గుడ్డలు చుట్టుకొని 'స్క్రీను' వెనుకకు గదిలోకి విశ్రాంతి లేకుండా తిరుగుతూ ఉంటారు. 'స్క్రీను' వెనుకనుండి గ్లాసుల చప్పుళ్లు, ప్లేట్ల చప్పుళ్లు వినవస్తూంటాయి. అంతా గందరగోళంగా వుంటుంది.

స్క్రీనుకు దగ్గరగా, గోడకానుకుని వేరే బెంచీమీద కూర్చొనిఉంటుంది విమల. తలదించుకుని కాలిగోటితో పగిలిన గచ్చునుండి మన్ను పెల్లగిస్తూ — ఆమెకు రెండు వైపులా ఇద్దరు స్త్రీలు - పక్క బెంచీమీద కూర్చున్న వ్యక్తుల క్రీనీడలు వాళ్లని కొంత కప్పేస్తున్నాయి. చాలా మంది వాళ్లను గమనించినట్టు ప్రవర్తించరు. కొద్దిమంది మాత్రం క్రీగంట చూస్తూ ఉంటారు, గ్లాసులు మూతి దగ్గరుంచుకొని.

ఇంతలో స్క్రీను వెనుకనుండి గ్లాసులు నేలబడి పగిలిన సడివినవస్తుంది:

ముస్తాక్ : (గంట గట్టిగా కొట్టి) అసీఫ్! అక్తార్! హుస్సేన్! ప్రపంచం ఉందా మంట గలిపేస్తేరా? నా సర్వస్వం దుంపనాశనం చేసిసేరా లేదా? గాడిద నాకొడుకులు...మిమ్మల్ని నడిగోడ్డు మీద పెట్టి చిత్రవధ చెయ్యాలి ... [ముగ్గురు సెర్వర్లూ వచ్చి నిల్చుంటారు టేబిలుముందు] ఒంటిమీద తెలివి లేదురా? ఒళ్లు కొవ్వెందా.. లేక మీరూ తలో డ్రామూ పుచ్చుకున్నారా... నీ కెన్నిసార్లు చెప్పేరా హుస్సేన్! గాడిద కన్నా కనాకష్టంగా ఉంది నీ మెదడు....

హుస్సేన్ : అది నా తప్పేం కాదండి... తప్పెవర్దో తెల్సుకోకుండా ఎందుకండీ ఒకర్ని నింద చేస్తారు?

ము : ఎందుకు నిందచేస్తానా? బావుంది! నువ్వూ ఎదురుప్రశ్న వేసేవరకు ఒచ్చింది నాబతుకు— సరి... సరి...

హు : మీరు సరిగా బోధచేసుకోటం లేదు...

ము : (టేబిలు గుద్దుతూ) అదుగో మళ్లా...నోర్ముయ్యి గాడిదా...ఎవరుచేస్తే నేం...మీలో ఏవొక్క— నా తప్పు అందరిదీనూ...

హు : అదేటండీ ... అలా గంటారు ఎవడో తప్పుచేస్తే నే నేంచేసేను .... మస్య...

ము : పెద్ద లాహోర్ వయిపోయేవే లాహోర్! విన్నావురా అక్తార్ మీ వాడి ధోరణి ... ఈ పప్పులేం నాదగ్గర ఉడకవ్ ... నే నేదంటే అది పడితే నే ఉండటం... లేకపోతే సెలవు పుచ్చుకోవచ్చు...

హు : అసలుసంగతి వినకండా ఏటండీ? ఇందులో మా ఎవ్వరితప్పు లేదు.

ము అదికూడానా పైగా ... దుకాణం అంతా ధ్వంసంచేసి... భేష్!... భేష్!

హు వినకుండా...

ము నేను వినదల్చుకోలేదు...

హు ఆ తప్పంతా మీ దేనండి...

ము (ఆశ్చర్యపోయి, కోపంతో) ఆఁ? ఆఁ? ఏఁటేఁటి పేల్తున్నావ్?

హు ఆ తప్పంతా మీ దేనండి...

ము నాదా ....తప్పంతా నాదా! ఆ గ్లాసులు బద్దలవడం నాదా తప్పు..ఒళ్లు తెల్సుకుని మాట్లాడు.

# కాంతిలేని దీపాలు

హు : గ్లాసులు పెట్టే టేబిలు కాలు ఏనాడో విరిగి ఉంది... మీ కెన్నిసార్లు చెప్పినా లెక్కేపద్దా? ఇవాళ అది విరిగూరుకుంది పూర్తిగా...

ము ఏమిటీ...? స్టూలు కాలు విరిగిందా... ఇన్నాళ్లు ఎలా నిల్చుంటూ వచ్చింది.. ఇవాళ విరగడానికి...మీరు దాన్ని ఏమీ చెయ్యక పోతే ఎందుకు విరగబడుతుంది?

[అందరూ సంఘర్షణ జరిగే వేపు చిత్రంగా చూస్తూ ఉంటారు.]

బిల్లు చెల్లించడానికి వచ్చిన ఒక వ్యక్తి: ముస్తాక్ భాయి....దీని కింత రాద్ధాంతం ఎందుకూ? చూసేవా నీ బేరం పోతున్నాది...ఏదో సర్దుబాటు చేసుకోవాలి కాని...

ము ఏమిటి సర్దుబాటు చేసుకోవడం చిన్నా ఎన్నిసార్లు నోరు పారేసుకున్నా ఇంతే...

వ్య : మనిషన్నవాడికి ఓర్పుండాలి... ఓర్చాలి దీన్నన్నా... నువ్వు గ్లాసులు పోయేయనే ఇదయిపోయేవా నీదే ఇదై

ము అదేమిటి? నువ్వూ నన్నే ఎపచేస్తావా చిన్నా? అందుకే వాళ్లకి కళ్లు నెత్తికొచ్చేయి..

వ్య నువ్వు తప్పర్థం చేసుకోకు భాయి... నేనెప్పుడూ ఎవ్వరికీ కష్టమయే మాట మాట్లాడను...అంతా నీ మంచి కొరకే చెప్తుంట... చూడూ... ఆ స్టూలుకో లేనాడమో అర్ధో, రూపాయో ఇచ్చి బాగుచేయిస్తే ఎంత బాగుండును?

ము అదుగో మళ్ళీ...

వ్య (తాగుడువల్ల జోగుతూ) చెప్పింది విను: బతుకులో అన్ని కష్టాలే .... అన్నీ ఆటంకాలే ... వాటిని ఎదురుకొనే వస్తువనే ధయిర్యమంటారు ... గాంధీ చెప్పినట్టు ... గాంధీ ఏం తక్కువ్వాడు కాదు సుమా... మా గొప్పవాడు...మాకన్న మీకే ఎక్కువ సాయం చేసేడు... ఈ ప్రపంచం అంతకీ చేసే డనుకో...

ము : అదుగో నాకు తెల్సు.. అప్పుడే వేదాంతం లోకి దించుతున్నావ్...

వ్యక్తి: ఛిఛీ! అది కాదు. నా ఉద్దేశం...ఆఁ.... అయితే కష్టాల్నెదుర్కోవాలి ప్రతివాడూ .. మాటవరసకి నే నున్నానా... ఇంతో అంతో చదువుకున్నా నా....

ము : (స్వరం తగ్గించి) ఏం చదువుకున్నావ్ భాయ్? ఎప్పుడూ ఆ సంగతే చెప్పలేదే....

వ్యక్తి: ఆఁ ఏదో రెండో ఫారం ... మానాన్నన్నప్పుడు చెప్పించేడు ... చదువుల కేంలే కాని ముఖ్యంగా లోకజ్ఞానం ఉండాలి ... అయితే ఇంతకీ నే చెప్పే దేంటంటే .... నేనూ జీవితంలో ఎన్నో కష్టాలనుభవించేను... చూసేవా .... రెండేళ్ల కిందట నా పెళ్లాం పోయింది...అదంటే నా కెంత ప్రాణమో మీ అల్లాకి తెల్సు ... అప్పుడప్పుడు చెయ్యి జేసుకున్నా ... ఆ పాటి ఖాయిదాలో ఉంచాల్లే ఆడదాన్ని .... ఆకళ్లు...ఆముక్కు ... అంతా ఎలా ఉంటే దనుకున్నావ్ ... ఆ సినీమాస్టారెవరు... అందంగా ఉంటుంది ... సీతాపహరణంలో ఏదో చిన్న వేషం వేసింది...దాన్లా ఉండేది... నేనంటే తగని ప్రేమ...ఒకసారి పట్టలేక బుగ్గ కొరికేసింది ... కండక్కుండా .. పిచ్చెత్తిం దనుకున్నాను...అది ప్రేమకి చిన్నం అంది...

ము : (ఆత్రంగా) అరె చిని...ఆఁ! ఐతే...

వ్య : అయితేనేముంది ... పోయింది నా ప్రాణం ... నేను చచ్చిపోయేను అది పోవడంతో...ఆ తరవాత ఇదిగో నా అందాలభరిణ వచ్చింది. దీన్నుంచుకొని మరి పదినెలలయిందా ... ఒక్కనాడు ... మచ్చుకి ఒక్కనాడు ... ముద్దుగా ఉన్నపాపాన పోలేదు ... చెప్పుకుంటే సిగ్గుకాని...(గొంతు తగ్గించి) చెప్పుకుంటే సిగ్గుకాని...దాంతో నేను పడేబాధ పైనున్నవాడికి తెల్సు...కాని ఏం చెయ్యటం.. దాన్నొదల్లేను...దాన్నొదల్లేను...

ము : (మరింత ఆశ్చర్యంగా) అంత అందమయిన దంటున్నావే...ఏంకష్టం చిన్నిగా...

వ్య : ఏం చెప్పడం తమ్ముడూ . సిగ్గు . సిగ్గు . (మెల్లిగా) నన్ను చూడటంతోనే విరగబడి నవ్వుతుంది. అదేదో దానికి సరదాగా ఉంటానట నేను...కొత్తలో రెండు రోజులు బాగానే అయిపోయింది...ఆతరవాత ప్రారంభం.... .. సిగ్గు... సిగ్గు తమ్ముడూ...... ఎక్కడ్నించి తెచ్చిందో ఆ కొరడా....దాంతో కొట్టడం ప్రారంభించింది...అవులా నడవమంటుంది... అప్పుడు కమ్చీతో కొడుతుంది......ఒళ్ళల్లా రక్కి రక్తాలు కారుస్తుంది——...ఏం చెప్పను భాయి....ఐనా ధైర్యం వదల్లేదు...అందుకనే ఈ తాగుడు...ఇప్పుడు వెళ్లిపోతాను దానింటికి...అదేం చేసినా, దాన్ని చూస్తేనే చాలు నేను మైకంలో పడిపోతాను...

ము : (తల ఊపుతూ) బాగుంది...చాలాబాగుంది... గమ్మత్తుగా ఉంది......(సెర్వర్లతో) పాండి వెధవల్లారా....మరోసారి ఇలాఅయితే జాగ్రత్త.

వ్య : ఆఁ! అది...అలా ఉండాలి ఓర్పు గుణం... ఓర్చాలి...ఓర్చాలి.......బతుకుని ఓర్పుతోనే మొయ్యాలి...

ము : ఏంటో చిన్నా...వెర్రి వేదాంతం.......బతుకేమిటి...మొయ్యడమేమిటి...బతుకులో కష్టాలున్నాయంటే ఒప్పుకుంటాను కాని.. ...దాన్ని అంత ఎక్కడిదీసి చెప్పడానికేమీ లేదోయి. పిచ్చిపిచ్చిగా ఆలోచించి బుర్ర పాడుచేసుకోడం తప్పించి...

వ్య : ఎంత సులువుగా కొట్టి పారేసేవోయి...ఎంత సులువుగా...ఒక్క సంగతి తీసుకో......ఈ నిముషం నే చెప్పబట్టేకదా ఓర్పు ఒచ్చింది. లేకపోతే వాళ్ళని నువ్వు పనిలోంచే తప్పించి ఉంటే వాళ్ళెంత బాధపడుదురు. అయినా ఒచ్చిన ప్రతికష్టానికీ విధిని తిడతాం కాని...ఆ కష్టాలు, ఒకరిభావాలొకరు, ఒకరి పరిస్థితి ఒకరు...అర్థంచేసుకోకుండా చేసిన పొరపాట్లవల్ల వచ్చిన వని గ్రహించం...బతుకు సులువైనది కాదు అన్న ఆలోచన లేకపోబట్టే....ఈ కష్టాలకి అంతుకనుక్కోం మనం ..సులువుగా ఏదో తెలియని శక్తిమీద పెట్టి ఆలోచన, ఆతృత, తలనొప్పి తప్పించుకుంటాం...

ము : నువ్వు నెయ్యి చెప్పు...లతు చెప్పు... జీవితం అంటే బతకడమే నాకు...అంతకు మించి నాకేం అర్థంకాదు...

సెర్వరు కేక: బిల్లు రెండ్రూపాయలు...

వ్య : ఆఁ! రెండ్రూపాయలే! రెండు రూపాయలయిపోయింది! ఎంత ఒళ్లు తెలీకుండా తాగేసేను...

ము : పాపం...మనసు స్థిమితంగా లేదా మరి...ఈ మనస్సు బాగుండకపోడం...ఎక్కువ ఆలోచించబట్టే కామోసు...ఇలా ప్రతీవాడూ.... ఆలోచించి మనస్సు పాడుచేసుకుంటే నాకెంత లాభం...

వ్య : నీ స్వార్థం తగలడ...(నవ్వుతూ) ఏంటోయి.. ప్రపంచమంతా బుగ్గయిపోవాలని నీ ఉద్దేశమా ఏం ?

ము : ఏదో అనేశాను...మనసుకు తట్టింది...ఉద్దేశాలడుగుతూ కూర్చుంటే నా తరమా చెప్పడం...

వ్య : అహహాహ....(కొద్దిగా గొంతు తగ్గించి) అవును కాని చిన్న సంగతి...మనస్సు పాడవడంవల్ల పర్సు తేవడం మరిచిపోయేను....రేపిచ్చేస్తాను. నీ బిల్లు...ఏమీ అనుకోకు...

ము : (ముఖం చిట్లించి నవుతూ) అనుకోడానికేముందిలే కాని...నువ్వేం పైవాడివా ఏం కాని...చూడు...జేరం కిందటి నెలకీ ఈ నెలకీ దిగజారిపోయింది...అహాఁ.. నీ డబ్బు ఇప్పుడిచ్చేవుని కాదు. ప్రతీదానికీ టాక్సు ఎక్కువై కూర్చుంది...ఎలా గడుస్తుంది చెప్పు దినం...నువ్వన్నట్టు కష్టాలగురించి నేనూ ఆలోచించవల్సి వస్తుందేమో...

వ్య : (నవ్వుతూ) అప్పుడు నీ దుకాణం అంతా నువ్వే తాగేయవచ్చు...హా...హా...హా...

ము : హా...హా...హా.. హా...

వ్య : (ముస్తాక్ భుజంమీద తడుతూ) ఒస్తా మరి... (తూలుతూ పోతాడు)

ము : (ముఖం చిట్లించి) బర్మాక్ వెధవ...

[రెండవ టేబిలుదగ్గరకూర్చున్న ముగ్గురువ్యక్తులు, ఒకరిభుజాలమీద ఒకరు చేతులు వేసుకుని తాగుతూ ఉంటారు...మొదటివ్యక్తి అప్పటి వరకూ జరిగిన సంభాషణ విని ... ముఖాన్ని తిరిగి గ్లాసు వేపు తిప్పుతాడు ... రెండోవ్యక్తి మాత్రం తీక్ష్ణంగా విను లున్న బెంచి వేపు చూస్తూ ఉంటాడు ... మూడో వ్యక్తి ఆమ్లెటు ప్లేటుతో యుద్ధం చేస్తూ ఉంటాడు ... ఒక చేత్తో గ్లాసు పట్టుకొని...]

మొ. వ్య : (గది పైకప్పు చూస్తూ) ఏటో...ఏటో... పచ్చగా అగుపిస్తోంది..అదే టలా గాడుతోంది.. అర్రె...అర్రె...ఏటిలా డేన్సు చేస్తోంది... ఆ ఇంగిలీసు ఫిల్ములోలాగ...అస్సి...అస్సి... సడన్ స్టాప్! బ్రేకులు బాగా పట్టినాయి .... ఫోర్డు 51 మోడలా? ఆఁ ... కాలిరిగిందా? సరే ... సరే ... ఎక్కు ... * నక్కా ... పురుగా ... ఇస్సి దీరికేనా ... ఏటో యి చెప్పొచ్చినావ్ ఇచ్చింత్రం...

రెం. వ్య: (మూడో వ్యక్తివేపు తిరిగి) ఏటోయి... మనోడు ఫస్టుగేర్లో ఉన్నాడు...ఏం పేలిందేటి పైసా....

మూ. వ్య: ఏదో అలాగే ఉంది ఎవ్వారం...నా బండిని దార్లో కోసీసేడు...ఆడి బండినిండా పురుగులే...

మొ. వ్య: (పైకే చూస్తూ) తాగి సూడు..తినిసూడు.. తాక్కుండా...తినకుండా సూడు... నీ బతుకులో పేమని...అస్...ఏం సెప్పినావోయి.. పోతే పోయిందికాని...ఒరే దొంకా....సూసి

---

* నక్క: డ్రయివరు భాషలో డబ్బు ఇవ్వకుండా ప్రయాణం చేసేవాడు....

పురుగు: లారిలో డబ్బిచ్చి ఎక్కే ప్రయాణీకుడు..

నాన్నా ఆ సినిమా...ఏం యాక్టుసేసి పారేసి నాడా...(ముఖం చిట్లించి) ఏట్రోయి... అలా చూస్తున్నావ్...ఏటుందా ఒయిపు... ఆస్...ఏటిది...ఏటిది...నా కళ్లే...నా కళ్లే..

రెం. వ్య: ఒరే సింహాద్రీ...నీ కొంటిమీద తెలివి నేదు...అట్టే పేలకు...బాగుండదు...అంతా పెద్దమనుసులున్నారు...

మొ. వ్య: పెద్దమనుసులా...ఓర్రా...పెద్దమడిసి నా కన్నా...ఇలా రమ్మను..నువ్వు పెద్దమడిసివా.. ఆ రంగడు పెద్దమడిసా...

మూ. వ్య: ఏట్రోయి...రంగడంటున్నావ్...హుం.. ఇవాళ పూటెక్కిందని నోటికొచ్చినట్టు పేత్తే ఊరుకుంటా ననుకున్నావేటి..బులుపు తీసేస్తా.

రెం. వ్య: ఊరుకోరా రంగీ...ఏదో ఒళ్లు తెలీకనీసి నాడు...దాని కింత...

మొ. వ్య: ఏట్రా...నన్ను ఓడిపిస్తావుట్రా? నీ తల్లి సిగ ... (బెంచీమీంచి లేస్తాడు ... ఒక్కసారిగా ఆగి) ఆస్! అదా సంగతి......ఇంకేం? అది సెప్పవేం...ఏదో రంగురంగుల్లా అవుపిస్తే ఏటో అనుకున్నాను. ఇప్పుడు తెల్సిందె.....(విమలున్న బెంచీవేపు నడుస్తూ) నీ కడ్డొచ్చినానదా నీ కోపం...నీ కెందు కుండాలా అనుమానం... నే నే...

రెం. వ్య: (లేచి...పెద్దనోరుతో) ఎళ్ళకెళ్ళకు....నే సెప్తున్నా...పెమాదం ఒస్తుంది......ఇదుగో ఇంకోసారి సెప్తున్నా...అమ్మగ్యని కూచుంది. ...దాని కుడివేపు దాన్ని ముట్టేవా నీ ప్రాణం నిల్వు...

మొ. వ్య: ఓపోసి.. నూసాన్లేవోయి...ఇలాటి కబురెన్నో యిన్నాం...ఆ ఏటా సినీమా...ఎవరా అందులో ఈరోయిన్....అదు ముద్దొట్టుగుంటాడు ...ఏం మొగం దాన్ది...ఎవర్తాి అది...

(నుదుటిమీద వ్రేళ్ళతో కొట్టుకుంటాడు)

రెం. వ్య: ఒరే...యెర్రి ముదుర్తోంది...నడుం గిడుం జారగొట్టేస్తాను...

మొ. వ్య: (వినిపించుకోకుండా) ఆఁ...దాన్లాగుంది. (అటువేపు నడుస్తూ) ఏం కళ్లు...ఏం కళ్లు... నిజంగా ఆ ఇంగిలీసు స్టారే...వెరీ గుడ్ ...... (టేబిలుమీద గుద్ది) నలిపేస్తాను...దాని రక్తం పిండి...

రెం. వ్య: (ఛటాలున లేచి) ఓర్...నా కొండే.... దాన్ని ముట్టుకున్నావంటే ప్రాణం నిలు... జాగర..

[మొదటి వ్యక్తి చరచరా వెళ్ళి విమల కుడి ప్రక్కనున్నామెను రెక్క పట్టుక లాగుతాడు. ఆ స్త్రీ మాట్లాడకుండా బెంచీమీదనుండి లేస్తుంది...అత డామెను రెండు చేతులతోనూ పైకెత్తి చేతులలో ఆమెను మోస్తూ కదనానికి సిద్ధంగా ఉంటాడు...ఆమె ముఖం ఎఱ్ఱబారుతుంది...సిగ్గువల్ల]

రెం.వ్య: (వచ్చి భుజంపట్టుక ఆపి) దించీ...దాన్ని క్కడ దించీ...లేకపోతే తల పగలేసి....

మొ. వ్య: కుక్క యెదవా......(కాలెత్తి బలంగా తంతాడు రెండో వ్యక్తిని)

రెం. వ్య: అమ్మో! (క్రిందపడతాడు)

[రెండో వ్యక్తి ఆమెను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకొని బైటకు పోతూ ఉంటాడు]

ము : ఏయి...బిల్లు.. బిల్లు...పైసా ఇక్కడ చెల్లించి మరీ కదులు...(కుర్చీనుండి లేస్తూ) ఏయి... నిన్నే...

[సెర్వరు కేక: నాలుగు రూపాయలు...]

మొ. వ్య: (ముస్తాక్ ఉన్న టేబిలు దాటుతూ) బిల్...గిల్...సై జాంతా......నీ కేమన్నా కావలిస్తే ఆ రంగిగాడ్నడుగు ..

[ముస్తాక్ పట్టుకోబోతాడు...కాని ఆ వ్యక్తి ఒక్క గంతులో వీధిలోకి పోతాడు]

ము : ఒరేయి...అక్తార్ ....హుస్సేన్... రండ్రా.... రండ్రా....వీడి తాడుతెగా...వీ డెవడో... వేగం.... వేగం...అదుగో పారిపోతున్నాడు.... పట్టుకోండి...నాలుగు రూపాయలు... ఒకటి కాదు రెండు కాదు...పైగా దాన్నెగరేసుక పోతున్నాడు...డబ్బిచ్చేటట్టు లేడు దానికీనీ. ఇచ్చినా ఇవ్వలేదని చెప్పేస్తుందా బాడ్ఖావ్.

[ముగ్గురు సెర్వర్లూ వచ్చి నిలబడతారు.. ... ఇంతలో క్రిందపడ్డ వ్యక్తి దులుపుకుంటూ వస్తాడు.]

వ్య : మీ కెందుకీ శ్రమ...వాడి పిలకట్టుకుని గొర గొరా ఈడ్చుకొస్తాను...ఆడి ప్రాణం తీసేస్తా నీయేళ...సూస్తూండండి...ఇదిగో ... (చిటిక వేసి...వీధిలోకి ఒక్క గంతు వేస్తాడు.)

ము (అరుస్తూ)ఓయి...ఏమయ్యోయి...నీ డబ్బులు ...వోయి...వోయి...

[సెర్వరు కేక: మూడున్నర...]

ము నా కొంప తీసీసేరు.. నాలుగు...మూడున్నర.. ఏడున్నర ... (సెర్వర్లను చూస్తూ) ఇంకా ఏమిటి చూస్తున్నార్రా...రబ్బరు బొమ్మల్లా.. వాడ్ని పట్టుకోండి...వేగం..(ఇద్దరు సెర్వర్లూ వీధిలోకి పరుగెడతారు). నన్ను దుంపనాశనం చేసీసేరు...వీళ్ళ సిగా...

[కుముద ప్రవేశిస్తుంది...మెల్లిగా అడుగులు వేసుకుంటూ... లేత ఆకుపచ్చరంగు చీర... దానికి కనుగుణంగా ఆ రంగే కల జాకెట్టూ... చెదిరిన ముంగురులు కళ్ళలోకి పడుతూ ఉంటయ్ ...వాడిపోయిన ముఖం...ముఖంనుండి వచ్చే చెమటని చవుకరకం పౌడరు ఇంకజేస్తూ ఉంటుంది....మెడలో చిన్న హారం... చేతులకు రెండు జతల గాజులు...గిల్టువి...గ్యాస్ లైట్ కాంతిలో బంగారంలా మెరుస్తూ ఉంటాయి.]

ము : (ఆమెను చూసి ధోరణి మారుస్తాడు) ఓహోహో...కుముదా దేవిగారా ... దయచెయ్యండి...దయచెయ్యండి.. తమ రాకతో రెలోపమయ్యా ఇక్కడ ... మీరులేక చిన్నబోయిం దీస్థలం...రండి ... లోపలి రండి.... అలా నుంచున్నారేం?

[కుముద రెండడుగులు వేసి ముస్తాక్ టేబిల్ వద్ద నిలబడుతుంది, తల క్రిందకు వంచుకుని]

మర్యాదలో ఏమన్నా లోపం జరిగిందా... కొత్త సత్కారా లేమన్నా చెయ్యాలా ... అలాంటి వేవన్నా అయితే క్షమించండి...

కుముద : (ముస్తాక్ కళ్ళలోకి తీక్షణంగా చూసి) చాలా సంతోషించాను మీ ఆదరణకి...

ము : ధన్యుణ్ణి.

కు : ముస్తాక్...చాలీమర్యాద ... ఇంక కట్టిపెట్టు అసందర్భపు ప్రలాపం...

ము : అసందర్భపు ప్రలాపనా ... నా దసందర్భపు ప్రలాపనా? నిజమే....నా దెప్పుడూ అలానే ఉంటుంది...నీ కొక్కర్తికే కాదు ... అందరికీని... నేను స్వార్థపరుణ్ణి. కాని నా స్వార్థానికి హద్దుమాత్రం ఉంది ... నా స్వార్థంకోసం ఇంకొకరి జనంనం పాడుచెయ్యను...వీలుంటే స్వార్థంనుంచి కొంచెం త్యాగంకూడా చెయ్యగలను.... కాని ఆ హద్దులలోమాత్రం ముక్కుకి సూటిగా పోతాను...అందుకే తక్కిన ప్రపంచానికి నాది అసందర్భపు ప్రలాపనలా ఉంటుంది...

కు నీ స్వార్థంగురించి నిజానిజాలు నా కనవసరం... నీధోరణి మార్చుకుని జ్ఞాపకంచేసే నంతే...

ము చాలా సంతోషం ఈ సహాయానికి...

కు కొమ్మల్ని నరుక్కు రావడ మెందుకు ముస్తాక్— వారంరోజులాయి ఇక్కడికి రానందుకేగా ఈ అతిమర్యాద?

ము : వారంరోజుల సొమ్ముబాకీ ఉన్నందుకూడా ... మరిచినట్టుంది ... ముక్కుకు సూటిగా పోతాను స్వార్థంలో...

కు : వారం రోజులా?!

ము : ఎందు కుండదూ ఆశ్చర్యంగా? నా సంగతి నీకసలు జ్ఞాపకం ఉంటే నేకదూ?

కు : ముస్తాక్.. డొంక తిరుగుడు మాట లెందుకు? నేను నీ కివ్వవల్సింది నాలుగు రోజులదే... రోజుకు అర్ధ చొప్పున రెండు రూపాయలు నీకు ముడతాయి...

ము : రెండ్రూపాయలా? రెండా! అల్లా! నిజమన్నదీ ప్రపంచంలో ఉందా?

కు : ఎందుకంత ఆశ్చర్యం? నీ బాధ పడలేకే వారం రోజులయి రావడం మానుకున్నాను... ఇవుగో నీ రెండు రూపాయలూ...

ము : అబద్ధాలాడడం కూడా నేర్చేవ్? నువ్వేదో నీతి ఉన్నదాని వనుకున్నాను...అయినా ఈ రకానికి నీతులుంటా యనుకోడం నాదే పొరపాటు...

: మాటలు సరిగ్గా రానీ...

ము సరిగ్గానే వస్తున్నాయి......నా మాటలు. నీ ధోరణే పెడదారి పోతోంది...నాకు నాలుగు రూపాయ లొస్తాయి... వారం రోజులు నా దుకాణంమీద కూర్చున్నందుకు రోజుకి అర్ధ చొప్పున. ఆ రోజుని ఇక్కడేదో తిన్నావ్... దాని బాపతు...

కు : వందలూ వేలూకోసం అబద్ధంఆడితే అర్థ ముంది కాని రెండు రూపాయలకోసం ఇన్ని అబద్ధా లెందుకు ముస్తాక్—

ము : నా మాటలు అబద్ధాలా...ప్రతీదీ చిట్టా వేసి ఉంచేను...చూసుకోవచ్చు...

కు : నిజం స్వయంగా తన చేతులతో రాసిందా నీ చిట్టా...నీ చేతులేకదూ రాస్తా? ఆరోజు ఇక్కడ తిన్నబాపతు అయ నేచెల్లించేసేను...

ము : ఎవడూ?

కు : (ముఖం ఎర్రబారగా) నన్నారోజు తీసుకవెళ్లినాయ నే...

ము : ఏం అబద్ధాలు! ప్రపంచమేం ఇలా తగలడిపోయింది.

కు : నీవంటి నీతిమంతు లుండబట్టే...

ము : నావంటి నీతిమంతులా...ఎత్తిపొడుస్తున్నావ్ నన్ను ...ఓసి దిక్కులేనిదానా నువ్వా నన్నెత్తి పొడవడమే..రోడ్డు తుడిచేదీ నన్నెత్తి పొడవడమే...నీకన్నా అదే కొన్ని విధాల నీతిమంతురాలేమో...అన్నీ వదిలీసిన నీకు...

# కాంతిలేని దీపాలు

కు : అనవసరమైనవి మాట్లాడుతున్నావ్...ఇదిగో నీ రెండూ...

[టేబిల్ మీద పడేసి విమలున్న వేపు వెళ్ళ

ము : ఎందుకీ రోషం...ఏం నిన్నేమన్నా ముష్టి అడుక్కుంటున్నానా ఏం? పంతమొస్తే నాతో పంతమే...డబ్బుని కూడా లక్ష్యం చెయ్యను... కాలవలో విసిరేస్తా నీ రూపాయలు...

కు అడుక్కోడంకన్న కనాకష్టం...నా దగ్గర అబద్ధాలు చెప్పి వసూలు చెయ్యడం, రోడ్డుమీది ముష్టివాడి తలకొట్టి దోపిడి చెయ్యడం ఒక ఎ.. ఆ పని కొంత నయం...వాడికన్న దరిద్రుడెవడో చెయ్యగలడా పని. కాని ఇక్కడ ఈపని చేసేది నీతులు కూసే పరమ దరిద్రుడివి..

ము : శృతి మించిపోతోంది నా ఓర్పువల్ల. మానాన్ని అభిమానాన్ని మంటగలిపి, సిగ్గూ లజ్జా నడి రోడ్డుమీద నాట్యం చెయ్యడానికి వదిలి... ఒంటి నమ్ముకొనే ఒక కులటని నమ్మడం...

కు : (ఆవేశంతో) ముస్తాక్!

ము : (వినిపించుకోక) నమ్మడం నాదే తప్పు...నడి రోడ్డుమీద బట్టలిప్పుకొని నాట్యం చెయ్యమంటే చేస్తావ్ ఈ క్షణం..కాదు పట్టపగలు.. ఒక రూపాయి చూపిస్తే...

[కుముద ఆవేశం పట్టలేక ముస్తాక్ దవడమీద కొడుతుంది.]

కు : తిండికి లేక ఎందుకూ కొరగాని ఒంటిని అమ్ముకున్నాను ... (పతివాడూ చేసేదదే ... కాని మనస్సు నమ్ముకోలేదు .... ఒంటికి బానిసనై, దానికోసమని మనస్సుని పురుగులుపట్టించను...

ము : (చెంపతడుముకుంటూ) నీకు మేలుచేసినందుకు తగినకృతజ్ఞతే చూపించేవ్ ... ఇదిగో నీముష్టి రెండ్రూపాయలు...అవి నాకనవసరం .. ఇక వెళ్లవచ్చు కొట్టువదిలి...

కు : నువ్వు నాకుచేసే మేలుకి నేను తెలిపే కృతజ్ఞత రోజు కర్థచొప్పున నీకు ముడుతూనే ఉంది...ఆ రెండురూపాయలూ నీవి ... కాలవలోవిసిరేసుకో కావాలంటే...ఇంక కొట్టువదల్డం విషయమూ...నేనొక్కర్తెనూ వదిలి వెళ్లనని నీకు తెల్సు...నాతో కూడా తక్కినవాళ్లని తీసుకుపోతాను ... అప్పుడు నీ దుకాణాని కొచ్చేబేరం సగం తగ్గిపోతుందని నీకు తెల్సు....

ము : ఆఁ...ఏమన్నావ్...

[కుముద ముస్తాక్‌ని లెఖ్ఖచెయ్యకుండా చరచరావెళ్ళి విమల ప్రక్కను కూర్చుంటుంది... ముస్తాక్ వెర్రిగా ఆమెవైపు చూసి తల దించుకుంటాడు...]

విమల : కన్నీళ్లెందుకు ... ఈమాటలకేనా ... ఇంత సున్నితమైన మనసైతే ఎందుకుపనికొస్తావ్... గుండె రాయిచేసుకోవాలి...

కు (చీర చెరుగుతో కళ్లు తుడుచుకుంటూ) నువ్వు చెప్పేందీ నిజమే విమలా ... మనస్సుకీ సున్నితత్వానికి చోటులేదిక్కడ...ఇలానే బతకాలి కామోసు .... కాలపు ప్రతినిముషానికి తరిగిపోతూ .... మనస్సుని ఎంతరాయిచేసుకున్నా ఒకమూలనించి మానవత్వం తిరగబడుతూనే ఉంటుంది తనకున్న కొంచం శక్తితోనే.... మనం మనస్సు లేదనుకున్నవాళ్ళందరి సంగతీ ఇంతేనేమో .... కాని ఎంత తొక్కిపట్టినా అది కొన్ని ఘడియల్లో మన బందాలని తెంపుకుని పైకి పొర్లివచ్చి ప్రళయనాట్యం చేస్తుంది. ఆ ఘడియలే ఎంతో పవిత్రమయినవి...

విమ : ఇంత తెలివయినదానివి, నిన్ను చూస్తే జాలి వేస్తుంది...నీ బతుకిలా తెల్లవారుతూ ఉంటే చూసేందుకు కష్టంగానే ఉంది...

కు తెలివి కేముంది విమలా......అనుభవం నేర్పిన పాఠాలే ఇవి. నువ్వు నామీద జాలిపడడం మరింత బాధకి తప్ప మరెందుకూ ఉపయోగం లేదు.

[అలసటతో గోడకు చేరబడుతుంది. ఆమె కళ్లు అప్రయత్నంగా మూతలు పడతాయి]

: ఎంత నీరసంగా ఉన్నావ్...కుముదా...... కళ్లెంత లోతుకి పోయేయి...ఏమన్నా సుస్తీగా ఉందా?

కు (కళ్లు సగం విప్పి చిరునవ్వు నవ్వుతుంది)

వి : నీ ముఖమే చెప్పేస్తోంది......వేరే ప్రశ్న ఎందుకు......వాడేదో మాటన్నాడని వారం రోజులయి రావడం మానుకుంటావా? నాతో చెప్పంటే నేనేమన్నా సాయం చేసిఉందును ...ఈ వారమయి ఏం చేసేవ్ ...

కు : (మరోసారి నవ్వి) ఏం చేస్తాను....ఇంకేం చెయ్యగలను...వాడి మొహాన డబ్బు పారేసే వరకు తృప్తిలేకపోయింది.

వి : సరిగా తిండయినా లేకుండా...

కు : (చెయ్యి నిర్లక్ష్యంగా గాలిలోకి విసిరి)పిచ్చి....

[ఇంతలో పెద్దపెట్టున బూట్ల చప్పుడు- సతీష్ వస్తాడు సుడిగాలిలా.... కాకీ పంట్లాంలోకి

దూర్చబడ్డ తెల్ల కమీజు. అక్కడక్కడ మర కలుపడి...క్రాఫింగు చెదిరి కళ్లలో పడుతూ ఉంటుంది......కళ్లు చింత నిప్పుల్లా మెరుస్తూ ఉంటాయి. ముఖంనిండా, చేతులనిండా చెమట కాలువలై పారుతూఉంటుంది...లోన ప్రవేశించాక నలుమూలలా కలయజూసి ముస్తాక్ ఉన్న టేబిల్ దగ్గరకు వెళతాడు, నిర్లక్ష్యంగా జోగుతూ...]

సతీస్: (ముస్తాక్ టేబిల్ మీదనున్న గంటను గట్టిగా చాలాసార్లు వాయించి ముస్తాక్‌ని చూడకుండా బెంచివైపు చూస్తూ:)

ఏయి! ఎవరిక్కడ?...ఏం? పీనుగుల కొంపలాగుంది...ఏ వీట్లో కల్సిపోయేరంచనూను... (మరోసారి గంట వాయించి) ఏయి! మిమ్మల్నే ...అంతా ఇడియట్సుల్లా ఉన్నారు.. ఏడీ దీని ప్రొప్రయిటర్? ఏ సొరంగంలో దాగున్నాడ

[ముస్తాక్ కుర్చీమీంచిలేచి తెల్లబోయి చూస్తూ ఉంటాడు. టేబిల్ దగ్గర తాగుతున్న వాళ్లూ కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూస్తూ ఉంటారు.]

ఏం? అలా చూస్తారేం? చెప్తూఉంటే చెవులు కన్నాలు పడ్డాయా ఏం చెప్మా? గొంతు పగిలేటట్టు అరుస్తూఉంటే కూడా వినిపించదా? స్కౌండ్రల్సులా ఉన్నారు మీరంతా...

[చరచర నడిచివెళ్లి 'స్టాండ్ స్క్రీను' ఒక్క విసుగున ప్రక్కకు లాగుతాడు...మండుతున్న పొయ్యి...దానిమీద పెద్ద పెనం.. క్రిందపడి పగిలిన గ్లాసులు...మరొక చిన్న ద్వారం కొనవస్తాయి ... సెర్వర్లు విస్తుపోయి చూస్తూ ఉంటారు.— విమల, ప్రక్కనున్న స్త్రీ, కుముద, లేచి నిల్చుంటారు. సతీస్ వాళ్ళని లెఖ్క చెయ్యకుండా టేబిల్ గుద్దుతాడు పిడికిలితో...]

సతీస్: (ఒక సెర్వర్ని చూసి) నువ్వేనా ప్రొప్రయిటర్వి...నాకు తెల్సు...ముఖాలబట్టి ఇట్టే చెప్పేస్తాను ఎవడెవడో..ఇలాటి దుకాణాల, ప్రొప్రయిటర్లెలా ఉంటారో నాకు తెల్సు ..

[కొంచం ఆలోచించి, టేబిలు మరింత గట్టిగా గుద్ది] కమాన్...ఆఁ...బ్రాందీ...విస్కీ... జిన్....ఛా ఛా....అవేమంత మంచివికావు... ఫారిన్ ఉందా., షోర్డ్ వైన్ వైట్ లేబిల్ ... ఛా ఛా ... అవేమీ మంచివి కావు. సిగ్రామ్స్? అదీ లాభంలేదు...అదేమిటి చెప్మా దానిపేరు ... ఆ...ఆ...చాంపీన్... చాంపీన్...పన్నెండుబుడ్లు....కన్‌ఫర్మ్‌డ్... చాంపీను పన్నెండుబుడ్లు....క్విక్...క్విక్ ... ఏమలా చూస్తారు?

[ఇంతలో ముస్తాక్ ఆశ్చర్యంనుండి తేరుకొని, ముఖం చిట్లించి సతీస్‌దగ్గరకువెళ్లి, భుజం గట్టిగా తడతాడు ... సతీస్ గిరుక్కున తిరిగి వెనుకకు చూస్తాడు].

సెర్వరు : (సతీస్ చెవులో) ఇతనే ప్రొప్రయిటరు...

సతీస్ : ప్రొప్రయిటర్?.. ఓ....నువ్వు కాదన్నమాట ...నయమే...(సెర్వర్ చెవిలో) పశువులా ఉన్నాడు మీ ప్రొప్రయిటరు ... (ముస్తాక్ వైపుతిరిగి) మిమ్మల్ని కల్సుకున్నందుకు చాలా సంతోషం...ఆఁ ... నేనేమిటి ఆర్డర్ చేసేను...ఆఁ ... చాంపీన్ పన్నెండుబుడ్లు....

ము : తాగొచ్చేవా? మతి చలించిందా? నువ్వసలు మనిషిలా కనిపించవ్ ... వచ్చిన దగ్గర్నించీ చూస్తున్నాను నీసైఖరి .... (ఇదివరకు విరిగిన గ్లాసులు చూపిస్తూ) ఆ స్టాంపంత జోరుగా లాగేవు ... ఆ గ్లాసులన్నీ చూసేవా ఎలా విరిగాయో? ఎవడిస్తాడాసొమ్ము .... నీఅబ్బా .... నీతాఁతా?

[భుజమీ్మదనున్న ముస్తాక్ చేతుల్ని ఒక్క విదళింపుతో తప్పించుకుంట దూ సతీస్]

అర్రెర్రే...రౌడీలా ఉన్నావ్...పోలీసుని పిలుస్తా....

[సతీస్ ముస్తాక్ భుజాలు పట్టుకొని, మెలికిగా తిప్పి వీపుమీద పిడికిలితో గుద్దుతాడు]

అమ్మో!...నీసిగా...అబ్బ ! ... ఒరేయి ... వెధవల్లారా...ఒరేయి హుస్సేన్!

స : (వికటంగా నవ్వుతూ) అహాహాహ...చాంపీనోయి...చాంపీన్ తేవోయి...డజన్ బుడ్లు.. అధిక ప్రసంగం చెయ్యకుండా...ఏమిటి చూస్తున్నావ్ మింగేసేటట్టు...ఏం? వీపుమీద తట్టేనని కోపమా? నీమీద నాకు ప్రేమ తప్ప కోపం నా కెప్పుడూ లేదు...డబ్బివ్వనని అనుమానమా? ఆ అనుమానం ఉంటే ఈ లోకంలో నీలాటి పరమదరిద్రు డింకో డుండడు...

[జేబునుండి వందరూపాయల నోట్లకట్టల్ని తీస్తాడు...వాటిని గాలిలో ఊపుతూ...]

ఇదిగో...ఇదిగో ... వెయ్యి....రెండు వేలు...

మూడు వేలు...పది వేలు ... ఓరి స్టుపిడ్..డబ్బు గురించేనా నీ అనుమాన మంతా...

[విరగబడి నవ్వుతాడు—ముస్తాక్ విస్తుబోయి ఆశ్చర్యంగా చూస్తాడు డబ్బువేపు...ఒక్క క్షణంలో అతని ముఖానున్న కోపం మటు మాయమౌతుంది... పెదవులమీద చిరునవ్వు మెరుస్తుంది]

ము : (చేతులు ముందుకు చాపి) ఓ! తమరా...తెలీ లేదు; క్షమించాలి...జ్ఞానం లేని పసలాన్ని.. వెధవని ... అ(ర్రె(రే ... ఎంత పనయిపో యింది...ముందే తమరు ఫలానా అని.... ఔను...నా బుద్ధిలేనితనం గాని ... తమర్ని తమ రెలా చెప్పుకుంటారు...నేను తెల్సుకో వాలి కాని...స్వతహాగా మరి నే నెందుకున్న ట్టిక్కడ...

[సతీస్ ముస్తాక్ ముఖంలోకి ఒక క్షణం చూసి మరి విరగబడి నవ్వుతాడు.]

ము : (చేతులు నలుపుకుంటూ) హి. హి. హి.. హి! ఔనౌను...నా తెలివి తక్కువతనానికి నవ్వక ఏం చేస్తారు...ఏవో గాడిదని...తమకి కుషీగా ఉంటే నవ్వండి...తిట్టండి నన్ను....తన్నండి కూడా... తెలివిలేని వెధవని...

స : (పొట్ట పగిలేటట్టు నవ్వుతూ) ఇడియట్!

ము : చిత్తం...చిత్తం...తమ ఇడియట్ నే నేను.... ఏమిటి సెలవిచ్చేరు తమరు..? ఆఁ...చాంపీన్ (మెల్లగా చెవిలో) ఇక్కడంతా కంట్రీయే.... కాని తమలాంటివారికని... ఎవ్వరికీ తెలీకుండా ఉంచేను చాంపీన్...జిన్నూ...గిన్నూ మిడిల్ క్లాస్ లేకుండా ఏకదమ్ ఫస్ట్ క్లాస్! ఏక్ దమ్!

స : (నవ్వుతూ) ఓరి రాస్కెల్......నువ్వయితే బ్లాక్ మార్కెట్ కూడా చేస్తున్నా వన్నమాట. కట్టే టాక్సు ఎగవేసి...

ము : చిత్తం....చిత్తం...తిట్టండి....ఉత్త పశువుని.. అంతా కడుపు గురించే బాబూ...అంతా కడుపు గురించే...డబ్బు బాబూ......డబ్బు...... అహాహా!

స : డబ్బు!...(విరగబడి నవ్వుతూ)అహాహాహా... డబ్బు! (నోట్లకట్టలు గాలిలో ఎగరేసి అందు కుంటూ) డబ్బు! అహాహాహా!

ము : (ఎగురుతూ పడుతూ ఉండే నోట్లకట్టల్ని ఎగా దిగా చూస్తూ) చిత్తం....చిత్తం!

స : ఇంద నోట్ల కట్టల్ని...తీసుకో...ధర్మం... ముష్టి...ముష్టివాడి వేనా నువ్వు...

ము : (చేతులు నలుపుకుంటూ) చిత్తం ... ముష్టి వాణ్ని..కాదు... అంతకన్న కనిష్టుణ్ణి... రోడ్డు తుడిచే ... కాకి .... అంతకన్నా కూడా కని ష్టుణ్ని.. ఈ ముష్టి వెధవమీద దయ ఉంచండి.. తమదయ! ఇహిహి...

స : (నవ్వుతూ జుత్తులోనికి (వేళ్లు పోనిచ్చి) నా దయ...అహాహా...

[నోట్లకట్టల్ని గదికి రెండువైపులా సత్తువతో విసరి]

పరిగెత్తు ... రెండూ ఒక్కసారి తేవాలి ... క్విక్....రెంతు...ఒక్క సెకెండుటయిము..

[ముస్తాక్ జారిపోతున్న షెరాయిని ఎగదీసు కుంటూ...ఊపిరితియ్యకుండా రెండుకొసలకి కూడా పరుగెత్తి నోట్లకట్టల్ని సతీస్ దగ్గరకి తెస్తాడు..గదిలో ఉన్నవారంతా ఆశ్చర్యంగా చూసి గొల్లుమని నవ్వుతారు...]

స : లాభం లేదు ... నువ్వు ... ఒట్టి మొద్దవతారా నివి.. తే...ఆకట్టలు...

[అసంతృప్తిగా పిగా నోట్లకట్టల్ని అందిస్తాడు ముస్తాక్]

ఎందుకలా చూస్తావ్ ... పడేస్తాలే ముష్టి ... ఆఁ...చాంపీన్...క్విక్...అందరికీ...ఇక్క డున్న అందరికీ..ఎంత డబ్బయినా ఫరవాలేదు ... నువ్వూ తాగు ... నీ సెర్వర్లనీ తాగనీ .... రండి! అందరూ....ఇంకా అనుమానమా?...

ము : అబ్బిబ్బిబ్బి!! తమదగ్గరా...తమ కాలిబూటు ధూళినిపోలను... నేనా తమని అనుమానించటం .... కాని....ఈ నామరూపాల్లేని వెధవల కందరికీ ఎందుకుబాబూ?....అంతా ఉట్టి చెత్తవెధవలు...

స : ఓరి స్వార్థపరుడా..నీ గుండెల్నించి పచ్చి పురు గులు రాల్తాయి...అందరూ తాగాలి...లేక పోతే ఇప్పుడే...

[దుకాణంనుండి పోయేందుకు ముందు కడుగు వేస్తాడు.]

ము : (చేతులు కట్టుకుని తొట్రుపాటుతో) తమ కుషీ...తమ ఇష్టం... నే న్నెవ్వణ్ని కోన్ కిస్కాగాణ్ని తమని ప్రశ్నించేందుకు... ఒరేయ్ హుస్సేన్...అక్తార్...

[హుస్సేను...అక్తారు అప్పుడే దుకాణం ప్రవే శిస్తారు...ముఖాలు వెలవేసి.]

ము : చిత్తం...చిత్తం... బుడ్డీ ఏభై రూపాయలు పెట్టి కొన్నానండి. ఇహిహి...తను కొట్టబట్టి లాభం లేకుండా...

హు : (నసుగుతూ) దొరకలేదండి ... ఎక్కడికిపో యేగో మరి పత్తాలేదు...

ము : పోనీ ముష్టివెధవలు పోతేపోయేరు ... (కన్ను గీటి) పదండి బాబుగారి కాళ్ళమీద పండండి.. అంతా బాబుగారి కటాక్షం...ఊఁ...

[ఎందుకు పడాలో అర్థంకాక ఇద్దరూ సంకో చిస్తూ ఉంటారు.]

స : అక్కర్లే దక్కర్లేదు ... ఉత్త స్టుపిడ్‌లా ఉన్నావ్... నే చెప్పిందేమిటి నువు చేస్తున్న దేమిటి? ఊఁ ...చాంపీన్...

ము : ఆఁ...ఆఁ...చాంపీన్ .... చాంపీన్... పరుగె త్తండి...అక్తార్....ఇంద తాళం.... ఆ గది... అందులోవున్న బుడ్లన్నీ పట్టా... వేగం.. వేగం ....ఒక్క సెకెండులో రావాలి....

[అక్తార్ తాళంచెవు లందుకొని పరుగెత్తుక వెళ్ళాడు.]

ఇహిహి .... మొద్దువెధవలు .... తమలాంటివా ళ్లొచ్చినప్పుడు ఎలా ప్రవర్తించాలో తెలీదు.. ఐనా వాళ్ళ నని ఏం పన్లెండి...తమలాంటివాళ్లు ఏ నూరేళ్ళకో ఓసారి వస్తారు.

స : (నవ్వుతూ) అయితే నేను రావడమే తప్పంటావా?

ము : అమ్మమ్మ...సరిగా అర్థం...అ హాఁ హాఁ... నాదే పొరపాటు. క్షమించండి...తమని అర్థం చేసుకోడంలో నేనే పొరపాటు పడ్డప్పుడు వాళ్ళనగా ఎంత ఉ న్నా... ఇహిహి...

స : డబ్బు గడించడంలో మాత్రం తెలివున్న వాడిలా కానొస్తున్నావ్.

ము : ఏం తెలివి...నా తెలివి గాడిద తెలివి.. అంతా ఒక్కటే....నా తెలివిని మెచ్చుకోవాలీ? ఏదో దినం గడవడమే కష్టమయిపోతున్నాది... ఇహిహి....తమలాంటివారి తెలివితేటలు...

స : (నవ్వుతూ) ఓరి చవటగాడిదా.

ము : (గుండెలమీద కొట్టుకుంటూ) ఓ తిట్టండి... తిట్టండి...ఇహిహి... తమ ఇష్టం...నా తల మీద కాల్తో తన్నండి...

[అక్తార్ గంపనిండా బుడ్లు తెస్తాడు]

: (బుడ్లను చూసి) దట్స్ రైట్! దట్స్ రైట్! గుడ్ స్టఫ్...

స : ఏభై...ఇంతేనా...బుడ్డీ ఏభైయేనా...

ము : ఏభై అన్నానా? కాదండి.. కాదండి...తమరు పరాకు చిత్తగించేరు.

స : ఛస్! నోర్ముయ్యి...ఇప్పుడే....

ము : క్షమించండి...నాదే పొరపాటు. లెక్క చెప్ప టంలో...బుడ్డీ వంద రూపాయలు పడ్డాదండి. మతిలేని వెధవని మరి...కుక్క కన్న కనాకష్టం అయినవాడ్ని...

స : (మొదటి బెంచివైపు నెళ్తూ పెద్ద గొంతుతో) ఆల్ రైట్! ఆల్ రైట్... వేగం సెర్వ చెయ్యి. ఒక్కడ్నీ వదలకుండా...అందరూ ఉండండి. పార్టీ...మీ అందరి గౌరవానికీ పార్టీ...

ము : బాబుగారిగౌరవానికీ శ్రేయస్సుకీ ముఖ్యంగా..

స : నోర్ముయ్యి...ఇడియట్...

ము : చిత్తం...తిట్టండి....తమకాలి...

స : (టేబిల్ వద్దకువెళ్లి నిల్చొని) మీ అందరి గౌర వానికీ ఈపార్టీ ... తాగండి ... తినండి ... (ముస్తాక్ వైపు తిరిగి) తినడానికేమున్నా....

ము : ఓ! తప్పకుండా ... నా దుకాణమంతా తినే యండి...హుస్సేన్! అక్తార్! అన్నీ వేగం సెర్వ్ చెయ్యండి...ఊఁ ... ఒక్క నిముష మన్నా ఆలశ్యంవద్దు...

: (మారుమ్రోగే గొంతులో) తాగండి...నాట్యం చెయ్యం డానందంతో...వీధులలో గెంతండి ... నడివీధుల్లో ... మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి...పరుగెత్తండి...యుద్ధం చెయ్యండి ...కుస్తీ పట్టండి...అంతా స్వేచ్ఛ .... అంతా ఆనందం...

ము : అచ్ఛా! అచ్ఛా! (సెర్వరు పానీయం, కట్ లెట్సు సర్వ్‌జేస్తూ ఉంటారు)

: (ఒక గ్లా సందుకొని) మీ కివే ఆనందానికి ఘడి యలు ... విలువైన నిముషాలు .... మీరంతా సామాన్యమానవులేనా? కౌనని నాకు తెల్సు... ఈ హోటల్లో బెంచీలెక్కి తాగండి ... ఆ కాల్తున్న పెనంమీద నుంచొని తాగండి.... రోడ్డుపక్కని కాలవల్లో పొర్లుతూతాగండి... స్నానం చెయ్యండి పానీయంలో...అహహ.... (బల్లగుద్ది) ముస్తాక్...నువ్వో గ్లాసందుకో...

[ముస్తాక్ ఒక గ్లాసు తీసుకుంటాడు—ముస్తాక్ గ్లాసుకి తన గ్లాసు తగిలిస్తూ]

డౌన్ విత్ ఏరిస్టోక్రసీ!...

డౌన్‌విత్ కేపిటలిజమ్!

[గ్లాసులోని చాంపేన్ ఒక్క గుటకలో తాగే స్తాడు. అంతా పెద్ద కేకలు వేస్తూ తాగుతూ తింటూ ఉంటారు. కుముద నీరసంగా గోడకు చేరబడి జరిగేది వింతగా చూస్తూ ఉంటుంది. సతీస్ దృష్టి అకస్మాత్తుగా ఆమె మీద పడు తుంది.)

: (గ్లాసు నేలపైవిసిరి) మై గుడ్ గాడ్...గర్ల్స్! మార్వెలస్! ఏం ముస్తాక్...ఎంత అందంగా ఉంది ఆమె ముఖం...ముస్తాక్!

: కుక్కలు...చిత్త కుక్కలు బాబూ అవి.... రోడ్డుమీది బజారుకుక్కలవి ... ఇహిహి... దమ్మిడీ కూడా ఆశించి ఒంటినమ్ముకొనే గజ్జి....

: (కోపంతో) నోర్ముయ్యి!

(సతీస్ చెయ్యిపట్టుకొని) ముఖం తేటని చూసి మోసపోతున్నారు బాబూ తమరు...తమడబ్బుకి తగనివవి...తమకి కావలిస్తే ఈ క్షణాన స్వర్గం నించి రంభని తెప్పించగల...ఊం అనండి... చాలు.

(ముస్తాక్ మాటలు వినకుండా కుముదవైపు వెళ్తాడు. స రావడం చూసి కుముద లేచి నిలబడుతుంది. సతీస్ ఆమెను సమీపించి ఆమె ముఖాన్ని చేతులతో పైకెత్తి ఆమె కళ్లలోకి తీక్షణంగా చూస్తాడు...కుముద మాట్లాడ కుండా నిల్చుంటుంది వాడిన ముఖంతో)

: (ఆమె బుగ్గల్ని రాస్తూ) ఎంత అందమైన ముఖం...ఆ పెదవు లెంత అందంగా చిత్రించ బడ్డాయి ... ఆ కళ్లలోనుం చేదో వెలుగు పైకొస్తోంది...ఎంత దేదీప్యమానంగా ఉందా వెలుగు..(చేతులతో ముఖం కప్పుకుని) చూడ లేనా వెలుగు...చూడలేను..ఏం కాంతి!... కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి...

[తిరిగి ఆమె కన్నులలోకి చూసి]

ఎంత ఔదార్యం...ఆ జ్యోతికి..ఎటొస్తోంది.. నా వేపే! నా వేపే...ఒద్దు...ఒద్దు...

[ముఖం తిప్పుకుంటాడు]

ము చిత్తకుక్కలు బాబూ అవి...చిత్తకుక్క... ఒక కుళ్ళిపోయిన ఎముక దానిముందు పడే యండి పరుగెత్తుక వస్తుంది.

స (ముస్తాక్‌వైపు తిరిగి) నీపేరు? పూర్తిది.

ము (చేతులు కట్టుకొని ఎక్కం వప్పచెప్పినట్టు) ముస్తాకాలీబేగ్...కాని నన్నందరూ ముస్తాక్ అంటారు.. బేయిగ్ అంటేనే నాకు తృప్తి

ఐతే ముస్తాక్...ఇందాక ఏమన్నాను...డబ్బు నీకు ముష్టి వేస్తానన్నానుకదూ..ముష్టి అడుగు తావా.

ము ఇహిహి...తమ చిత్తం...తమ చిత్తం....ఏం చెయ్యను తమరు చెప్పినపని..ముష్టికాదు... ఇంకా కనాకష్టమైన పనన్నా తయార్.

[సతీస్ గబగబ మండుతూండే పొయ్యివద్దగకు వెడతాడు.]

ముస్తాక్!

[ముస్తాక్ వెనువెంటనే పరుగెడతాడు.]

చూసావా ఈ నోట్లకట్టల్ని....ఇదిగో మండు తోందే...ఈ మంటలో పడేస్తాను....ఎంతో తెల్సా....ఆ డబ్బు? పదివేలు..ఆ మంటలోంచి అవి కాల్చకుండా తీసుకోవాలి... *

ము : విస్తుపోయి తేరుకొని) పదివేలు...నడిమంట... (గుండె బాదుకుంటూ) పదివేలు....మంటలో ...ఒద్దు...ఒద్దు...పదివేలు...ఒద్దు... అబ్బ! అంతడబ్బు! మీ కాళ్ళమీద పడతాను...మీ పాదధూళి నెత్తిన జల్లుకుంటాను...మిమ్మల్ని నా భుజాలమీద పెట్టి ఊరేగిస్తాను...ఒద్దు... ఒద్దు...కాల్చవద్దు...

స : (మెల్లగా) ఆ అమ్మాయి పేరు?

ము (వణుకుతున్న గొంతుతో) కు...ము...ద... కు...ము...ద...

స : (గట్టిగా) కుముదా!

---

* ఇక్కడ ఈ చిన్ని భావం (అంటే డబ్బు మంటలో వెయ్యడం ... కాలేలోగా తీసు కోడం ... మాత్రం ... డాస్టవిస్కీ ... "ఇడి యట్" నవల చదివాక తట్టింది. అందులో వేరొక సన్నివేశం అనుకోండి...కడం అంతా నా స్వంతం

[కుముద ఆశ్చర్యపోతుంది... కాని ఆలోచించి అతనిదగ్గరకు వెళ్తుంది—సతీష్ ఆమె కళ్లలోనికి కొన్ని సెకండ్లుచూసి ముఖం తిప్పుకొని]
పడేస్తున్నా....నిప్పులో.
ఆఁ... రెడీ.

ము : (అమాంతంగా సతీష్ కాళ్లమీదపడి బూట్లు గట్టిగా పట్టుకొని వణుకుతున్న గొంతుతో) ఒద్దు...ఒద్దు...డబ్బు! డబ్బు! మరోటికీ మరోటికీ కాదు... డబ్బు... నా జీవితం... నాశనం.

స : నీ జీవితం ఎందుకు నాశనం ముస్తాక్? ఆ మంటలోంచి తీసుకుంటే నువ్వు దాని కర్తవౌతావు... పైగా అది నా డబ్బు!

ము : ఔను...ఔను...మీ డబ్బే...మీ డబ్బే... కాని చూస్తూ చూస్తూ...ఒద్దు...ఒద్దుబాబోయి ఒద్దు...అది డబ్బు...మరోటికి మరోటికి కాదు.

[ఆశ్చర్యపోతున్న కుముద కళ్లలోకి సతీష్ చూస్తాడు.]

స : (ఆవేశంతో) ఆ కళ్ళలోని జ్యోతి, కాంతి కన్న ఎక్కువ వేగంతో పోతోంది. దాని ననుసరించి పోతోంది చీకటిరేఖ...ఆ చీకటిలో కొట్టుకుంటూ ఎందరో మానవులు...ఆ వెలుగు వైపు ఆశతో చూస్తూ....ఆ..ఆ...ఆ జ్యోతి తేజస్సు ఎక్కువౌతోంది... ప్రపంచమంతా ఆవరించిందో కాంతి...చూడలేను... (కళ్లు తిప్పుకొని) చూడలేను...కాని చూడకుండా ఉండలేను.

[గిరుక్కున తిరిగి నోట్లకట్టల్ని మండుతున్న పొయ్యిమంటలో విసిరేస్తాడు. నోట్లు అంటుకొని కాల్తూఉంటాయి.]

స : తీసుకో...అదుగో కాలిపోతోంది...డబ్బు... ఒకటి కాదు...రెండు కాదు...పది వేలు... గెంతు ఆ మంటలోకి వాటితో కలిసితగలబడు...

[సతీష్ కాళ్లు వదిలి మంటదగ్గరకు పరుగెడతాడు ముస్తాక్. నోట్లప్పుడే సగం కాలిపోయేయి. చెయ్యి పెట్టడానికి ప్రయత్నించి మళ్లీ చెయ్యి వెనక్కి తీసేస్తాడు. గుండెలు బాదుకుంటూ కూలబడతాడు.]

స : (కుముద ముఖమెత్తి ఆమె కళ్ళలోకి చూస్తూ) చీకటంతా విచ్ఛిన్నమయింది. ఆ జ్యోతిలో కల్సిపోయారు. ప్రజంతా...ఎక్కడికో ఎగిరిపోతోందా జ్యోతి...

[ఆమె నడుంచుట్టూ చెయ్యిపోనిస్తాడు. అర్థరహితంగా చూస్తూ ఉంటుంది కుముద]

స : చాలు...మరి చూడకా కళ్లతో.

[ముస్తాక్ వైపోకసారి చూసి ద్వారంవైపు నడుస్తాడు. సతీష్ కుముదను తనతో కూడా తీసుకపోతూ...గోల ఎక్కువగా ఉంటుంది.]

ఒక ఎవడో కాంట్రక్కరట ... కాంట్రకరో ... గీర్మాకరో...ఆడు కార్లో కూచొంటే ఆడ్ని నూటు చేసి దోసుకున్నారే...నిన్న రేతిరి... పదిలచ్చలట...ఒకటి కాదు...రెండు కాదు.

ఇం : డయివేరుని కూడా సంపేసినార్రే!

[సతీష్ గిరుక్కున తిరిగి ఈ మాటలాడిన వ్యక్తుల ముఖాలలోకి చూసి తీక్షణంగా...అలా ఒక అర నిముషం చూసి నవ్వులో జోగిపోతాడు... వెంటనే సర్దుకొని కుముద నడుముని గట్టిగా పొదివిపట్టి చీకట్లోకి....పోతాడు] [తెర]

# కుక్కపిల్ల

**శ్రీ చిత్తరంజన్ దేవ్**

అమ్మ నిద్దర పోతోంది; నాన్న గురక బెడుతున్నాడు. చోర్ దా కేక ఎక్కడా వినిపించడం లేదు. గదంతా కటిక చీకటి; నే నెవళ్లకీ కనపడటం లేదు. వాళ్లూ నా కెవళ్లూ కనుపించటం లేదు. కాని నేను కళ్లు తెరుచుకుని చూస్తూనే వున్నాను.

నెమ్మదిగా బయటికి ఉడాయించినే? అమ్మో! అమ్మవి పాము చెవులు; తలుపు తీస్తే మేలుకుని తగలనిస్తుంది. నా కేదో దయ్యం పట్టిందని గడబిడ పడుతుంది.

కుక్క పిల్లలు బయట తిరుగుతున్నయ్. అవి రాత్రి తెల్లవార్లూ బయటే తిరుగుతూ వుంటయ్. నక్కలు వాటికోసం గోరాడుతున్నయ్. టామీ నక్కల్ని తరిమితరిమి తిరిగొచ్చి ఆయాస పడుతోంది. దాని అలుపు నాకు వినిపిస్తూనే వుంది. పిచ్చిముండ! అది నక్కల్ని పట్టుకోలేదు. నక్కలు బలే జిత్తుల మారివి. అవి ఎప్పుడూ ఒంటినే రావు. ఒకటి వచ్చి ఏ గోడమూలనో దొంగతనంగా నక్కి కూర్చుంటుంది. మరొకటి టామీ ముందుకొచ్చి కవ్విస్తుంది పిచ్చిముండ టామీ దానివెంటబడి తరుముకుంటూపోతుంది. ఈ లోగా గోడమూలున్న రెండో నక్క వచ్చి ఒక కుక్కపిల్లను నోట కరుచుకుని ఉడాయించేస్తుంది. ఇలా ఇప్పటికే మూడు పిల్లల్ని తినేసినై.

ఇది ఆలోచించిన కొద్దీ నాకు గాబరాగావుంది: అమ్మను లేపాను.

'కుక్కపిల్లల్ని గదిలోకి రానిద్దామమ్మా!—'

అమ్మ కోపంగా నవ్వింది—'వెధవ జంజాటం, ఇవాళో రేపో వాటిని ఆ పూరచెరువు కాడ పారేయించి పీడా విరగడ జేయిస్తాను'

చూశారా! అమ్మ యేవంటోందో. పూర చెరువంటే యేవిటనుకున్నారు? పూరవతల పెద్ద చెరువు; చెరువంతా యెండిపోయి మధ్య నెక్కడో కాసిని నీళ్లుంటాయి. ఊళ్లో చచ్చిన వాళ్లందర్నీ తగలెయ్యడం, పాతెయ్యడం ఆ చెర్లోనే. చచ్చిన గొడ్లని కూడా అక్కడే కోస్తారు. ఆ చెరువు నానుకునే పెద్ద అడివి. వాటి దుంపతెగా ఆ అడవినిండా కావలసినన్ని నక్కలు.

అమ్మ ఇంకా ఏవంటుందంటే;

'ఆ కుక్కపిల్లలు రోజురోజుకీ పెద్దవై పోతున్నయ్. వాటికి కాస్త బొమికముదిరితే, ఇక నక్కలు కూడా వాటి జోలికిరావు. ఆ కుక్కల నన్నిటినీ యింటినిండా పెట్టుకు కూర్చుంటావా యేవిటి? వాటి కన్నిటికి తిండి యెక్కడనుంచి తెస్తావ్?'

నక్కలకైతే కుక్కపిల్లల్ని తింటుంటే కమ్మగానే వుంటుందనుకోండి; కాని పాపం టామీ ఎంత ఏడుస్తుంది. తను కూడా బిడ్డల్ని కన్నతల్లేగా, అమ్మ అలా అనొచ్చా?—'

ఇంకా చాలా పొద్దుపోయింది. నాకు కంటిమీద కునుకు లేదు. ఊళ్లో గస్తీతిరుగుతున్న చౌకీదారు కేకలు మధ్యమధ్య వినిపిస్తున్నాయి తెల్లగా తెల్లారిపోయింది. ఉషారేఖలు గది కిటికీలోంచి లోపలికి పడుతున్నయ్. ఇరుగు ఇళ్లల్లో నుంచి బాతులు కిచకిచ లాడుతూ బెలబెలా బయటికి వస్తున్నయ్. సూర్యకిరణాలు పడి నావళ్లూ మనస్సూ కూడా వెచ్చబడుతోంది. అమ్మ కేకలు బెడుతోంది:

'ఒరే! శాంతీ! లే! వాటి నన్నిటినీ గోనెలో కుక్కాను—ఒకటే రొదచేస్తున్నయ్. పోయి, పీడా విరగడచేసిరా!—'

'అబ్బ! ఇప్పుడు వాటి కంత తొందరేవిటి?— నక్కలు ఎల్లాగూ అడివిలోకి వెళ్లిపోయాయాయిరి. పొద్దుగూకేదాకా అవి మళ్ళా తిరిగొస్తాయా పెడతాయా? పట్టపగలు తీసికెళ్ళి పారేస్తే యేం లాభం అవి మళ్ళా ఎలాగు నెమ్మదిగా పారాడుతూ తిరిగి వస్తయ్. టామీ వెళ్లి వెంటబెట్టుకురాదూ?—'

'వెధవ నక్కలే కావాలట్రా; వాటిని చెరువు గట్టున ఎవడేనా చూసి, మోజుపడి యింటికి తీసుకెళ్ళి పెంచుకోగూడదూ?'

---

ప్రపంచ కథానికల రెండవ పోటీకి అనుబంధంగా జరిగిన వంగభాషపోటీలో ప్రథమ బహుమతి పొందినకథ.

'పోదూ! ఇప్పుడు నాటి సంగతెవడు చూస్తారూ! కాస్తేమన్నా చదువుకోవాలా అక్కర్లేదా. హోమ్‌వర్కు చేసుకు రాకపోతే మేష్టారు తంతారు, తెలుసా? బళ్ళోనుంచి తిరిగొచ్చిం తరవాత సాయంత్రం తీసుకెడతాలే.'

అమ్మ అంతా విన్నది. ఏవీ! మాట్లాడలేదు గాని బలే కోపమొచ్చినట్టుంది. స్నానం చెయ్యటానికి చెరువుకు బయలుదేరింది. వెళ్ళేటప్పుడు అమ్మ కళ్ళవంక చూశాను. నా గుండె గబగబా కొట్టుకుంది. అమ్మ రేవుమెట్లమీద బిందె పెట్టడం నా గదిలోకి వినిపించింది. మట్టి కుండయితే నూరు చెక్కలై వుండును. ఎంతకోపం!

నెమ్మదిగా కుక్కపిల్లల దగ్గిరికెళ్ళాను. అక్కాయిలూ, చెల్లాయిలూ అన్నీ కలిసి ఒకదాన్నొకటి తోసుకుంటూ వాళ్ళమ్మ దగ్గర పాలు దాగుతున్నయ్. తల్లిప్రేమతో టామీ హృదయం నిండిపోయింది. మాగన్నుగా పడుకుని విశ్రాంతి తీసుకుంటోంది.

పక్కనెవ్వరో వచ్చి కూర్చున్నట్టనిపించి కన్ను విప్పి నావంక చూసింది. మా అమ్మ ఒకొక్కప్పుడు నావంక అలానే చూచేది.

కుక్కపిల్లలు పూర చెరువు పాలుగాలేదు. నాకు తలనొప్పి వచ్చి రెండు రోజులు అలానే ఉండిపోయింది. మూడోనాడు కడుపులో నొప్పివచ్చి పక్కమీద పడుకుని పొద్దుట్నించి సాయంత్రందాకా అలా దొర్లుతూనే వున్నాను. తరువాత నరాల తీపూ అదీ పట్టుకుంది, మరో మూడు రోజులు. తరువాత ఇలాగే మరో జబ్బూ మరో బాధా!

అమ్మకు కంగారెత్తిపోయింది. ఇంట్లోవున్న దేవుళ్ళ ముందర కూర్చుని ప్రొద్దస్తమానం ప్రార్థనలు చేస్తోంది. ఓ! పూజలమీద పూజలు! ఉండుండి నా మంచం దగ్గిరికి పరుగెత్తుకొచ్చి చూసి పోతోంది.

రోజుకు మూడుసార్లు స్నానం చేస్తోంది. మెడకు చీర చెంగు ముడేసుకుని దేవుడి పాదాలమీద తలవేసి బాదుకుంటోంది. ఇదంతా పక్కమీద పడుకుని దొంగతనంగా చూస్తూనే వున్నాను.

అమ్మ పెదవులు మాటమాటకూ నా చెక్కిలిని స్పృశించుతున్నాయి. నాకు చికాకుగా వుంది. లేచి బయటికి వెళ్ళిపోవాలనిపిస్తోంది. అమ్మ నన్ను రెండు చేతుల్లోనూ గట్టిగా అలుముకొని లేవనీయటం లేదు. అమ్మ మాట్లాడుతోంది. ఆవిడ హృదయం వణకిపోతున్నట్టే మాటలు కూడా వణకిపోతున్నయ్.

'మా నాయన గాదు—అల్లా లేవకు—మా తండ్రి గాదు—నీకు చాలా జబ్బుగా వుంది.

లోలోపల నవ్వుకుంటున్నాను—నువ్వనుకుంటున్నంత అమాయకపు పసిబిడ్డను కాదమ్మా అనుకుని. కాని రోజూ తరబడి, గోదుమ జావ, బార్లీ నీళ్ళూ, కొబ్బరి నీళ్ళూ ఈ వగైరా దరిద్రపుగొట్టు తిండితో బ్రతికటమంటే తలప్రాణం తోకకొస్తోంది. కడుపులో పేగులు దహించుకు పోతున్నయ్. ఆరోగ్యంగా వున్నవాణ్ణి అనవసరంగా ఆ మందులు మింగటమంటే ప్రాణంమీదకొచ్చినట్టుంటోంది.

కుక్కపిల్లలు నానాటికి అల్లరి నేర్చుకుంటున్నయ్. ఇరుగుపొరుగు ఇళ్ళన్నీ తిరిగివస్తయ్ వంటగదుల్లోకి కూడా జొరబడుతున్నయ్. వాళ్ళంతా కర్రలట్టుకు వెంటబడుతున్నారు. ఉండుండి గోలగా అరుస్తూ నా పక్క చుట్టూ చుట్టేస్తున్నయ్.

'వెధవ కుక్కలు! అవతలకి తరుమరాదుట్రా?' వాటి బాధ భరించలేక అమ్మకు కళ్ళనీళ్ళ పర్యంతమౌతోంది.

అవి నానాటికి మరీ పేట్రేగిపోతున్నయ్. ప్రతి వాళ్ళనీ స్వంత మనుషులుగా పరిగణించి వ్యవహరించుతున్నయ్.

ఎన్నిసార్లు తరిమినా సరే మళ్ళీ మళ్ళీ వాళ్ళయిళ్ళకే పోతూవుండటం! వాళ్ళు అమాంతం చెవి పుచ్చుకుని పైకెత్తి కచ్చకొద్దీ విసిరి అవతల పారేస్తున్నారు. నా మనసులో ఎంతో బాధగా వుంది. కాని నేనేమి చెయ్యను?—వాళ్ళు నేను వద్దంటే మానతారా?

హిందువుల యింట్లోకి కుక్క దూరటమంటే యేమిటి? కొంప లంటుకున్నాయన్న మాటగాని మరేమన్నానా? వంటయింట్లో వున కుండలన్నీ పగలగొట్టి అవతల పారవేస్తారు.

ఇంకా శ్రోత్రియకుటుంబాలైతే, పురోహితుణ్ణి పిలిపించి, పుణ్యాహవాచనాది తతంగమంతా జరిపిస్తారు.

అవి అలా పెరుగుతున్న కొద్దీ అల్లకల్లోలంగా ఉంది. టామీకి పాలెండిపోయాయి. అయినా అది కనుపించితే చాలు మీదబడి, వట్టి తిత్తులనే పీకుతున్నాయి. టామీ తప్పించుకు తిరగడానికి రోజంతా తంటాలు పడుతోంది. ఇవి దానికోసం ఊరూనాడూ గాలిస్తున్నయ్.

టామీ కూడా అందరి వంట యిళ్ళల్లోకీ జొరబడుతోంది. ఏది నోటికందితే అదల్లా మెక్కేసి పెదవులు నాక్కుంటూ దర్జాగా బయటికి వస్తోంది.

శిశిర ఋతువు; ప్రొద్దుకూకబోతోంది. కొంచం చలిచలిగా వుంది. నేను వరండాలో కూర్చున్నాను. ఒంటినిండా గుప్పటి కప్పుకుని ఒక బుట్ట చేతబట్టుకుని, మా పొరుగింటివాళ్ళ అబ్బాయి, నాటాయ్ వచ్చాడు. ఎందుకొచ్చావని అడిగాను.

# కుక్క పిల్ల

అమ్మ వాణ్ణి ఉత్తర వేపు దర్వాజా దగ్గిరికి పిలిచింది. నేను ఆదుర్దాగా వాళ్లవంక చూస్తున్నాను.

వాడు కుక్కపిల్లల నన్నిటినీ బుట్టలోకి ఎత్తుకున్నాడు. ఒకదాన్ని లోపలపెడితే రెండోది లోపల నుంచి తెయ్యి మంటూ బయటికి దూకుతోంది. నానా తంటాలూ పడి వాట నన్నిటినీ గంపలో పెట్టి గోనె మూతేశాడు. టామీ ఎక్కణ్ణుంచో దూకింది. నాటాయ్ వంక తీవ్రంగా చూచింది. బుట్టలో నుంచి 'కుయ్ కుయ్' మని వినిపించుతోంది.

వంటయింటి గుమ్మంలో నుంచి అమ్మ కేక: 'టా...మీ...'

టామీ గజిబిజిపడి పోయింది. కంగారుగా బుట్ట వంక చూసింది. మళ్లా అమ్మ కేక వినిపించిన వైపు ఆదుర్దాగా చూసింది. దాని గొంతులో ఏదో కళ వళముగా ధ్వని. బుట్టవంక చూస్తే దాని గుండెలు దబదబా కొట్టుకుంటున్నయ్—కేక వినిపించిన దెస చూస్తే నాలుక వెంట నీళ్లు కారుతున్నయ్.

మోసంలో పడిపోయింది. నాలుగు కాళ్ల మీద ఎగిరి అమాంతం పరుగెత్తింది. సందు దొరికిందే చాలునని నాటాయ్, బుట్ట నెత్తినెట్టుకుని కాలికొద్దీ పరుగెత్తాడు. నాకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

తూరుపురేఖలు పొడుస్తున్నయ్. మంచు ముసుగు చీల్చుకుని మసీదులోనుంచి కేక వినిపిస్తోంది దూరాన సాయిబులవీధిలో కాకు లరుస్తున్నయ్. బాతులు బెలబెల లాడుతున్నయ్.

దుప్పటి కప్పుకుని నెమ్మదిగా బయలుదేరాను. నాకు జబ్బుగావుందనే ఇంకా అమ్మ అనుకోవటం. కాని నా మనసులో వున్న మాటమాత్రం నే నెవ్వరికీ చెప్పలేదు.

మాయింటిప్రక్కనున్న మైదానానికి అడ్డంపడి మట్టిరోడ్డెక్కాను రోడ్డు వెంటనేపడి తూరుపుగా పోతున్నాను.

రోడ్డు చాలాచోట్ల గళ్లుపడి వుంది. వాటిమీద తాటిదూలాలు పరిచారు. వాటిమీదనుంచి దాటి వెళ్లాను.

రోడ్డుకు ఎడమపక్క సులాబీ. కుడిపక్క పూరచెరువు. రోడ్డుక్రింది తూముల్లోనుంచి మురికినీరు ప్రవహిస్తోంది. తల పైకెత్తి చుట్టూతా చూశాను. ఒక్కసారి గుండె గభీలుమంది.

ఆ ప్రదేశమంతా కీచుమంటూ నిర్మానుష్యంగా వుంది. చూపు మేర దూరంలో ఎక్కడా నరసంచారం లేదు.

మధ్యలో జడలు విరబోసుకున్న దెయ్యంలా ఒక పెద్ద రావిచెట్టు. ఆ చెట్టుచుట్టూ గోరీదిబ్బలు. చచ్చిపోయిన అనేకమంది పసిపిల్లలు ఆ దిబ్బలక్రింద పెద్దనిద్దురపోతున్నారు. దిబ్బలమీద బిళ్ల గన్నేరు మొక్కలు పూసివున్నయ్. ఆ పువ్వులమీద ఎందరు తలిదండ్రుల కన్నీరు బలికిపోయిందో.

భూమి మీద అనేకమంది మనుష్యులు—గోరీల క్రింద అనేకమంది.

కుక్కపిల్లలు మాత్రం ఏమయాయో కనుపించటం లేదు

చూపు మేర దూరంలో ఎవ్వరూ కనుపించటం లేదు. నా గుండెలు మరింత వేగంగా కొట్టుకుంటున్నయ్. నా శరీర మంతా చలి గుబుల్లాంటి భయ మేదో ఆవరించింది.

ఉన్నట్టుండి ఏదో ధ్వని! ఆ ధ్వని ఏమిటో ఎక్కడనుంచి వస్తోందో తెలియలేదు. తూర్పున సూర్యుడు మాత్రం ఉదయిస్తున్నాడు.

పట్టపగలుగా తెల్లవారిపోయినా ఇంకా నాకు చీకట్లో తిరుగుతున్నట్టుగానే వుంది. నా తలమీది వెంట్రుకలు నిక్కబొడుచుకుంటున్నయ్. గుండెల్లో ఏదో గుబులుగుబులుగా వుంది. ఒళ్ళంతా ఏదో పాకుతున్నట్లనిపించింది. తిరిగి మళ్లీ అదేధ్వని! వెనకా ముందూ చూసుకున్నా ఎక్కడా ఏమీ కనిపించలేదు. గుప్పున, దెయ్యాలసంగతి జ్ఞాపకం వచ్చింది. మనం యెవళ్లకోసం వెతుకుతున్నామో వాళ్లగొంతు పెట్టుకుని దెయ్యాలు మన్ని పిలుస్తాయనీ మాట్లాడతాయని మోసంచేసి యెత్తుకుపోతాయనీ అనేక కథలు విన్నాను.

నాకళ్లు బైర్లు క్రమ్మాయి; కట్టెదుట మనిషి నిల్చున్నా కనిపించనిస్థితి యేర్పడ్డది.

ఆ ధ్వని మరింత తీవ్రంగా వినిపించుతోంది. కాలవక్రింది తూముల వేపు నడిచాను. బ్రిడ్జిక్రింద మోకాటితండా వేసి కూచుని చీకటిగావున్న ఒక తూములోకి తొంగిచూస్తున్నాను. ఒక జంతువేదో ఆ తూములోనుంచి రివ్వున బయటికివచ్చి నన్ను పడదోసేసింది. గుప్పున ఏదో పాడువాసన!

లేచి నిల్చున్నాను. నా పంచా, దుప్పటీకూడా బురద గొట్టుకున్నయ్. చుట్టూ చూశాను; ఎవ్వరూ కనుపించలేదు.

బురద మరకలు కడుక్కోవటానికి నీళ్ళవద్దకు వెళ్లాను. నీళ్లలో ఏవో చిన్నిచిన్ని తరంగాలు లేస్తున్నయ్! 'ఏమిటవి? చేపలేమో. చేపలు ఈదితే మాత్రం అంతంత పెద్దపెద్దతరంగాలు కడతాయా. కొంచెం ముందుకువంగి తొంగిచూశాను.

జీవన మరణసంధ్యలో బాధగా ఏడుస్తున్న రెండుముఖాలు! మునిగిపోకుండావుండటానికి రాత్రి తెల్లవార్లూ అట్టాగే కొట్టుకుంటూవున్నయ్ కాబోలు. అవి అలా శక్తినంతా వినియోగించటానికి ప్రయ

త్నించటంలో ఇంతింతగా ముడుచుకుపోయి కనుపించుతున్నాయి.

నీళ్ళలోకి దునికాను — నీళ్లు జివ్వుమంటూ చలి ఇగంలా వున్నయ్. రెండు కుక్కపిల్లలనూ రెండుచేతులా బట్టుకుని బయటికి వచ్చాను. వాటిని గుండెలకు హత్తుకున్నాను.

గడ్డివున్న ప్రదేశమంతా తడితడిగా వుంది. మనుషులు నడిచి గడ్డి చచ్చిపోయిన కాలిబాటలో వాటిని తెచ్చి పెట్టాను. చలికి గజగజా వణుకుతూ కుయ్యో కుయ్యోమని యేడుస్తున్నయ్. గుడ్డలు పిండుకుని త్వరగా ఆరాలని గాలికి అడ్డుపట్టుతున్నాను.

ఒక రాబందు రివ్వున ఎగిరివచ్చింది; కుక్కపిల్లఅరుపు గాలిలో వినిపించింది — నెమ్మదిగా ఆకాశంలో అంతరించిపోయింది. ఏమీ చేయలేక దేబెముఖం వేసుకుని చూస్తూ నిల్చున్నాను.

కన్నీరు చెక్కిళ్ళమీదుగా ప్రవహించుతోంది. మిగిలిన ఒక్కపిల్లని దుప్పటిక్రింద దాచుకుని ఇంటికి బయలుదేరాను.

అది యింకా యేడుస్తూనే వుంది. రాత్రి తెల్లవార్లూ నీళ్ళల్లో నానింది, చస్తుందో బ్రతుకుతుందో.

మా యింటి ప్రక్కనుంచే ఒక కాలువ ప్రవహించుతూ వుంది. కాలవొడ్డునున్న గంగరావిచెట్టు మొదటవున్న తొర్రలో కుక్కపిల్లను వుంచాను

దాని ఏడుపు విని, టామీ ఎక్కడనుంచో రయ్యిన పరుగెత్తుకొచ్చింది. సంతోషంతో తోక అల్లలాడిస్తూ నేలమీద వెల్లకిలా పడుకుంది. కుక్కపిల్లని దాని పొదుగుదగ్గిర వదిలేసి అవతలకి పోయాను.

అమ్మ కేక లేస్తోందేమో నని భయమేసి చెవులు రిక్కించి విన్నాను. చిత్రమే! ఎక్కడా కేకలు వినిపించటం లేదు. అమ్మకు బాగా కోపం వచ్చి వుంటుంది. కొడుతుందేమోనన్న భయంతో చాలాసేపు ఆ చెట్టు క్రిందనే వణుకుతూ నిల్చున్నాను.

కొన్నాళ్లు గడిచింది. టామీకి, ఎనిమిది పిల్లలకు, మిగిలిందల్లా ఈ ఒక్కపిల్ల. దాని పొదుగు నిండా పాలు. చిన్నదుండ అవన్నీ తాగలేకపోతోంది.

టామీ నల్లగా వుంటుంది. ఇది మాత్రం పాల నురుగులా తెల్లగావుంటుంది. చూస్తే ముచ్చటేస్తుంది.

కుక్కపిల్ల ఆడుకోడానికి, అమ్మ రంగురంగుల గుడ్డ పీలికలతో బంతులు కుట్టింది. వాటితో సర్దాగా ఆడుతూ అది యెప్పుడూ వంటయింటి ముందు వరండాలోనే అమ్మ కాళ్ల చుట్టూ తిరుగుతూ వుంటోంది.

ఒకనాడు దానికి హుషారు పుట్టింది. అమ్మ వరండాలో పోగు బెట్టుకున్న చితుకులన్నీ చెల్లాచెదరుగా చిమ్మింది. దానికి అదో సర్దా! అమ్మ వళు మండింది. ఒక గుంటె పుల్ల పుచ్చుకు వీపుమీద ఒక్కటేసింది. అది 'కుయ్యో!' మని అరిచిందే గాని అక్కణ్ణుంచి మాత్రం పోలేదు. అమ్మ పాదాల మీద బడి ఇటూ అటూ దొర్లింది. అమ్మ నన్ను కేకేసి 'చూడరా ఇదీ' కొట్టినా అవతలికి పోదూ!'

'అవును అస్తమానం దాని కేదో మేపుతూ వుంటావాయిరి. పోమ్మంటే పోతుందా మరి!

ఆ నాటినుంచీ దాన్నికట్టేసి సాయంత్రంపూట మాత్రం కాసేపు వదుల్తూవున్నాం.

ఒకనాడు మధ్యాహ్నం పడుకుని నిద్రపోతున్నాను. నేను నిద్రలేచి చూసుకుంటే పక్కలో కుక్కపిల్ల లేదు. నిద్రపోయేముందు దాలతో కాసేపు ఆడుకుని పక్కలో బెట్టుకు నిద్రపోయాను. అది ఎప్పుడు లేచి పారిపోయిందో పారిపోయింది. అమ్మ నడిగాను; మాళ్ళేదంది.

వెతకటానికి బయలుదేరాను. ఇల్లిల్లూ వెతికి విసుగెత్తి పోయింది. అది ఇల్లు వదిలిపోవటానికి బజారు కుక్కగాదే! ఎవరో కావాలని యెత్తుకుపోయి వుండాలి. అది అందంగా వుండటం చూసి ప్రతివాళ్లూ దానిమీదే కన్ను వేశారు. ఇంతకీ ఎవరెత్తుకు పోయి వుంటారు?

చప్పున జ్ఞాపకం వచ్చింది; పాట్లే తల్లి నిన్న గోల చేసింది — ఒండుకున్న చేపల కూరంతా తినేసిందని. నిన్న ఆ మాటలు మేమెవళ్ళం నమ్మలేదు. ఒకవేళ నిజంగా తినేసిందేమో. నేను పాట్లే యింటివేపు బయలుదేరాను.

ఆవిడవంటయింటికి ఒక అదుపంటూ లేదు. వాన కురవకుండా, కప్పుమీద గోనెచింపులు వగైరా కప్పివున్నయ్. బయటినుంచి చూస్తే పైనున్న వాసంనుంచి వేళ్ళాడుతున్న వుట్టిమీది మసిముంత కనుపించదు. ఉట్టి చేర్లు కూడా నల్లగా బూజేసివున్నయ్. ఆ వుట్టి కూడా చాలా ఎత్తునుంది. అది కుక్కపిల్లకెలా అందుతుంది? అంతెత్తు ఎగిరిందంటే అది ఆలోచించాలిసిన విషయం.

ఆయింటిచుట్టూ బురదబురదగా వుంది. ఎక్కడపడితే అక్కడ చేపపొలుసులూ, బొమికెలూ, నానా గలీజూ. చెడువాసన వేస్తోంది. ముక్కుకు చెయ్యి అడ్డుపెట్టుకున్నాను. ఊడిచిన పెంట పోగంతా అక్కడ ఎన్నియుగాలనుంచో గుట్టగా పోసివుంది. పట్టి మురికిగొడ్లు! వాళ్ల జీవితాల్లో ఎప్పుడూ ఇళ్లు కడుక్కోవటం అంటూవుండదు

పాట్లేతల్లి బొబ్బపెట్టింది:

'ఓహోయ్! చోటాబాబూ! మా పెంటపోగు కుప్పలమ్మట అక్కడేంజేస్తున్నావూ?' —

'మా కుక్కపిల్ల కనుపించిందా?' —

# కుక్క పిల్ల

చోర్‌దా పెద్దపెద్ద అంగలేసుకుంటూ వచ్చి నా చెయ్యిబట్టుకున్నాడు. అతను పెర్లు తిరిగిన వస్తాదు. నన్ను అమాంతం గాలిలోకి ఎత్తి దబాల్న నేలకేసి కొట్టాడు! —’

‘అలా కాదు — ఆ మెయిని తీసుకుపోయి ఆ చెర్లో ముంచెయ్యి వెధవని’—అమ్మ కేకలు. ‘కుక్కపిల్లట. పోస కుప్పల్లో వెతుకుతున్నాడు. నా కడుపు చెడబుట్టాడు. వాడిమూలాన నా బ్రతుకంతా నరకమైపోతోంది.’

చోర్‌దా నుండిపోతున్నాడు: నన్ను వెక్కిరిస్తూ:

‘ఏరా! బుల్లోడా? మెడకి గొలుసు తగిలిస్తే దాని మెడ కందుతుందిగా’ — వెళ్ళి వెతుక్కు తెచ్చుకో—గొలుసు విప్పినందుకు ప్రాయశ్చిత్తం.’

నేను నేలను తాంబేలులా కరుచుకుని అలానే బోర్లబొక్కలుగా పడున్నాను. నన్ను చెర్లో ముంచాలంటే, బలవంతాన నేలనుంచి ఊడబీకాలిసిందే!

అమ్మ చింతమెల్లె పుచ్చుకొచ్చింది. నావీపు హూనమైపోయింది. కాళ్లూ చేతులూ పారజాపేసి చచ్చినవాడిలా పడున్నాను. అమ్మ గొణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయింది. మళ్ళీ రెండుక్షణాలకు తిరిగివచ్చి నాప్రక్కనే కూలబడి, తానుకూడా ఏడవటం మొదలుబెట్టింది. నన్ను తనఒళ్లోకి తీసుకోవటానికి ప్రయత్నించింది. నాకు పెద్దపెట్టున ఏడుపు ముంచుకొచ్చేసింది. గుబులు గుబులుగా ఏడిచేస్తున్నాను.

ఇంతలోనే నాన్న పాదాలచప్పుడు దూరాన వినిపించింది. అమ్మ కంగారుగాలేచి చెరువుకు వెళ్ళిపోయింది. నేను నోరుమూసుకుని పిల్లిలా గదిలో దూరేశాను.

స్నానంచేసివచ్చి అమ్మ నన్ను రహస్యంగా పిల్చింది. నానెత్తి నిన్ని తులిసి నీళు చల్లింది. ఒక తులిసాకు నానోట్లో కూరింది.

ఆసాయంత్రం: ‘హరిహరీనారాయణా’ అంటూ ఒక వైష్ణవస్త్రీ బిచ్చానికొచ్చింది. ఆమె ఎవరివస్తువు లేంపోయినా — ఆవులు పోయినా, సొమ్ములు పోయినా — ప్రశ్న చెబుతుంది. చేతిలోవున్న కర్రతో అమాంతం నేలమీద వ్రాసేస్తుంది.

‘నా కుక్కపిల్లెక్కడుందో చెబుతావ్?—’

‘ఓ! చెప్పేస్తా! — ఒక అయిదణాల కానీ తీసుకురా—ఇప్పుడే చెప్పేస్తా!’

‘తరువాతిస్తాలే—ముందు చెప్పు’—

‘నీకు తెలీదు తండ్రీ! డబ్బులు బిరిలో పెట్టి మంత్రం చెబితేగాని, తల్లి పలకదు’—

అమ్మ నిద్రపోతోంది — లేపితే గూబ కదలేస్తుంది. మెంతులుడబ్బీ లవీ వెతికాను. ఎక్కడా ఏమీ కనుపించలేదు. అమ్మ చీరకొంగున తాళం చెవులగుత్తి వ్రేలాడుతోంది. వణుకుతున్న చేతులతో నెమ్మదిగా విప్పతీశాను.

పెట్టె తాళం తీశాను. అందులో నాలుగణాలే వున్నయ్. మిగతా అయిదు కానులూ దొరకలేదు. అంతవరకే తీసుకుపోయి వైష్ణవ యోగిని కిచ్చాను. తాంబూలం కూడా కావాలి తెమ్మంది. ఇంట్లో వక్కలాకులు ఎక్కడ వుంటాయో నాకు తెలుసు. తెచ్చియిచ్చాను.

“అది యెక్కడికీ పోలేదు—ఇంట్లోనే వుంది. పోయి వూకబస్తాలగడమంచిక్రింద చూడు అంది.

ఆమాటలు ఇంకా పూర్తిగాకపూర్వమే, ఒక్క ఊదుటున పాకలోకి పరుగెత్తి గడమంచి క్రింద వెతికాను. ఎక్కడా ఏమీ కనుపించలేదు. భగ్నహృదయంతో తిరిగి వచ్చాను. నేను వచ్చేలోపుగానే ఆయోగిని, గాలిలోకి గావల్న, అదృశ్యమైపోయింది.

నేను బడి మానేసి అప్పటి కెన్నోరోజులైంది. తిరిగి బళ్లోకెళ్లాను. పిల్లవాళ్లంతా నన్నేదో కొత్తవాణ్ని చూసినట్టు అదోలా చూస్తున్నారు. మాస్టారు మీసంకొసను పంటితో కొరుక్కుంటూ:

‘ఏరా! అబ్బీ! ఏమిటి నువసంగతి! రాతాకోతా నేర్చుకోవటమా — కుక్కపిల్లతో, జీవితం వెళ్లతీసుకోవటమా?’

నేను సమాధానమేమీ చెప్పకుండా తల వంచుకున్నాను.

‘అయితే నీకు ఒక మహత్తరమైనగీతం బోధించవలసివుంది’ అన్నారు మాస్టారు.

తేనెతుట్టెమీద బెడ్డ విసిరినట్టయింది. పిల్లలంతా ఒక్కసారి ‘జాం’మని ఎత్తుకున్నారు.

‘అనగా అనగా కుర్రాడు
కుక్కలపిచ్చి కుర్రాడు!
కుక్కపిల్లకై చక్కనదూకీ
మురికికుంటలో మునిగాడు’—

‘వహ్వా! అది చేసైనా బాగుండును’—అంటూ మాస్టారు పగలబడి నవ్వుతున్నాడు. నాకు చిరాకెత్తిపోయింది. బళ్లోనుంచి బయటికి పారిపోయాను.

బహుశా నాన్నకు ఇది తెలిసిందికాబోలు. ఆయన కళ్లు చింతనిప్పుల్లా వున్నయ్. కాని ఆయన ఇదేమీ కదిలించలేదు.

ఆవేళ మాఘపూర్ణిమ సంత. ప్రొద్దుట్నుంచీ డోళ్లు వినిపించుతూనే వున్నయ్. సంతకెళ్లటానికి నేనూ సన్నాహమవుతున్నాను. నాన్ననీ, అమ్మనీ

అడిగి చిల్లరడబ్బులు పోగుచేశాను. ఆడా మగా, జనం ముచ్చట్లాడుకుంటూ గోడ్డువెంట పోతున్నారు.

ఇంతలో నాటాయ్ పరుగెత్తుకొచ్చాడు. ఆ ఆయాసంలో వాడికి సరిగా మాటే రావటంలేదు.

'శాంతీ! నీ కుక్కపిల్ల!—వాడెవడో సంతలో అమ్మెయ్యటానికి పట్టుకుపోతున్నాడు.

నా నాళాలలో వున్న రక్తం యావత్తూ ఒక్కసారి పొంగింది. ఎవడు, ఎవడా బద్మాష్!

ఆమాట చెప్పీ చెప్పటమే నాటాయ్ రివ్వున మళ్లీ ఎట్లో ఉడాయించేశాడు. ఎటు పోయాడో! నేను అదంతా వెతికాను. ఎవళ్ళూ కనిపించలేదు.

వాడు మళ్ళీ పరుగెత్తుకొచ్చాడు:

'రా! రా! చోర్‌దా వాణ్ణి పట్టుకున్నాడు. ఇద్దరూ ఒకళ్లనొకళ్లు చావగొట్టుకుంటున్నారు?—మళ్ళీ పరుగెట్టేశాడు.

నాకు బలే కంగారెత్తిపోయింది. అయినా బయలుదేరాను. నాటాయ్ మళ్ళీ నాకు ఎదురొచ్చాడు. వాడి చేతిలో, మెళ్ళో ఒక తాడుతో కుక్కపిల్లవుంది. అమాంతంపోయి వాడి చేతిలోవున్న తాడు లాక్కున్నాను. వెంటనే తీసుకుపోయి వంటయింటి వరండాలో వున్న గుంజకు కట్టేసి బయటికి వచ్చాను.

చోర్‌దా ఆ దొంగవెధవను మా యింటిముందుకు పడలాక్కొచ్చాడు. వాడికి ఇంత పెద్ద జీబు తల— చేతిలో ఒక వేణువు కూడా వుంది. వస్తాదుకు మల్లే ఇంతింత బుర్రమీసాలు. చోర్‌దా కంటే చాలా బలంగా వున్నాడు. చోర్‌దాకు చాలా దెబ్బలు తగిలాయి. తల్లోనుంచి రక్తం కారుతోంది.

అమ్మ లోపల్నుంచి బయటికి వచ్చింది. చోర్‌దా తల్లోనుంచి నెత్తురుకారటం చూసి హంగామాగా వారా వీరా అని అరవటం మొదలు పెట్టింది. పిచ్చెత్తిన దానిలా ఇంట్లోనుంచి బయటికీ, బయటినుంచి యింట్లోకీ కంగారుగా తిరుగుతోంది.

నేను ఇంత పత్తీ వైశల్యకరణి (ఒక ఓషధి) తెచ్చాను. చోర్‌దా గర్జించాడు: 'దద్దమ్మ! ఆ ఆకులు నూరుకురా!'—కట్టుకట్టడం పూర్తిఅయిందో లేదో: 'మంటలు, మంటలు' అని నాలుగు మూలల నుంచీ జనం ఒక్కసారి గగ్గోలుగా అరిచారు.

ఎక్కడ ఎక్కడంటూ, అందరూ చకితులై నలుదిక్కులా కలయ జూచారు మాయింటి నడికొప్పుమీద బ్రహ్మాండంగా పొగా మంటలూ కనుపించాయి. ఇల్లు నాలుగు ముఖాలా అంటుకుపోతోంది.

జనం మూగారు. కడవలతోనూ, బానలతోనూ ఎడా తెరిపీ లేకుండా నీళ్లు జారబోసుకొచ్చి మంటలతో పోరాడారు. ఒక ఝాముకు ఎల్లాగయితేనేం మంటలను అదుపులోకి తెచ్చారు గాని బూడిద తప్ప మిగిలిందేమీ లేదు

అమ్మ యేడుస్తున్నది. నాన్న కళ్లల్లో నీళ్లు తిరిగాయి జనం వచ్చి అమ్మనీ నాన్ననీ ఓదార్చి పోతున్నారు.

'కొంగలు పడ్డయిల్లు కోలుకోదు గాని, అగ్నిదేవుడికి ఆహుతైన యిల్లు అంతకు మూడురెట్లు వృద్ధి పొందుతుంది. మరేం బెంగపెట్టుకోకండి. ఈ యిల్లే యిటి లెక్క, అన్ని వాసాలూ, తడికలూ. బిడ్డలున్నారు మీకేం — వాళ్లే బంగారం. ఈ పాకవున్నచోటే మళ్ళా రేపీపాటికి రాజభవనం కడతారు' —

ఏదో కమురువాసన ఆ ప్రదేశమంతా వ్యాపించుతోంది. టామీ బెంగగా అక్కడికి వచ్చింది. మొదట నాన్నగారిదగ్గిరికి వెళ్ళింది. ఆయన మౌనంగా కూర్చుని మాట్లాడలేదు. తరువాత అమ్మ దగ్గిరికొచ్చింది. అవిశదానిముఖంలోకి చూసింది. దాని కళ్లల్లో ఏదో అవాచ్యమైనభాష; అమ్మకి ఏదో చెప్పటానికి ప్రయత్నించుతోంది. అమ్మ దాన్నడిగింది:

'కాజ్లీ ఏమైందో చూశావా?—అది బతికివున్నట్టేనా?'—'కాజ్లీ' మా ఆవు; దూడతో వుంది. మంటలు ఆరపటానికివచ్చినవాళ్లల్లో ఎవరో దాన్ని మెడ విప్పి బయటికి తోలేశారు.

'ఇంతకీ కుక్కపిల్ల ఏదిరా అబ్బీ!' అమ్మ గుప్పున అడిగింది.

నిలువునా కంపించిపోయాను. వంటగది వరండాలో కట్టేశానన్న సంగతి ఎలెక్ట్రిక్ షాక్‌లా జ్ఞాపకం వచ్చింది.

నోటమాట రాక అలానే స్తంభించిపోయాను. వంటయింటిముందు వరండా ఒక పెద్ద బూడిదదిబ్బలా కనుపించుతోంది.

'బెల్లంకొట్టిన రాయల్లే అట్టా నిల్చుంటావేంరా? నువ్వు పూడదీయకపోతే యింకెవరూడదిస్తారు? అసలు కుక్కపిల్ల దొరికిందని ఇంకెవరికి తెలుసురా!'—అన్నది అమ్మ.

లేచి చిన్న తవగాల ఒకటి తీసుకుని వంటగది వరండామీదవున్న బూడిదగుట్ట దగ్గిరికి వెళ్లింది. నెమ్మదిగా పరీక్షచేస్తూ ఆ గుట్టంతా తవ్వి యివతల పోస్తోంది.

'అరి భగవంతుడా! ఎంత పని జరిగిందీ'— ఒక్క కేక పెట్టింది.

'ఏమిటది! కాలు నరికేసుకున్నావా?' నాన్న కంగారుగా అమ్మ వేపు పరుగెత్తాడు.

ఏమి జరిగిందో నా హృదయానికి తెలిసిపోయింది. నా తల ఒక్కసారి దిమ్మెక్కిపోయింది. కళ్లు తిరిగి

పోయినై. నా రెండు కళ్ళమీదికీ చీకటి తెరలు దిగి పోయాయి. చెవులు రెండూ ఘుడీయలుపడి యేమీ వినిపించకుండా పోయింది.

ఒక కలగని నిద్ర మేల్కొన్నాను. ఆవరణ యావత్తూ సూర్యకాంతులు పడి ఆనందంగా వుంది. ఆ మసిబొగ్గుల గుట్టలనన్నిటినీ యెవరు ఎత్తిపోసి వుంటారు? మెరుగులు తీర్చిన పాలరాతి పలకలు పరిచి నట్టుంది ఆవరణ యావత్తూ. నేను అంతసేపు నిద్ర పోయినట్టనిపించలేదు.

ఇంట్లో వున్న సామానంతా కాలి పోయింది. కాని నే నిప్పుడు పడుకున్నది ఒక చక్కని మంచం; ఎవరి దిది? నా మంచం చుట్టూ ఈ టీపాయ్, ఈ బల్లలూ ఇవన్నీ ఎక్కడివి.

నేను మంచం దిగబోతున్నాను. ఇంతలో అమ్మ పరుగెత్తుకొచ్చి నన్ను ఆపి వేసింది. 'దిగొద్దు నాయనా నీకు వళ్లు కులాసాగా వుంటే అంతేచాలు'—

'ఏవిటి నా కేమైంది?'—

'అదంతా తరువాత చెబుతాలే—ముందీ మందు తాగు'—

ఒక చిన్న గ్లాసు నా నోటి కందించింది. నేను తల అవతలకి లాక్కున్నా.

'ఏవిటి వెర్రి!—పిచ్చివాడివా యేవిటి?—వెధవ దిక్కుమాలిన కుక్కపిల్లకోసం ఇంత వెర్రేమిటి. భగవంతుడి దయవల్ల ఆవు బ్రతికింది. అక్కడికి ఎంతో సంతోషించాలి. ఆవు కాలిపోతే ఏమయేదో తెలుసా? మెడను పలుపు బెటుకుని 'అంభా అంభా' అని ఆవులా అరుస్తూ వూరంతా తిరిగి ఇంటింటికాడా బిచ్చమెత్తి ఆ డబ్బులో ప్రాయశ్చిత్తం చేసుకోవలసి వచ్చేది. బుర్ర గొరిగించుకుని గోమయం తిని ఆవు పంచితం త్రాగవలసి వచ్చేది—కాస్త మందు తాగరా అంటే గించుకుంటున్నావు!'

'మరి, నేను తగలడిపోలేనో?'—

'అవేం అవాచకపుమాటల్రా తండ్రీ?'

'అమ్మా! కుక్కపిల్లని ఎక్కడ పారేశావూ?'—

'ఏవిట్రా వెర్రి! కుక్కపిల కూడా పెద్ద హంగామాగా భూస్థాపన కొండంతా జరపాలా ఏవిటి?—ఆ కాలవగట్టుమీద మర్రిచెట్టుక్రింద పారేసి నట్టున్నారు.'

'ఒకసారి వెళ్లి చూసొస్తానమ్మా—ఏం? వెళ్ళి రానా?'

అమ్మ ముఖం ఒక్కసారి పాలిపోయింది. మొండిగా 'అలా వల్లకాదు—డాక్టరువల్లగాదన్నాడు' అని సమాధానం చెప్పింది.

'నామనస్సేమవుతుందో ఆ డాక్టరు కేమన్నా తెలుసునా లేదా?'—

'అవునవును—తెలుసు—నాకు తెలుసు నేను నీతల్లిని'—

'ఏవిటి నీకు తెలిసింది?'—

'నీకు ఆకలేస్తోంది. నువ్వు నిన్నట్నుంచీ అన్నం తినలేదు'—

'అవును నిజమే—బలేగా తెలుసుకున్నావు'–

'సరే వుండు—భోజనం పట్టుకొస్తా?'—

'సరే త్వరగా తీసుకురా!'

అమ్మ వెళ్లిపోయింది. నేను పక్కమీది నుంచి దిగి, బయలుదేరాను. సరాసరి మర్రిచెట్టుదగ్గిరి కెళ్ళి నాలుగువైపులా చూశాను. ప్రక్కనున్న బంజర్లో ఒకచోట రాబందులు గుంపుగా వాలివున్నయ్. వాటిమధ్యగా టామీ పడుకునుంది. ముందు కాళ్లు చాచుకుని తల ఆ కాళ్ళమధ్యకు దోపుకుని పడుకుని వుంది. పిచ్చిముండ! దిగులుగా ఏ మూలోచిస్తోందో పాపం! ఆలోచించటంగాదు. బిడ్డ శవాన్ని రాబందులు ముక్కులతో చీరకుండా హృదయంలోకి పొదువుకుని రక్షింమతోంది. తల్లిహృదయం!

నాకు చాలా ఆశ్చర్య మేసింది—మనకు మల్లే నే టామీకి కూడా మనస్సు వుంది.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ టామీదగ్గిరికి వెళ్ళాను. రెక్కలు రెపరెపలాడించుకుంటూ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, రాబందులు కొంచెం అవతలకు జరిగినై.

పాపం పిచ్చిముండ! బిడ్డను రెండుకాళ్ళ మధ్యనూ పొగుపుకుని వుంది దానికి మాట్లాడటానికి నోరువుంటే ఎంత ఏడిచేదో. బిడ్డా! అని అరిచి ఎంత అల్లాడేదో!

నేను ఇంకా కొంచెం దగ్గరకు వెళ్లాను. టామీ నన్ను చూళ్లేదు. సర్దాగా ఏదో నములుతోంది.

నాకు అనుమానం వేసింది — ముందుకువంగి ఇంకా జాగ్రత్తగా పరిశీలనగా చూశాను.

ఆఁ....ఏవిటి చేస్తోంది! ... ఆ కుక్కపిల్ల కాలు అప్పటికి ఒకటితి నేసింది. రెండో కాలు నములుతోంది!

వెనక్కు తిరిగి వచ్చేస్తున్నాను. మధ్యదోవలో నే అమ్మ నా కెదురైంది. అమ్మ ఎంతో కోపంగా వస్తోంది. ఏదో కేకలెయ్యబోతోంది. ఇంతలో నేనే ఏదో మాట్లాడేశాను.

'వెధవటామీ — తరిమేసెయ్ — వెళ్లగొట్టేసెయ్. అది ఇక నాయింట్లో ఒక క్షణం వుండటానికి వీల్లేదు'—

నేను మాట్లాడే ప్రతిమాటా అమ్మ అతిజాగ్రత్తగా వింటోంది. జగత్తులోవున్న భ్రాంతి యావత్తూ, ఆవిడ ముఖంమీదనే తాండవించుతోంది.

'ఏవిటి నాయనా నువ్వంటున్నది!'—

# రాజ్యాంగమునందలి నిర్దేశిక సూత్రములు

శ్రీ వి. లక్ష్మణరావు

మన రాజ్యాంగమునకు ప్రధానాశయము శ్రేయో రాజ్యసంస్థాపనము. ఈ మహదాశయము మనకు రాజ్యాంగచట్టములో వివరింపబడిన ప్రధాన ప్రాతిపదికలలోనే విశదమవుతుంది. ఇవి ప్రారంభంలోనే వివరింపబడినాయి. మన సర్వతంత్ర ప్రజాస్వామ్య రిపబ్లిక్కు ఆశయాలు:

పౌరులందరికీ—

1. సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయమును సమకూర్చుట,

2. భావస్వాతంత్ర్యము, భావప్రకటనా మత విశ్వాసాదులలో స్వేచ్ఛ,

3. సమానత్వమును, సమానావకాశములను రూపొందించి, వ్యక్తి ఔన్నత్యమును, సోదరత్వమును, జాతి ఐక్యతను పెంపొందించుట."

ఈ ఉన్నతాశయముల కనుగుణంగా, వానికి దోహదంచేస్తూ, రాజ్యాంగచట్టములోని 4 వ అధ్యాయములో ఆర్టికిల్ 37 నుంచి 51 వరకూ కొన్ని 'నిర్దేశిక సూత్రములు' (*Directive principles of state policy*) చేర్చబడినాయి. ఈ సూత్రములు ప్రాతిపదికలో వివరింపబడిన ఆదర్శముల వివరణ, సపుటీకరణ అని చెప్పవచ్చు. శ్రేయోరాజ్యమనునది కేవల మొక స్వాప్నికజగత్తున్నూ, ఊహాగానమును కాక, అది ఒక సజీవమైన ఆశయసాధన, ఒక నిర్దుష్టమైన వ్యవస్థా సంస్థాపన అయినపక్షంలో, దాని వివిధ లక్షణములు, స్వరూప స్వభావములు వివరింపబడాలి. ఈ సూత్రములలో అట్టి వివరణే మనకు ద్యోతకమవుతుంది.

అంతేకాక ప్రభుత్వ కార్యకలాపాలలో శాసనాధికారము ముఖ్యమైనది కాబట్టి, అట్టి శాసనాధికారము ప్రజాక్షేమసాధనకు సద్వినియోగము కావలెనంటే, కొన్ని ప్రధానలక్ష్యములు ఆదర్శప్రాయమైన రాజనీతి అవసరము. ఈ సూత్రములలో అట్టి లక్షణముల వివరణ, రాజనీతి ప్రతిపాదన చేయబడినది. కనుకనే 37 వ ఆర్టికిల్‌లో యీ సూత్రములన్నీ రాజ్యపరిపాలనకు "ప్రాథమికము"లనీ, ప్రభుత్వము చేయు వివిధ శాసనములకివి మార్గదర్శకములనీ యీ సూత్రానుసరణ ప్రభుత్వపు బాధ్యతనీ ఆదేశింపబడినది.

రాజ్యాంగ న్యాయశాస్త్రరీత్యా, యీ సూత్రముల ప్రాముఖ్యతను చర్చించుటకు ముందు, యిందలి వివిధ తరగతులు, వాని సారాంశమును, క్లుప్తముగా యిచ్చుట పొందుపరుస్తున్నాను.

ఈ సూత్రములు రాజ్యపరిపాలనలోని అన్ని హంశములకూ సంబంధించియున్నవి. స్థూలముగా చెప్పవలెనంటే యివి 3 తరగతులకు చెందివున్నవి.

1. దేశీయ పరిపాలనా విధానము—ప్రధాన లక్ష్య వివరణ, ఆర్థిక సాంఘిక సాంస్కృతిక అభ్యున్నతిని సాధించుట,

2 కొన్ని ముఖ్యమైన సాంఘిక, న్యాయశాస్త్ర, పరిపాలనా విధానములకు చెందిన సంస్కరణలు, వాని వివరణ

పైన పేర్కొనిన రెండూ ప్రభుత్వము సామాన్యముగా ప్రజలపట్ల వహించవలసిన బాధ్యతలకు, స్వక్రమ పరిపాలనావిధానమునకు చెందినవని చెప్పవచ్చు.

3 పైవి కాక విదేశీయవిధానము, సామాన్యముగా అంతర్జాతీయ రంగంలో ప్రభుత్వపు ప్రధానాదర్శములు కూడా వివరింపబడినాయి.

## విదేశీయ విధానము

ప్రభుత్వము ప్రపంచశాంతి రక్షణలను పెంపొందించి, వివిధదేశములమధ్య, న్యాయమైన గౌరవదాయకమైన సంబంధములను నెలకొల్పవలెను. అంతర్జాతీయ న్యాయసూత్రములకు, ఒడంబడిక బాధ్యతలకూ గౌరవమును చేకూర్చవలెను. అంతర్జాతీయ వివాదములను సంప్రదింపులవల్లను, మధ్యవర్తిత్వము

వల్లను, పరిష్కారమును ప్రోత్సహించవలెను. (ఆ॥ 51.)

### దేశీయ పరిపాలన

జాతి శ్రేయస్సు, సమస్త జనులకు ఆర్థికసాంఘిక రాజకీయన్యాయము లభించు సాంఘిక వ్యవస్థా సంస్థాపనమే ప్రధాన లక్ష్యములు. (ఆ॥ 38.)

మిగిలిన ఆర్టికిల్స్‌లో యీ వ్యవస్థలోని వివిధాంశములు వర్ణింపబడినవి. దేశమందలి పౌరులందరికీ స్త్రీ పురుష భేదము లేకుండా, సమానముగా జీవన భృతికి హక్కును కల్పించుట, ప్రజాశ్రేయస్సు దృష్ట్యా దేశమందలి వస్తుసముదాయమును పంపిణీ చేయుట, దేశమందలి ఐశ్వర్యము, ఉత్పత్తి సాధనములు కేంద్రీకరింపబడి, తత్ఫలితముగా ప్రజల కపకారము జరుగకుండా, ఆర్థిక విధానమును రూపొందించుట, శ్రమకు తగిన ప్రతిఫలము ప్రజలకు లభింపచేయుట, శ్రామికుల ఆరోగ్య శక్తులను కాపాడి, బాలుర లేతవయస్సుల దుర్వినియోగము నరికట్టి, ఆర్థికావసరముల ఒత్తిడివలన, వయస్సుకు శక్తికి మించిన వృత్తుల అవలంబనను మాన్పించుట, దోపిడినుంచి, ఆర్థిక నైతిక పతనమునుంచీ, బాలురను యువకులను రక్షించుట, 39 వ ఆ॥ ప్రభుత్వముపై నుంచిన బాధ్యతలు.

ప్రభుత్వ సహాయములు: ఆ॥ 41. నిరుద్యోగులకు, రోగపీడితులకు, వృద్ధులకు నిస్సహాయులకు ప్రభుత్వము తోడ్పడాలని చెప్తూ, తన ఆర్థికశక్తి, అభివృద్ధి పరిమితులలో, ప్రజ లందరకూ పనికి హక్కు లభింపజేయాలని విధిస్తున్నది. ఆ॥ 43. శ్రామికు లందరి, యొక్క సాంఘిక సాంస్కృతిక పురోభివృద్ధికి ప్రభుత్వము తోడ్పడవలెను. కుటీర పరిశ్రమలను ప్రోత్సహించవలెను. 44 వ ఆ॥ ప్రకారం రాజ్యాంగము అమలులోనికి వచ్చిన 10 సంవత్సరములలోగా 14 సంవత్సరములలోపు వయస్సు గల పిల్లలకు నిర్బంధ ఉచితవిద్యను ప్రభుత్వము ప్రసాదించవలెను.

ఆ॥ 49 జాతీయ ప్రాముఖ్యత కల్గినటువంటి చారిత్రాత్మకదృశ్యములను, స్థూపములను, ప్రదేశములను కళాఖండములను సంరక్షించుట ప్రభుత్వ బాధ్యతగా విధిస్తున్నది.

పైన పేర్కొన్నవి కాక, కొన్ని ముఖ్యమయిన సంస్కరణలవిషయంలోను, కొన్ని జాతులవిషయంలోను ప్రభుత్వము శ్రద్ధవహించవలసినదిగా నిర్దేశింపబడినది.

40 వ ఆ॥ గ్రామపంచాయితీల నిర్మాణమును సంస్థాపనను పేర్కొంటున్నది. 44 వ ఆ॥ ప్రకారం దేశమందలి ప్రజ లందరికీ వర్తించు ఒక సివిల్ కోడు నిర్మాణమును ప్రభుత్వబాధ్యతగా చెప్తున్నది. ఇవి కాక ఆ॥ 46, 47 50 లలో 3 ముఖ్యమయిన సంస్కరణలు బాధ్యతలు వివరింబడినవి.

ఆ॥ 46 ప్రజలలో దుర్బలులైనవారి విద్యార్థికవిషయములలో ప్రభుత్వము తగు జాగ్రత్తతో తోడ్పడుతూ వెనుకబడిన జాతులను ట్రైబులను సమస్తవిధములగు దోపిడీ, సాంఘికఅన్యాయములనుండి రక్షించుటలో ప్రత్యేకశ్రద్ధ వహించవలెను.

ఆ॥ 47 ప్రజారోగ్యవిషయములో ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ వహిస్తూ, వైద్యోపయోగములకు తప్ప మత్తుపదార్థములు, హానికరములగు ఔషధముల వాడుకను నిషేధించాలి.

ఆ॥ 50 ప్రభుత్వమందలి నిర్వాహక న్యాయనిర్ణయశాఖలు, విభజింపబడవలెను. (*Separation of Executive from Judiciary*)

అయితే యీ నిర్దేశికసూత్రములతత్వం ఏమిటి? న్యాయశాస్త్రరీత్యా వీని ప్రాముఖ్యత ఏమి? 3 వ అధ్యాయమునందలి 'ప్రాథమిక హక్కు'లకూ వీనికి గల భేదం ఏమిటి? అన్న ప్రశ్నలు తర్వాత పరిశీలింపబడాలి.

ఈ సూత్రములను రాజ్యాంగమందు చేర్చుటలో ఐరిష్ ఫ్రీస్టేటు (1932) రాజ్యాంగ మనుసరింపబడినట్లు తోస్తుంది. ఐర్లండులో కూడా యిట్టిసూత్రముల వివరణ చేయబడినది. ఇవి ఒక "నైతికనిబంధనావళి" లేక మన వివిధఆశయముల ప్రకటన అని చెప్పవచ్చు. డాక్టర్ అంబేద్కర్ రాజ్యాంగ నిర్ణయ సభలో మాట్లాడుతూ వీనిని బ్రిటిష్ ప్రభుత్వం గవర్నర్ జనరల్ నాదేసిస్తూ జారీచేసిన పరిపాలనా సూత్రముల (*Instrument of Instuctions*) లాంటివని పేర్కొన్నారు.

ఇక ప్రజల కివి ఏమైన హక్కుల నిస్తున్నవా అన్న ప్రశ్నకు ఆ॥ 37 లో సమాధానం చెప్పబడినది. "ఈ సూత్రములు ఏ న్యాయస్థానంలోనూ అమలు జరుపబడజాలవు—" (ఆ॥ 37) (*Non-justicia-*

ble rights). 3 వ అధ్యాయములో ఆ|| 12 నుంచి 35 వరకూ వర్ణించబడిన ప్రాథమిక హక్కులకూ, యీ సూత్రములకు ముఖ్యమయిన వ్యత్యాస మిదే. ఆ|| 13 ప్రకారం దేశంలో అమలులో నున్న ఏ చట్టం గాని, ప్రకటనలు గాని, రూల్సుగాని, ఆచారములు గాని, ప్రాథమిక హక్కులకు వ్యతిరేకముగా నున్న పక్షములో, అట్టి వైరుధ్య మున్నంత వరకూ అవి రద్దు చేయబడినవి. అంతేకాకుండా, యూనియన్ ప్రభుత్వం గాని, రాష్ట్రీయ ప్రభుత్వములు గాని, మరి ఏ యితర స్థానిక అధికారులుగాని, సంస్థలు గాని, ప్రాథమిక హక్కులకు వ్యతిరేకముగా, లేక ఆ హక్కులను సంక్షిప్తము చేస్తూ గాని శాసనములను చేసే అధికారం నిషేధింపబడినది. అనగా 3 వ అధ్యాయము నందలి ప్రాథమిక హక్కులు నిర్దుష్టములు, స్పష్టములు, న్యాయస్థానములద్వారా అమలుజరుప వీలైన హక్కులు (Justiciable rights). ఏ పౌరుడైనా తన 'ప్రాథమిక హక్కులకు ఏ విధమైన భంగం కలిగిందని అనుమానం వున్నా, ఆహక్కులతో జోక్యం కలిగించుకొనే ఏ శాసనం, అధికారి, లేక సంస్థనుగాని న్యాయ స్థానములో సవాలు చేయవచ్చును. కాని, నిర్దేశిక సూత్రముల విషయంలో, అట్టి హక్కు ప్రజలకు లేదు. ఏ శాసన మండైనా, వాస్తవముగా యీ సూత్రోల్లంఘన జరిగినప్పటికీ న్యాయస్థానమందు రక్షణకోరే అవకాశం లేదు. కాని ఏ బాధ్యతాయుత ప్రజాస్వామ్య ప్రభుత్వమూ అట్టి ఉల్లంఘనకు, తీవ్రమైన కారణం ప్రేరేపణ లేనిదే పూనుకోదని మనం ఆశించవచ్చు.

ఇంకొక ముఖ్య మయిన విషయం ఏమంటే ప్రాథమిక హక్కులకూ, నిర్దేశిక సూత్రాలకు వైరుధ్య మున్నపక్షంలో పరిస్థితినిగురించి:

మద్రాసు కమ్యూనల్ జి. ఓ. కేసు† :— శ్రీమతి చంపకం బ్రాహ్మణ కుటుంబమునకు చెందినది. ఆ కారణంచేత తనకు మెడికల్ కాలేజీలో ప్రవేశము దొరక దని తెలియగానే ప్రభుత్వాన్ని సవాలు చేస్తూ మద్రాసు హైకోర్టులో దావా వేసింది. (హైకోర్టులోను, అప్పీల్లో సుప్రీం కోర్టులోను కూడ ప్రభుత్వవాదన తిరస్కరించబడినది.)

† State of Madras V. Champakam Dorai Rajan. 1951 S.C.J. 316.

శ్రీమతి చంపకం వాదనలోని ముఖ్యాంశములు :

1 ఆ|| 15 (1) ప్రకారం, కుల మత లింగభేదములును, జన్మస్థలమును, ఆధారం చేసికొని ప్రభుత్వం ఏ పౌరునిపట్లా పాక్షికముగా వ్యవహరింపరాదు.

2. ఆ|| 29 (2) ప్రకారం, ప్రభుత్వముచే నడుపబడుచున్న, లేక ప్రభుత్వ సహాయము పొందుతున్న ఏ విద్యాసంస్థలోనికీ కుల మత జాతి భాషాదుల కారణంగా ఏ పౌరునికీ ప్రవేశము నిరాకరింపబడరాదు.

3. వ అధ్యాయములోని, యీ రెండు ప్రాథమిక హక్కులకు భంగము వాటిల్లినదని ఆమె తరఫున వాదింపబడినది.

మద్రాసు ప్రభుత్వంవారి వాదన :

1. నిర్దేశిక సూత్రములలోని ఆ|| 46 ప్రకారం వెనుకబడిన జాతుల పురోభివృద్ధిపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపవలసిన బాధ్యత ప్రభుత్వంపై నున్నది.

2. ప్రాథమిక హక్కుల అధ్యాయములోని, ఆ|| 15, 29, నిర్దేశిక సూత్రములలోని ఆ|| 46 కు లోబడియున్నట్లు, గ్రహించి వ్యాఖ్యానించవలెను.

3. కనుక వెనుకబడిన జాతుల రక్షణకు, పురోభివృద్ధికి పాటుపడుటలో యితర జాతులకు నష్టము కొంత కలిగినను, ప్రభుత్వచర్య న్యాయబద్ధమైనదేనని సూచన.

పై ప్రభుత్వ వాదన తిరస్కరిస్తూ సుప్రీం కోర్టువారిచ్చిన తీర్పులోని ముఖ్యాంశములు:—

1. ప్రాథమిక హక్కుల నేవిధంగానూ సంక్షిప్తము చేసే అధికారము, శాసనసభలకుగాని ప్రభుత్వమందలి నిర్వాహకశాఖకు గాని లేదు.

2. అట్టి అధికార మేమైన వున్న పక్షములో ప్రాథమిక హక్కులను వివరించిన 3 వ అధ్యాయమందలి మినహాయింపుల క్రింద నే అది వాడబడవలెను. ఆ మినహాయింపుల కతీతముగా ఎవరునూ తమ అధికారము వినియోగింపజాలరు.

3. ప్రాథమికహక్కులు నిర్దేశికసూత్రములకు లోబడి యుండజాలవు. అంతేకాక నిర్దేశికసూత్రములే

ప్రాథమిక హక్కులకు లోబడి, వాని కనుగుణంగా నుండవలెను.

4. ప్రాథమిక హక్కులకు భంగము వాటిల్ల నంతమటుకు, ప్రభుత్వము నిర్దేశక సూత్రముల ననుసరిస్తూ, రాజ్యాంగమునందలి వివిధ సూత్రాలకు కట్టుబడి మాత్రము పరిపాలన కొనసాగించవచ్చును.

వెనుకబడిన జాతుల విషయం:

5 ఆ|| 16 (1) క్లాజు ప్రకారం ప్రభుత్వోద్యోగముల విషయంలో అందరికీ సమానావకాశ ముండవలె నని యున్నది. కాని అదే ఆర్టికల్ 4 వ క్లాజులో కొన్ని వెనుకబడినజాతులకు అట్టి ఉద్యోగములలో చాలినంత ప్రాతినిధ్యము లేదని ప్రభుత్వమునకు తోచినపుడు వారి విషయములో ప్రత్యేక ఏర్పాట్లను చేసే అధికారం ప్రభుత్వమునకీయబడినది. మద్రాసు ప్రభుత్వమువారివాద నే సరియైన దని నిర్ణయించే పక్షములో 16 వ ఆర్టికిల్‌లోని 4 వ క్లాజు అనవసరమున్నూ పునరుక్తిన్నీ అనవలసివస్తుంది. అంతేకాక 16 వ ఆర్టికిల్ 4 వ క్లాజుద్వారా ఒక ప్రత్యేక మినహాయింపు చేయబడుట (వెనుకబడిన జాతుల విషయంలో) ఆ|| 29 లో (విద్యాసంస్థల ప్రవేశవిషయంలో) అట్టి మినహాయింపు లేకుండుట గమనించదగిన విషయము.

కనుక సుప్రీంకోర్టువారి తీర్పువలన తేలినవిషయ మేమనగా ప్రాథమిక హక్కులను సంక్షిప్తము చేసే అధికారము నిర్దేశకసూత్రములకు లేదు. అట్టి అధికారము ప్రాథమిక హక్కులను నిర్వచించి వివరించిన 3 వ అధ్యాయమునందలి మినహాయింపుల పరిమితులలోనే గాని వాని కతీతముగా వినియోగింపబడకూడదు. ఉదాహరణకు: ఆ 19 క్లాజు $F$ ప్రకారం ప్రతి పౌరునికీ ఆస్తి సంపాదన, అనుభవం క్రయాదుల విషయంలో ప్రాథమికహక్కు యివ్వబడినది. కాని 5 వ క్లాజులో, ప్రజాశ్రేయస్సు దృష్ట్యా, లేక వెనుకబడిన ట్రైబుల (*Tribes*) క్షేమదృష్ట్యా, ఆస్తి హక్కు పైని 'సబబైన' (*Reasonable restrictions*) నిరోధములను, నియమాలను విధించే అధికారం ప్రభుత్వానికివ్వబడింది. అయితే 'సబబు' అంటే ఏమిటి? ఒక నియమం సబబా బేసబబా అని నిర్ణయించడ మెలాగ? దీని కేమైన ఆధారములు గాని, సూచనలు గాని రాజ్యాంగమందున్నవా? అన్న ప్రశ్నలు రావచ్చు. అట్టి సమయాలలో కోర్టువారికి నిర్దేశక సూత్రములు కొంత మార్గదర్శకములుగా నుండును అని చెప్పవచ్చు. ఐరిష్ రాజ్యాంగమందు కూడా ప్రభుత్వ శాసనముల వైఖరి (*Tendency*) ని గమనించుటలో యీసూత్రము లుపయోగపడు నని కోహన్ (*Kohan*) అనేరచయిత పేర్కొన్నారు. మన సుప్రీంకోర్టువారు కూడా యీ క్రింద నుదహరింపబడిన కేసులో అట్టి సూచన చేశారు.

బొంబాయి ప్రొహిబిషన్ కేసు *

బొంబాయి మద్యపాన నిషేధచట్టం మత్తుపదార్థములను ఒక వ్యక్తి తనవద్ద నుంచుకొనుట, ఉపయోగించుట, అమ్ముటను, నిషేధించింది. మత్తుపదార్థములు కూడ ఒక విధమైన ఆస్తే. అయితే, యీ చట్టము విధించిన నిషేధము, ఆ|| 19 ప్రకారం ప్రతి పౌరునికీ ఆస్తి విషయంలోవున్న ప్రాథమిక హక్కును ఉల్లంఘిస్తున్నదా అన్న ప్రశ్నను పరిశీలిస్తూ, సుప్రీం కోర్టువారు రెండు హంశములను సూచించారు. 1. ఆ|| 19. 6. లోని ఆస్తిహక్కు 19. (5) లోని మినహాయింపులకు లోబడియున్నది—అనగా వెనుకబడిన ట్రైబులయొక్కయు, ప్రజలయొక్కయు శ్రేయస్సు దృష్ట్యాను, ప్రభుత్వం ఆస్తి హక్కులపై సబబైన నియమాలను, పరిమితులను విధించవచ్చు. 2. ఒక నియమం సబబా కాదా అన్న ప్రశ్న నిర్దేశక సూత్రాలలో, మద్యపాన నిషేధాన్ని పేర్కొంటున్న ఆ|| 46 ప్రకారం తేలవలసి యున్నది. మద్యపానమును నిషేధించుబాధ్యత ప్రభుత్వముపై నున్నది కాబట్టి, ఆస్తి హక్కులకు భంగము వాటిల్లు నట్లున్నను, మద్యపాన నిషేధ చట్టము సబబైన నిరోధము క్రిందనే వస్తుందని సుప్రీం కోర్టువారు సూచించారు.

ఈ తీర్పువలన న్యాయశాస్త్రరీత్యా, కోర్టు ప్రజలకిచ్చే రక్షణదృష్ట్యా నిర్దేశక సూత్రముల కేమీ ప్రాముఖ్యత లేదనే చెప్పాలి. రాజ్యాంగ చట్టములో వీనిని చేర్పడంవల్ల సాధించిన ప్రయోజనము కేవలము

---

* *State of Bombay V. Balsara.*
*1951 S. C. J. 495.*

నైతికమే. ఎందుకనలివి చేర్చబడాలి అనే చర్చ అప్రస్తుతము. చేర్చబడిన తర్వాత యీ సూత్రములు వహించే పాత్ర ఏమిటన్నది ప్రస్తుతము. దేశీయ పరిపాలనకూ, శాసనములకూ, వివిధ రంగాలలో ప్రభుత్వము చేసే కృషికి, నిర్దేశిక సూత్రములకు ఒక సజీవమైన సంబంధ ముండాలని, రాజ్యాంగ నిర్మాతల ముఖ్యోద్దేశము. అట్టి సంబంధ మేర్పరుచుటకే యూనియన్, రాష్ట్ర ప్రభుత్వాల వివిధ ప్రయత్నములు ప్రణాళికలు. అవన్ని యిచ్చట ఏకరువు పెట్టటము, అసాధ్యము, అనవసరము కూడా.

కాని, యివి నైతిక సూత్రాలు మాత్రమే కదా అని వీనిని అగౌరవం చేయడం తగదు. పైగా భారత ప్రభుత్వం యీమధ్యనే లా కమిషన్ను నియమించింది. లా కమిషన్ ముఖ్యమైన కర్తవ్యాలలో ఒకటి—దేశమందలి వివిధ శాసనములను, రాజ్యాంగమందలి ప్రాథమిక హక్కుల, నిర్దేశిక సూత్రముల దృష్ట్యా పరిశీలించి, శాసనములను రాజ్యాంగమున కనుగుణముగా రూపొందించుటకు తగిన మార్గములను సూచించుట. రాజ్యాంగ సూత్రములే కాదు, ప్రభుత్వము కూడా, సామ్యవాదమార్గము ననుసరించు వ్యవస్థా (Socialistic pattern of society) సంస్థాపనమే తమ ప్రధానలక్ష్యమని ప్రకటించారు కనుక, మన భావి సాంఘిక ఆర్థికవ్యవస్థ కనుగుణంగా న్యాయ వ్యవస్థా నిర్మాణమునకు కూడ మార్గములను సూచించే బాధ్యత కూడా లా కమిషనుపై నున్నది.

# 'నౌసటన్ వ్రాసిన వ్రాత

శ్రీ బుచ్చిబాబు

గడియారంకేసి అదప్పుడే పదోమారు చూడటం. ఆరైంది. రైలు రావడం ఎనిమిదింటికి. రాజమ్మ రాత్రి బండిలో రావడం మెరుగైంది. తిన్నగా యింటికే తీసుకురావడానికి నిశ్చయించుకున్నాడు. మళ్లా గడియారంకేసి చూశాడు మాధవరావు. భార్యతో చెప్పడానికి ధైర్యం చాలడంలేదు. మేనరికం; చిన్నప్పటినుండీ బాగా ఎరుగున్న మనిషే. అందుకే వొకవిధంగా ఆమెను నిజంగా ఎరగనట్లనిపించింది.

నిజంగా సీతారత్నంగురించి అతని కేం తెలుసు? ఆమె నుదుటిమీద అరంగుళంపొడుగు గీత వుంది. చిన్నప్పుడు తగిలిన దెబ్బ. మేనరికం గనక ఆమె చక్కదనం ప్రశంస ఎవరికీ రాలేదు. అతనికీ రాలేదు. రాజమ్మతో స్నేహం ఏర్పడ్డం తర్వాత 'ఆమె చక్కనిదేనా?' అన్న ప్రశ్న వొచ్చింది. ప్రశ్న వేసుకోడం పూర్తి కాకుండానే సమాధానం వొచ్చింది.

ఆరు దాటి అప్పుడే మూడు నిమిషాలైంది. రాజమ్మ? వూహ సాగినకొద్దీ ఆమె మూర్తి అస్పష్టమవుతోంది. వింతగా పెరిగిపోయి వెన్నంతా వ్యాపించి, మెడని మరుగుపరిచి, శూన్యంలో చలనం కలగజేసే జడ—నుదుటిమీదపడ్డ గోధుమ నీడలు—మెత్తటి, పల్చటి, సున్నితంగా మెరిసే, సాఫీ నుదురు, చుట్టూ నల్లటి మేఘాలు—మధ్య సీతాకాలపు సూర్య కిరణం వెలిగించిన ఆకాశంలా మరపురానిది. యవ్వనం ఎప్పుడు గతించిందో మాధవరావుకి తెలీదు. అతని జుట్టులో అక్కడక్కడ తెల్లవెంట్రుకలు, నడివయస్సు విత్తనాలు, రాజమ్మ జడతో అతని యవ్వనానికి ముడిపెట్టుకుంటున్నాడు. ఆమె జెడని తన జుట్టుపైరాస్తే, తెల్లవెంట్రుకలు నల్లగా అవుతాయి. అంత నల్లని, పెద్దజెడ. లావు కాదు, సన్నమూ కాదు; వరదనీటిరంగు. రెండో ప్రపంచ సంగ్రామం చివరి రోజులవి. యుద్ధం పేరిట ఉద్యోగం తెచ్చుకోలేక పోయ్యాడు తను. యుద్ధం పేరిట, చదువు సంస్కారం లేనివాళ్లు వేలకి వేలు గడించుకున్నారు. మధ్యతరగతి చితికింది. ఉన్న కొద్దిపాటి ఆస్తీ అక్కల పెండ్లిండ్లకైపోయింది. అప్పు చేస్తేగాని చదువు పూర్తికాలేదు. తన కిక వుద్యోగం రాదు. నాలుగేళ్లగా ట్యూషన్లు చెప్పుగుంటూ పట్నంలో కాపరం గడవక యీవూరు చేరాడు. రాజమ్మ యిక్కడి కొస్తుంది. ఆమె నుదిటికి అంత ప్రభావం వుందా!

గడియారంలో ఆరు యిరవై. కనబడకుండా పత్రిక దానిమీద కప్పాడు. తను బీదవాడు; రాజమ్మ భాగ్యవంతురాలు. ఆమె చెవులకి రవ్వల దుద్దులున్నాయి. అసలు వాటివల్లే యింతపని జరిగింది. సినిమాలో ఇంటర్వల్—పక్కన రాజమ్మ, ధగధగ మెరిసిపొయ్యే దుద్దులు—మెత్తటి, పల్చటి నునుపైన నుదురు. ఆ నుదుటిని తాకితే అతని తలనొప్పి తగ్గుతుందనిపించింది.

మళ్ళా మరొకసారి ఆమెని బాంక్‌లో చూశాడు. తల్లి అప్పుచేసి పంపిన ఐదువందలు జనవరిలో బాంక్‌లో వేశాడు. ఫిబ్రవరి మధ్యలోనే నూటయాభైకి వొచ్చింది. వొక ముప్పై తీద్దామని వెళ్లాడు. కవుంటర్ దగ్గర రాజమ్మ. తన బాంక్ పుస్తకం చూసి నవ్వింది. బిళ్ళ చూపించాడు. నోట్లు యిచ్చింది. తీసుకొని బల్లమీద కూర్చుని లెక్కపెట్టాడు. ఐదు రూపాయల నోట్లు ఏడున్నాయి. ఇంత అశ్రద్ధగా వుంటే ఆమెకు ఆ వుద్యోగం వుంటుందా?

"ఇదుగో నోటు. అదనంగా యిచ్చారు"

"పొరబాటు."

"మధ్యాహ్నం ఎంతవరకూ పనిచేస్తారు?"

"నాలుగు."

"మూడు నలభై టైమ్."

"అబ్బా."

మెల్లగా అన్నాడు.

"వైట్ చెయ్యనా?"

"ఎందుకు?" నవ్వింది. జెడ వెనక్కి తోసింది. తల వొంచినప్పుడు అందంగా ప్రశాంతంగా కనిపించింది నుదురు. అమాయకత్వానికర్థం అడిగితే, ఆ నుదురు చూపుతాను, అనుకుని బెంచిమీద కూర్చున్నాడు.

నాలుగవగానే యిద్దరూ కలిసి నడవడం సాగించారు.

"ఆకలేస్తోంది—హోటల్ కెడదామా?" అంది. వెళ్లారు. ఏం కావాలో అడిగాడు. చెప్పింది.

"మీరో?"

"నాకేమీ వొద్దు."

"ఫరవాలేదు తీసుకోండి."

"నా కాకలిగాలేదు."

"ఫరవాలేదంటేనిగా, బిల్లు నేయిస్తాను."

అతని మనస్సు చివుక్కుమంది. అమాయకంగా అన్న మాటేమో. అతని జీవిత చరిత్ర ఆ బాంక్ బుక్‌లో వుంది. ఆ చరిత్ర ఆమెకు తెలుసు. డబ్బు తీసుకున్న అంకెల వివరణ, వొక విషాదఘట్టం. తనెందుకు బాధపడాలి?

రాజమ్మ తింటూంటే అతను చూస్తూ కూర్చున్నాడు. యవ్వనానికి అంత ఆకలా—! కాఫీలైంతర్వాత లేచారు. ఆమె బాగ్ తీసింది. రెండునోట్ల కట్టలు చూశాడు. నెలమధ్యలో జీతం డబ్బు కాకూ పదే. బిల్లు యిచ్చింది. బైట కొచ్చి నడుస్తున్నారు. ఎవరికీ మాటలు దొరకడంలేదు. చుట్టూ జనం, కార్లు, బండ్లు.

"ఇంటి కెడతా."

"బాగ్‌లో బోలెడు డబ్బుంది. నే దిగబెట్టనా?"

"నాకేం భయం. మావది, డబ్బు. లారీ కంట్రాక్ట్లు. తెగొస్తుంది. పోయినా దిగుల్లేదులెండీ." అంటూ నవ్వి, బాగ్ వూపుకుంటూ రాజమ్మ వెళ్లింది. లారీ కంట్రాక్ట్లంటే ఏమిటో!

బల్లమీది గడియారంకేసి చూశాడు మాధవరావు. అడ్డంపెట్టిన పత్రిక గాలికి తొలిగింది. పావు తక్కువ ఏడైంది. కనబడకుండా గడియారం వెనక్కి తిప్పాడు.

భార్యను కేకేసి చెప్పాలి. ఎల్లా ప్రారంభించాలి? రాజమ్మనిగురించి ఏ వివరాలు చెప్పాలి? మరో వారానికి మరో యిరవై తియ్యడానికి వెళ్ళినప్పుడు ఆమెని చూశాడు. నాలుగవగానే, యిద్దరూ బీచివైపు వెళ్లారు. ఇసకలో కూర్చున్నారు. రెండు గుప్పిట్లలో యిసక దారంలా వొగులుతోంది. గాలికి వెంట్రుకలు మెడ, నుదురు కప్పుతున్నాయి. వెనక్కి తోస్తే, పాపిడ దగ్గర నుదుటిని గట్టిగా, వొత్తుగా, బిగించి వుంగరాలుగా చిక్కుపడి, కెరటం తుంపరల లాగ కదులుతున్నాయి. కళ్లు తుడుచుకుంది. కళ్ల కాటుక మధ్య, పెద్దవై, అనిశ్చలంగా మెరుస్తున్నాయి. నేత్రాల వెనక నల్లటి, దట్టమైన అఖాతం, ఉప్పుగాలికి ఫేస్ పౌడరంతా కరిగి చర్మం నల్లబడింది. శరీరచ్ఛాయ అసలు నలుపే—సున్నితంగా మెరిసే నలుపు.

"మరింకా యెందుకు నువ్వు పెండ్లిచేసుకోలేదు?" అని అడిగాడు. కంఠస్వరం గద్గదమై అసహజంగా ధ్వనించింది, ప్రతిధ్వనిలా.

"ఊరికే నే."

ఇసక పోస్తోంది. గాలికి అతనిమీద పడుతోంది.

"అమ్మో—కంట్లో పడిందా?"

తుడుచుకుంటున్నాడు.

"పోదేదా?"

"ఎవర్నైనా...ప్రేమించావా?"

ఇసక వొదిలేసి, గుప్పిట పమిట్లో దాచి, కొంగుతో జెడ కప్పి, దిగులుగా కెరటాలకేసి చూసింది. కొంగు జారి అతనిమీద పడింది. తీసి, దులిపి, లాగి నుదిటిమీద వేలు పడేటట్లు కప్పాడు.

"అమ్మో" అన్నది.

"ఏం చెప్పకూడదా?"

"ఏముంది చెప్పేటందుకు."

"ఏమీ లేదా."

"మీ రేదన్నా చెప్పండి."

తన విషయాలు,—చదువు, పెండ్లి, ట్యూషన్లు—చెప్పాడు.

# 'నొసటన్ వ్రాసిన వ్రాత'

"ఇక్కడ కష్టంగా వుంది. మా వూరు వెళ్ళిపోతున్నాను." అని ముగించాడు.

"డబ్బు ఇచ్చేదా?"

"నీదగ్గ రెక్కడిది."

"మావది. బోలెడుంది. అడగడు"

"నామీ దెందుకు అంత...యిది?"

"తప్పా?"

"ఏమో"

"కోపమా?"

"ఏమో"

నవ్వింది; తనూ నవ్వాడు.

గడియారంకేసి చూశాడు. తనవైపు తిప్పివుంది. సీత తిప్పిందేమో. ఐదునిమిషాల తక్కువ ఏడైంది. మరో ఐదునిమిషాల్లో భార్యతో విషయంచెప్పి స్టేషన్ కెళ్ళాలి.

ఇంకా అతనికి రాజమ్మనిగురించి ఏం తెలుసు? స్కూల్ ఫైనల్ పరీక్షదాకా పట్నంలో నే మామయ్య దగ్గరుండి చదివిందట తర్వాత బద్ధకించి మానివేసింది. బాంక్ మేనేజరు మోజుపడి, మామయ్యని వొప్పించి, ఆమెను పనిలో జేర్పించాడు. తండ్రిలేడు. తల్లి పల్లెటూళ్ళోవుంది. వివరాలు తెలియవు.

మరోసారి సాయంత్రం ఆరింటికి పార్కులో కలుసుకున్నారు.

"ఆదివారం వెళ్ళిపోతున్నాను." అన్నాడు.

"మళ్ళా రారా?"

"ఇంకెందుకొస్తాను?"

"నన్ను మాపరా?"

"ఓ—అదా......"

"చెప్పరేం. ఆమె కోప్పడతారా?"

"ఏంచెప్పను?"

"పోనీ—నేను రానా—?"

"ఓ"

"అట్టే పెట్టుకుంటారా?"

"ఓ"

"ఎప్పుడూ?"

"ఆమె వూరుకుంటారా?"

"హిందూ స్త్రీ ఏం చెయ్యగల్దు?"

"ఊరికే అన్నా" అన్నది రాజమ్మ నవ్వుతూ. దీపం నీడపడి ఆమె నుగురు కనపడటంలేదు. ఊడవడానికి వోకమ్మాయి వొచ్చింది.

"చీర బాగుందికాదు.?"

"చాలా బాగుంది"

"నాదికాదు. ఆ వూడ్చే పిల్లది."

"ఆదా" అని చూశాడు. "సినిమాలు చూసిం తర్వాత,పనివాళ్లకి కూడా ఫేషన్లు ఎక్కువైనాయి."

"వాళ్ళుమట్టుకు మనుషులు కారా ఏం?"

"అవుననుకో—రాబడికి మించిన పోకిళ్లు."

"బస్తీగా."

"పల్లెల్లోనూ యిల్లాగే వున్నారు."

"మీ కిష్టంలేదా?"

"ఎవళ్లుండవల్సినచోట వాళ్ళుండాలి."

"మీకు చాలా కోపాలున్నాయే, మరి మా కులం తక్కువగా, ఎట్లా సరిపడ్తుంది?"

"ఇది వేరు."

రాజమ్మ నవ్వింది. లేచి చీర సర్దుకుంది.

బైటకి నడవడం సాగించారు. సందు మొదలుకొచ్చారు.

"మరి నే వెడ్తాను."

"నేనూను."

"మళ్ళావొస్తారుగా"

"నువ్వొస్తా నన్నావుగా."

"అమ్మో!"

"ఏం, భయమనుకున్నావా?"

"చూస్తాగా."

గడియారంకేసి చూశాడు. ఐదునిమిషాలతక్కువ ఏడే చూపుతోంది. ఇకేమిటి, యిందాకే అయిందిగా. గడియారాన్ని వూపాడు. అది నిలిచిపోయింది. సీతని

"టైమెంతయింది?"

"అదుగో గడియారం." అని, రెండుకవర్లు చేతి కిచ్చింది. "ఇందాక వొచ్చాయి."

వాటిని దూరంగా పారేశాడు.

"నీతో వో విషయం చెప్పాలి సీతా."

ఆమె వంటింటి గుమ్మంలో నిలబడివుంది.

"రాత్రికి నా స్నేహితురాలు వొకామె వొస్తోంది."

"వొంటేనా..."

వొంటసరే — ఆవిడ — ఆమె, యిక్కడ, యిక్కడేవుండి, వుండిపోతుంది."

"ఏం?"

"అంతే—నీతో బాటే."

"అంటె?"

"నన్ను ప్రేమించింది. యిక్కడే వుంటుంది."

"ఉండనివ్వండి".

"నీకేం అభ్యంతరం లేదు గా."

సీతా రత్నం, పెదవులమీద నవ్వ వింతగా కరిగింది. అస్తిపంజరం కదిలినట్లుగా—వొణికి గదిలోకెళ్లి పోయింది.

మాధవరావు, నిట్టూర్పాసు. కవ్వించిన కెరటం వెనక్కి దిగజారింతర్వాత మిగిలిన యిసుకలో తేమలాగైంది అతనిమనస్సు. మాట, భావం, ధ్వని, వ్యక్తిత్వం వెదజల్లినశక్తి—ఏదైనాసరే, నీడలా, ప్రతిబింబంలా మనస్సులో మెదుల్తాయి. ఆ అనగానే, తేమ యిసుకలో లాగా, దిగబడతాయి. అతని శరీరం లేచింది. కాళ్లు లోపలికెళ్ళాయి. ఎడంకాలిజోడుని కుడికాలు స్పృశిస్తోంది. చేతులు దేనికోసమో తడువుతున్నాయి. అవయవాలని దగ్గరకు లాక్కుని బెటచీకటో కెళ్ళింది.

## 2

మరుసటిదినం.

రాజమ్మ ఎనిమిదింటికి లేచి కాఫీ త్రాగి, స్నానాని కెళ్లింది. మాధవరావు ట్యూషన్లు చెప్పే ముందువా గదిలో ఆమె మకాం. పనిమనిషి చిట్టెమ్మ గదివూడ్చింది. అందులో కాంప్ కాట్ — దానిమీద ఆమె హోల్డాల్ ప్రక్కన చిన్నబల్లమీద ఫ్లవర్ వాజ్, అమర్చారు. సీతారత్నం బ్రెడ్ రెండు ప్లేట్లల్లో తెచ్చి బల్లమీద పెట్టింది.

"మాట కొంచం యాసకదు?" అంది. భర్తనుద్దేశించి; అతనేమీ మాట్లాడలేదు.

"కాపులా?"

"జాతి మత కుల వ్యత్యాసాలన్నీ వెనకటి రోజుల్లో"

"నేనేమన్నాను? తెలుసుకుందామని అడిగాను."

"అదంత ముఖ్యమైన ప్రశ్న కాదు."

చిట్టెమ్మ, సీతా కలిసి, పెద్దట్రంకు మోసి గదిలోకి తెచ్చారు. నేలమీద మోపకుండానే చిట్టెమ్మ ట్రంకు పట్టు వొదిలేసింది. శబ్దంతో పడింది.

"జాగ్రత్త" అన్నాడు.

"వొదిలేసి కాలు చితక్కొట్టుకోడం దానికి మనుసా."

"తగల్లేదు లెగండి." అని పనిమనిషి ట్రంకు తాకిడికి వూడినగోడ బెల్లుని వూడ్చివెళ్లింది.

"అస లేవూరుట?" అని అడిగింది సీత.

"ఏమో."

"తండ్రికేంపనో?"

"ఏమో."

"ఉన్నవాళ్లకి మల్లేనే వుంది."

"ఉ."

"మరింకా ఎందుకు పెళ్లి కాలేదూ."

"నన్నేమీ అడక్కు. నాకు నిజంగా ఏం తెలీదు. ఉస్. వొస్తోంది."

మాధవరావు, భార్య, లోపలికెళ్లారు. వంటింటి గుమ్మంలో ముందు పీటమీద కూర్చున్నాడు.

"ఆ గదిలో పెట్టాగా. మీకక్కడా".

అతను లేచాడు. మీరు పదండి నే కాఫీ పట్టుకొస్తా."

ఇంతలోకే రెండు ప్లేట్లూ తీసుకుని రాజమ్మ దక్కా వొచ్చింది తనో పీటవాల్చుకు కూర్చుంది.

"మీరు బ్రెడ్ తినరా?"

"తినకూడని నేం లేదు."

"తింటుంది" అన్నాడు మాధవరావు.

"పట్నంలో రోజూ పొద్దుటే ఆమ్లెట్ తింటాను. మీ కిష్టం లేదా?"

సీత తల పంకించింది.

"ఇష్టం వున్నట్లా, లేనట్లా?"

"తింటే కదా ఇష్టం." అన్నాడు మాధవరావు.

"మీరో?"

"నాకేం అభ్యంతరం లేదు. రేపట్నించి తెప్పిస్తాను."

"తెప్పించడం దేనికి— నేను చేసి పెడతాగా."

"ఇంట్లో బాగుండదు." అంది సీతారత్నం.

"ఇది పట్నం కాదు." అన్నాడు మాధవరావు, ఆమెకేసి చూస్తూ, లావెండర్ కలర్ జాకెట్టు, తెల్ల సిల్కు పూల చీరా, వొదులుగా జారిన జెడా, కాటుక మధ్య కన్ను, పుష్పం వికసించినట్లుగా, తేటగా వుంది, పీటమీద రాజమ్మ.

"ఏ మొండుతున్నారు?"

"బీరకాయ. నీ కిష్టమేనా?"

"మార్కెట్టు కెడతారా— ఇంటికే వొస్తయ్యా?"

"అదీ వుంటుంది, యిదీ వుంటుంది." అన్నాడు మాధవరావు.

"బీరకాయ దొడ్లోదే." అంది సీత.

"నే కూడా వొండేదా?"

"నువ్వెందుకులే."

"టూ మెనీ కుక్స్ స్పాయిల్ ది.....పూర్తి చెయ్యి వాక్యం" అన్నాడు మాధవరావు.

ఇద్దరూ నవ్వారు. ఇదేదో అర్థమైనట్లు, కళాయిలోంచి 'చుయ్'మని, నిప్పు నవ్వినట్లుగా ధ్వని బైలుదేరింది. సీతారత్నం కొంగుతో ముక్కు తుడుచుకుంటోంది. రాపిడికి ఎర్రబడింది. మాధవరావు, హాచ్ మని పెద్దగా తుమ్మాడు. తుమ్ముకి రాజమ్మ నుదుటిమీదికి జారిన వుంగరాలు, తుపానుకి అదిరిన చిటారుకొమ్మలా, వొణికాయి. రాజమ్మ జుట్టు వెనక్కి తోసింది; కొమ్మని మిగిలిన వొంటి ఆకులా, వొక వుంగరం కనుబొమ్మని కవ్విస్తోంది. లేచి గదిలోకి వెళ్ళింది. చదువుకోడానికి పత్రిక యిచ్చాడు మాధవరావు.

"ఆమె అండీ అంటూంటే, నువ్వు 'నువ్వు' అంటావేం?"

"నాకంటె చిన్నదేగా."

ఇంతట్లోకే ట్యూషన్ల పిల్లలొచ్చారు. హాల్లో చాపలు పరిచి కూర్చున్నారు.

## 3

రెండోనాడు.

మధ్యాహ్నం భోజనాలైం తర్వాత, రాజమ్మ తన గదిలో నిద్రపోతోంది. పత్రికకోసం మాధవరావు గదిలో కెళ్లాడు. మొహాన్ని కడ్డంగా చెయ్యి ఆనించి నిద్రపోతోంది. పెదవుల మధ్య వొకటి రెండు పళ్ళు మెరుస్తున్నాయి. జాకెట్టు అక్కడక్కడ చెమటకి తడిసింది. ఎడమకన్ను కొంత తెరిచివుంది తామరకొలనులో చంద్రబింబంలాగు. కొలనులో నక్షత్రాలకి మల్లె ముత్యాలచెమట నుదిటిని ఆక్రమించింది. కుంకుమ— మధ్య నల్లబొట్టుకి ప్రమాదం జరక్కుండా, వేళ్ళతో చెమట తుడిచేశాడు.

"మేలుకునే వున్నాను."

"తెలుసు"

"భలేవారు. నిజంగా నిద్రపట్టేసింది."

"మేలుకునే నిద్రపోయినట్లుగా వుండటం అది నాకు తెలవడం, నాకు తెల్సునని నీకు తెలవడం— తప్పా?"

"అమ్మో, మీలో చాలా తికమకలున్నయ్యే" అంటూ దీర్ఘంగా ఆవులించి, అతని వేళ్ళని తన చీరతో తుడిచింది.

"అన్ని తికమకలున్నాయని గ్రహించగలిన నువ్వు ఎంత అమాయకురాలవో" అని మంచంమీద కూర్చోబోయ్యాడు.

ఆమె లేచి కుర్చీమీద కూర్చుంది.

"కొత్తమంచమూ— భలే రెపరెపలాడుతుంది."

"నీ కిక్కడ బాగుందా?"

పెదవులు ఎడంగావుంచి, కళ్లు సగంమూసి, మెడ వెనక్కి వేసి, జడ ముందుకు లాగింది. ఓ అన్నట్లు తల గుండ్రంగా తిప్పింది. మాధవరావు మనస్సు వ్యూహాలో యిరుక్కుంది. ఇది మధురక్షణం. జీవితం అంతా— యీ తృష్ణ, చిక్కటి, తీక్ష్ణమైన యింద్రియాలస్పందన, స్పృశించే వుద్రేకం అల్లాగే వుండిపోవాలి. ఈ ఆనందం తన రెండు గుప్పిట్లలో బిగించి, కాలాన్ని కట్టెయ్యాలి. కాలం కూసినట్లు హాల్లో అలారం మోగింది.

"సీతగారు లేచారు." అంది రాజమ్మ.

మాధవరావు హాల్లో కెళ్ళాడు.

"అదేమిటే కీ యిమ్మంటే, అలారం మోగించావ్— తెలివి తక్కువ మొద్దూ," అని సీతారత్నం పనిమనిషి చిట్టెమ్మని కసిరింది.

"ఇది గామోసు అనుకున్నానండి." అన్నది అలారంపెట్టె 'కీ'ని చూపించి.

"ఏడిశావులే నడు" అన్నాడు మాధవరావు.

"ఇంత మాత్రానికే మొద్దయిపోయిందా?" అంటూ రాజమ్మ గుమ్మంలోకొచ్చింది.

"నీ కెందుకు—నువ్వెళ్ళు." అన్నాడు మాధవరావు.

రాజమ్మ కోపంతో వెళ్ళిపోయింది. రాజమ్మలో కోపం యిదివరలో అతను చూడలేదు.

"కోపమా"

"నా కోపం ఎవరికి లెక్క?" అంటూ వొస్తున్న దుఃఖాన్ని అపుకుంటూ, తలదిండులో మొహం దాచుకుని మంచంమీద వాలిపోయింది.

బుజంమీద చెయ్యివేశాడు. తోసివేసింది. మెడమీద జెడకింద చెయ్యిపెట్టి నిమురుతున్నాడు. మరో దిండు మెడమీదికి లాక్కుంది. పక్కింటివాళ్లొచ్చాయి, పత్రిక కావాలంటూ తలుపు తోశాడు. మాధవరావు బైటికెళ్లాడు.

## 4

మూడోనాడు సాయంత్రం ఐదింటికే మాధవరావు వూళ్ళో పని చూసుకుని యింటికొచ్చాడు. చిట్టెమ్మ చెప్పింది, అమ్మగారు, రంగమ్మగారితో కలిసి గుడికెళ్ళారని. మండువాగదిలో రాజమ్మ జడేసుకుంటోంది. మంచం కింద పొట్లం కాగితాలు, దారాలు కనిపించాయి. చిట్టెమ్మ వాటిని తీసేసింది.

"పూరీలు తెప్పించా, ఆమ్లెట్లు కాదులెండి. సీతగారు అక్కల్లేపన్నారు. మీరు తింటారా?"

"ఊ"

లోపలికెళ్ళి పళ్లాలు తెచ్చింది. తినడం సాగించారు.

"ఇక్కడ నీ కెట్లా వుంది?"

"ఏం చెప్పను?"

"సీత మంచిదేనా?"

"చాలా మంచివారు."

"కాలక్షేపం అవడంలేదా?"

"మీ పిల్లలతో పాటు నాకూ ట్యూషన్ చెప్తారా?"

"వాళ్లు పిల్లలు కారు; పెద్దవాళ్లే."

"నేను మట్టుకు?"

"నిన్నేమని పిలవను?"

"ఎట్లా పిలవాలనుంటే అట్లా పిలవండి"

"రాజీ—అననా?"

"ఆమెను సీతా అంటారు. సీతీ అనరుగా."

రాజా—అంటే మొగాళ్ళ పేరులాగుంటుంది."

"ఇప్పు డసలు నన్ను పిలవడం దేనికి".

"నిన్నొకటడగాలి రాజీ—"

"అడగండి."

మాధవరావు దగ్గరగా వొచ్చాడు; గోడవెనక సూర్యుడు దిగిపోతున్నాడు. చివరి కిరణం గోడని రక్తం చిమ్మి కిటికీలోంచి కొత్త పొట్లంకట్టి పారేశినట్లు రాజమ్మ మొహం ఎఱ్ఱబడింది. బుగ్గల నీడలు ఊదాగా వున్నాయి. సంధ్యవేసిన ముసుగులా, నుదురు ఎఱ్ఱగా, ప్రశాంతంగా వుంది. ఆమె నుదుటిమీద చెయ్యిపెట్టాడు; ఆచేతిమీద తన నుదురు పెట్టాడు; వేడి గుబుసుగా అతన్ని ఆవరించింది. వేళ్లు జుట్టులో యిరుక్కున్నాయి. వొంకీలస్పర్శ, మంచు శిఖరం నుండి లోయలోకి జారి పోతున్నట్లు అతిశయోక్తిగా కదులుతున్నాయి చేతికింద.

"ఇదేనా అడగడం?"

అరిచేతికింద కంఠస్వరం జిలజిలా కొట్టుకుంటోంది. ఏదో వింతవాసన—జారిన రెండు గులాబి రేకులు, చర్మం తేమలో కలిసిన పౌడర్, కెరటంలేని కొలనులో కదిలిన చేపలు, చీకటి వేడినిట్టూర్పు, మేఘాల జోలపాటకి నిద్రపోతూ ఆవులించిన ఆకాశంలాగా, ఏదో వింతవాసన, క్షణంలో గతం గుర్తొచ్చి గంతులేసినట్లు, బాల్యంలో వికృత దృశ్యాలు—సందులో గుడిసిలోంచి వొచ్చిన చేపల వాసన, ఎవరిదో కాలువిరిగి రోడ్డుమీద కారిన రక్తం, తొలుసుతున్న గడ్డివామి మధ్యనుండి బైటపడిన తెల్లపంది పిల్ల, తుపానుకి కూలిన చూరుకింద నలిగిపోతున్న తులసి మొక్క—స్మరణ కొచ్చాయి. కిటికీ వూచల చుట్టూ, రాజమ్మ ముంగురుల నలుపుని, చీకటి అల్లుతోంది.

"భలే ప్రశ్నే!"

"నే అడగకుండా నీకు తెలవదూ." అతని చేతిని తొలగించింది.

"తెలుసు."

"అవుతే చెప్పు."

"డబ్బు కావాలా?"

మంచు శిఖరం కూలింది. రాపిడికి నిప్పు. విశ్వం కాలిపోతోంది. అందులో కాలం కూడా మండిపోతోంది.

తలుపు తోసిన చప్పుడు—అతని హృదయ ద్వారాలని తెరిచినట్లు.

"మీరా? అప్పుడే వొచ్చారే."

సీత కంఠం దూరంగా అయింది. తలుపులు దగ్గరగా మూసివున్నాయి.

రాజమ్మ తలుపు తీసింది. బుజాలమీదికి జాకెట్టు లాక్కుంది.

"నేనూ వొద్దనుగా ఆలశ్యానికి." అంది సీతారత్నంతో.

"వొస్తావనుకోలేదు." అని సీత, భర్తకి రెండు కవర్లు తెచ్చియిచ్చింది.

"నాలుగు రోజులైంది యివొచ్చి, యిప్పుడేనా చూడండి" అంది.

కవరు చింపబోతుంటే, చిట్టెమ్మ వొడిలోంచి రూపాయలు కిందపడ్డాయి.

"ఎక్కడివే?"

"ఆ యమ్మగారిచ్చింది."

"పనివాళ్ళకి అట్లా గివ్వకూడదు" అంది సీత.

"ఏం తప్పా? పని చెప్పాను, చేసింది—సంతోషంగా యిచ్చాను"

"తప్పే. మేమల్లా యిచ్చుగోలేం. మా మాటకదేం గౌరవం వుంచుతుంది?"

"మా, మీ లెందుకులే" అన్నాడు మాధవరావు.

"మనందరికీ కలిసే పనిచేస్తుందిగా. నే నిచ్చింది డబ్బు కాదా?"

"రోజూ అల్లా యివ్వగలవా?"

"దాని చేతనిబట్టి వుంటుంది."

"మా యింట్లో యివ్వటానికి వీల్లేదు."

"అదే వొద్దన్నాను" అని మాధవరావు.

"ఎందుకు వీల్లేదు. నా డబ్బు నే నిచ్చుగుంటే మీకేం కష్టం?"

"తను మాత్రం, నా, నీ అనొచ్చా?" అని భర్తనడిగింది.

"చిట్టెమ్మా, ఇదంతా నీమూలంగా, వొచ్చింది. అవతలకి పో."

"మధ్య నామీద పడతా రేటండోయ్. పొమ్మంటే పోకుంటామా" అంది చిట్టెమ్మ.

దీపం వేసింది సీతారత్నం. రాజమ్మ అక్కడ లేదు. గదిలో మంచం చప్పుడైంది. మాధవరావు వీధిలో కెళ్లాడు. చిట్టెమ్మ పెరట్లో కెళ్ళింది. చెట్టు వెనక చందమామ.

నాలుగో నాడు—

రాత్రి పదిగంటలకి ముగ్గురూ ళ్ళి సినిమా చూసొచ్చారు. వరండాలో వరసగా ముగ్గురి పక్కలు వేసుకున్నారు. పది నిముషాల్లోనే రాజమ్మకి నిద్ర పట్టేసింది. పట్టినా పట్టకపోయినా మొహం అటు తిప్పి పడుకుంది. సీతారత్నం తనపక్క కొంచం అవతలగా లాక్కుంది, భర్తకి దగ్గరగా. చీకటిమందాన్ని చూడగలిగే వెన్నెలుంది. ఆకుల పల్చటి నీడలు, కదలక, నిద్రపోతున్నాయి. కీటకం కూత, వెన్నెల పారాహుషార్ చెప్పినట్లుగా వుంది. కాలం నీడల నడుమనుంచి మెల్లగా ముందుకు పాకుతోంది.

మాధవరావు లేచి హాల్లోకి వెళ్లాడు. చించి చదవని కవరులో ఉత్తరంతీశాడు. దీపం వేశాడు. మేనమామదగ్గరనుంచి.

".   'నీ కీవిషయాలు పూర్తిగా తెలియవని మీఅమ్మ చెప్పింది. మీచదువులకీ, పెళ్ళికీ చాలా అప్పులు చేసివున్నాముకదా. మనింట్లో చాలా రోజులుగా పనిచేసిన మాణిక్యం అనేకపర్యాయములు అడుకుంది. అది యీ నాలుగైదునెలలుగా వొత్తిడి చేస్తోంది. ఎక్కువ అవసరంగా వుందిట—ప్రస్తుతం, వెయ్యికాకపోయినా వో ఐదువందలేనా సర్దుబాటు చేస్తేగాని మర్యాద దక్కేటట్లులేదు. కూలి జనం, నోటికి హద్దుండదుగదా. మాణిక్యం వీధిని పడింది అంటే వేరే చెప్పనక్కర్లేదు. భూమి అమ్మకం వెంటనే పరిష్కారం అవదు. మనం చెప్పిన ధరకి ముందుకొచ్చిన ఆసామీ లేడు. ఎల్లాగో తక్షణం సర్దుబాటుచేసే విధం ఆలోచించడానికి మీ అమ్మ నిన్ను రమ్మని వ్రాయమంది. రత్నాన్ని పుట్టింటికి పంపక, యిక్కడికే తీసుకురమ్మంది..."

చదువుకు నేరోజుల్లో సెలవల కొచ్చినప్పుడు పనిమనిషి మాణిక్యాన్ని ఎరుగున్న జ్ఞాపకం వుంది. దాని మొగుడు మొదటి ప్రపంచయుద్ధంలో సైనికుడుగా పని చేసి, పది సంవత్సరాలక్రితం చనిపోయాడు. పాలు వ్యాపారం, కూరల వ్యాపారం చేస్తుంది. డబ్బు నిల్వచేసి, అవసరానికి అప్పులిచ్చేది. తన చదువు కొంతవరకూ మాణిక్యం డబ్బుతో జరిగింది.

అలజడైంది. వెనక సీత.

"డబ్బు విషయమేనా?"

"నీ కెట్లా తెలుసు?"

"దస్తూరినిబట్టి—మనదగ్గరనుంచి ఎవరి కేం గావాలి!" సీతారత్నం కళ్లల్లో ఎరుపు స్ఫుటంగా లేదు. కనురెప్పలు బరువుతో చటుక్కున మూత పడటంలేదు. నుదుటిమీద అరచేతిని ఆనించికూర్చుంది. చెయ్యి తియ్యగానే, దెబ్బతాలూకు గీత, పక్కన దీపం వుండానీక, ఎక్కువగా మాట్లాడడానికి అలవాటుపడని నోరు, ప్రతిదాన్ని చూడడానికి సిద్ధపడని గంభీరమైన చూపు—సీతారత్నం, పరాయి వ్యక్తిగా కనబడుతోంది. తీవ్రంగా చూస్తున్నాడు. తనతో కాపరంలో ప్రతి అనుభవమూ ఆమె శరీరంలో కనిపిస్తోంది. కొత్తలో కష్టాలు, రహస్యంగా రెండోమారు కాఫీ యివ్వడం, వేరే కాస్త తీసి మిగతాది గిల గొట్టడం, బొత్తాములు కుట్టడం, చాకలి మారు చేసిన బనీను ఆరా తియ్యడం, ఫుట్‌బాలాటలో కాలు బెణికినప్పటి కాపడాలు, కట్లు, వానలో తడిసినప్పుడు, తువ్వాలుతో తల తుడవడం, కళ్ళల్లో సిద్ధపడిన కన్నీటిని పెదవులతో ఆనకట్టలా నిలిపివెయ్యడం—అతని కన్నీరు ఆమె నేత్రాలగుండా రాలి తన చిటికెన వ్రేలిఉంగరంపైనపడడం—విషాదాలు ఆమెలో వొంపులు, ఆనందాలు ఆమెలో ఎత్తులు—తన అనుభవంతో పెరిగిన శరీరం—ఆమె నడుం గట్టిగా పట్టుగుని వక్షంలో మొహం దాచాడు మాధవరావు.

రాజమ్మ ఆవులింత వినబడింది. సీతారత్నం అతన్ని నిలబెట్టి వరండాలో కెళ్లింది.

"తెల్లారిందా?"

"లేదు. వా రవతలికని లేస్తే, నీళ్ళిచ్చాను."

దిండ్లు, కొంగు, జడ, దగ్గరగా లాక్కుంది రాజమ్మ. సముద్రంలో కొట్టుకుపోతున్న చీరలా పడుకుంది.

## 6

తర్వాత, తర్వాత—

రాజమ్మకి జ్వర మొచ్చింది. ఒక్క మంచం బల్లావుంచి గదంతా ఖాళీచేసి శుభ్రం చేశారు. మధ్యాహ్నం రాత్రి సీతారత్నం రంగమ్మగారింట్లో చిన్నమంచం తెప్పించి పక్కనే వేసుగుని కనుక్కుంటూ సాయంగా వుంది. ఉదయం డాక్టరు చూసి వెళ్లేవాడు. సాయంత్రం వైకుంఠపాళి ఆట రాత్రి మాధవరావుతో క్షీరన్న.

శనివారంరాత్రి ఎనిమిదైంది. రంగమ్మగారింట్లో ఎవరో తాంబూలాలుచ్చుకోనడానికొచ్చారు. రమ్మంటే వెళ్ళింది సీతారత్నం. మాధవరావు, రాజమ్మమంచం పక్కనే చిన్నబల్లమీద కూర్చున్నాడు. దీపం వొద్దంటే, మూసేసి, బెడ్‌రూమ్ లాంప్ పెట్టాడు. పేపర్ చదవడానికి, ఆసలుగు చాలక మడిచిపెట్టేశాడు.

"యుద్ధం అయిందటగా."

"అయినట్లే."

"అవుతే.యింక.మావకి లాభాలుండవన్నమాట."

"లారీకంట్రాక్టులా" నవ్వాడతను.

"ఇంకా వో ఏడాది దాకా, యుద్ధం అలజడి వుండొచ్చు. మీ మామకి రమ్మని వ్రాయనా?"

"ఒద్దు, పనివిడిచిరాడు. డాక్ట రేమంటాడు?"

"ఏం పెద్దవిశేషంలేదు. ఓ వారం పదిరోజుల పాటు రెస్టు కావాలన్నాడు."

"రెస్టుకాక నే నేంపనిచేసి కష్టపడుతున్నాను?"

"రెస్టు శరీరానికేకాదు. మనసుకి కూడా వుండాలన్నమాట."

"నామనస్సుకేం?"

"ఇక్కడ నీకు బాగుందా?"

"నామూలంగా మీకే రెస్టులేదు. మీరెందుకు నిద్రపోరు. కళ్లు మూసుకోండి. ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి."

"ఏమిటో వొక్కొక్కసారంతే, ఓ రెండు రోజులపాటు, యింటికెళ్ళిరానా?"

ఎందుకో చెప్పమంది. డబ్బువిషయం చెప్పక తప్పిందికాదు. మంచంమీద లేచి కూర్చుంది. రండి అని హాల్లోకి తీసుకెళ్లింది. పెట్టె తీసింది. అందు

లోంచి బాగ్ తీసుకుని మళ్లా గదిలోకొచ్చింది. "ఇదిగో, యీ తాళంచెవి మీ దగ్గర పెట్టుకోండి." అంది రాజమ్మ.

"దాస్తాను"

"తాళంచెవి దాచండి డబ్బు వాడండి."

"నీ డబ్బు...."

"నీ, నా, తేడా లెందుకు?" నవ్వింది. ఊడిన జెడని మెలితిప్పి పైకిలాగి బిగించి ముడేసింది. నుదుటిపై చిరుచంద్రుకలు విడగా మిగిలినవి వీణతీగెల మాదిరి వెనక్కి సాగారాయి. దగ్గరగా జరిగి నుదుటి మీద చెయ్యివేసి కళ్లల్లోకి చూశాడు. దిండులోకి దిగజారి మొహం చిన్నదైంది. కళ్లు మూతలు పడుతున్నాయి. అర్థంలేని నవ్వుకోసం పెదవులు కదులుతున్నాయి. కణతలకింద నరాలు వానపాముల్లా గుండ్రంగా మెదులుతున్నాయి.

"చాలా?" అన్నది.

"ఆనందాన్ని చాలు అని ఎవరంటారు?"

"అది కాదు. డబ్బు. మరో నెయ్యి పంపమని నిన్ననే మవకి వ్రాశాను" అంది.

"డబ్బుకోసం నీతో స్నేహం అనుకుంటు ?"

నేనట్లా అనుకుంటానని మీరెందుకనుకోవాలి?"

"నీలోనూ తికమకలున్నాయి.

"మీ సావాసం"

చిట్టెమ్మ రంగమ్మగారింటికి అయ్యగార్ని కూడా వోపాలి రమ్మన్నారని చెప్పింది. దీపం కొంచెం పెద్దది చేసి వెళ్లాడు.

మర్నాడు నెయ్యి యింటికి పంపాడు. రాజమ్మ జ్వరం తగ్గింది. ఎంత వొద్దన్నా వినక, చిట్టెమ్మచేత తలంటు పోయించుకుంది రాజమ్మ. దానితో జ్వరం తిరగబెట్టింది. సంగతేమిటంటే, డాక్టరు హిస్టీరియా అన్నాడు. ఆవిషయం రాజమ్మతో చెప్పలేదు మాధవరావు. ముందు బిల్లిచ్చి కాని ఆ డాక్టర్ని తప్పించి మరొకర్ని రప్పించే వీల్లేదు. వంటింటి గుమ్మంలో కూర్చుని ఆలోచిస్తున్నాడు మాధవరావు.

"కుర్రాళ్ళ నడగండి. ఎంతేమిటి?"

"ఓ పాతికేనా యివ్వాలి. జోగారావు ఐదు రూపాయలిచ్చాడు. అది జట్కావాడికి సరిపోతుంది. మిగతవాళ్లు వొకళ్లో లేదీకి కానివ్వలేమంటున్నారు. నలుగురైదుగురు రావడమే మానుకున్నారు, ఎందుచేతనో."

"ఊళ్లో చెప్పుకుంటున్నారు. రంగమ్మగారంది. మా వాళ్ళ స్కూలుకే చదువు చెప్పించుకోడానికొచ్చిందన్నాను. అబద్ధం మన కులంపిల్ల కాదంది."

"ఆమె కెలా తెలుసు?"

"ఏమో. ఈ వూళ్లో వాళ్ల సాధ్యాలు. పోనీ నా గాజు లివ్వనా. ముందు డాక్టర్ కివ్వండి."

తారత్నం ధోరణి అతనికి ఆశ్చర్యం కలగచేసింది. మొదట్లో వొకటి రెండుమార్లు, వాళ్ల వూరు వెళ్ళిపోతానంది. ఇప్పు డనడంలేదు. నర్సులాగా, రాత్రి పగలు చాకిరీ చేస్తోంది. సరిగ్గా నిద్రాహారాలు లేవు. కొంచెం చిక్కింది. ఆమె చేతినున్న గాజులు చూశాడు. వొదులై వెనక్కి కదులుతున్నాయి. కంఠంకింద ఎముకమీద హారం ఎత్తుగా పడింది. గాజులు మార్చి డాక్టర్ బిల్లిచ్చి, మరో డాక్టర్ని రప్పించాడు. ఆయన పరీక్షచేసి 'ఆల్బ్యుమిన్' వుందన్నాడు—అందుకనే, నడుం నొప్పి, ఇన్జెక్షనిచ్చాడు. రాత్రి నిద్రపట్టటందుకు 'స్లీపింగ్ డ్రాట్' యిచ్చాడు. రెస్టిమ్మన్నాడు. శనివారం రాత్రి సీతారత్నం భోజనం చెయ్యదు. ఆలయంన్నించి తెచ్చిన కొబ్బరికాయనీళ్లు త్రాగి, అరటిపండు తింది. రాజమ్మ జావ తాగి నిద్రపోయింది. చిట్టెమ్మ వరండా గది ముందు పడుకుంది. మాధవరావు హాల్లో కూర్చొని కాగితంమీద లెక్కలు కడుతున్నాడు. పదకొండు దాటింది. కిటికీ అవతల వెన్నెల గాలిపటంలా కదులుతోంది, నీడల మధ్య అతను కుర్చీమీద తల వెనక్కి వేసి కళ్ళు మూశాడు.

"కాసిని తాగండి, చలవ" అని సీతారత్నం కొబ్బరికాయ నీళ్లు తెచ్చింది. అదిరిపడి లేచి కూర్చున్నాడు. కళ్లు తుడుచుకున్నాడు.

"ఇంకా మేలుకునే వున్నావా?"

"అప్పుడప్పుడు వో కునుకు తీస్తూంటాను. మీ రదీ లేదుగా." అని నీరసంగా నవ్వింది చిక్కిన మొహంలో కళ్లు పెద్దవిగా కనిపించాయి. తల కుడి

భుజం వేపు తిప్పి మాట్లాడుతున్నప్పుడు, చెక్కిడి, ముక్కు, వొంకర తిరిగిన గడ్డం, సగం కనపడే చెవి, సరిగ్గా చూస్తే ఆకర్షణీయమైన భంగిమం. నుదుటిమీది గీత—విడిగా వికృతంగా వున్నా, ఆ అమరికలో కలిసి, అలవాటైన ఆత్మీయతతో, వేరుగా కనబడదు. అందంగా లేని, అలవాటైన ఆ గీతని చూడటం అతని కానందంగా వుంది. మనస్సుని పెంచి సంతుష్టి పరచే అనుభూతి.—కంకుడుకాయ పులుసు, నువ్వు గింజ, అంట్లుగలో మినచోటు, పూడ్చి పోసేసిన గది మూల, కాళ్లు కుడిచినపీట, ఎడంచేతిపై వెగటు—తిలకించడంలో సంతుష్టినిచ్చే రహస్యానుభవాలు.

"పక్క వేశాను. నిద్రపొండి."

"నువ్వు పడుకో."

"ఇల్లా ఎంతకాలం?"

సమాధానం లేదు.

"ఏమిటంటారు జబ్బు?"

"ఈ డాక్టర్ కూడా హిస్టీరియా అంటాడు. వాళ్లి వాళ్లకి రాస్తానంటే వొద్దంటుంది."

"దానికేదేనా అయితే, నేనేదో చేశానను కుంటారు వూళ్లో జనం"

భార్య ఏమన్నా చేసిందేమో నన్న ఆలోచన వొకసారి మాధరావుకి తట్టి, మెఱుపల్లే మాయమైంది.

"వూళ్లో ఏమనుకుంటే ఎవరికి. నీమనస్సు నాకు తెలుసు.

అతని మోకాళ్లమీద తల ఆనించి కూర్చుంది సీతారత్నం.

నీకు చాల కష్టం కలిగిస్తున్నాకదూ?"

"మీ కష్టంమాటో."

"నాకీబాధలో ఏమిటో ఆనందం. ఇవాళే ఇంగ్లీషుపద్యం చెప్పడం మొదలెట్టాను. ఎక్కువ ఆనందం బాధవల్ల కలుగుతుందిట."

నవ్వువెనక విషాదం వెక్కిరింపుట.

"మీకు సంతోషంగా వుంటే, నాకదే చాలు."

"నామీద కోపం లేదు?"

"మీమీద మీకు కోపంలేదని తప్ప వేరే కోపం లేదు."

"నేను చెడ్డవాడిని కాదూ?"

"అది తెలుసుకొన్నవాడు జ్ఞానేఅనుకుంటాను."

"రాజీ అంటే నీకు ద్వేషం లేదు?"

"ఇప్పుడు లేదు."

"ఏందుచేత?"

"మీమీద ఎందుకు లేదో, అందుకే."

"అంటే?"

"నాకు మీరుతప్ప ఏముంది? మీలో వొక భాగం అది." మాధవరావు కళ్ళంట నీళ్లు. చిమ్ముతున్నాయి. పుస్తకాలలో మాదిరి మనుషులు జీవితంలో వుంటారన్న చైతన్యం, అతన్ని అల్పుణ్ణి చేసింది. కన్నీరు రాలడంలేదు. రెప్పలు కదిల్చాడు. గాలికి పొగ విడినట్లుగా, తేటపడ్డాయి కళ్లు ఆమె చెంపకింద తనవేళ్ళు కన్నీటితో తడుస్తున్నాయి. ఒకరిబాధకి, మరివొకరి కన్నీరు. ఎవరిదీ జీవితం? ఎవరికోసం?

'అమ్మో చచ్చాను' అన్న చిట్టెమ్మకేక వినబడింది తటాలున సీతారత్నం లేచి వంటింటాలోకొచ్చింది. అతనూ వెనకాలే వెళ్లాడు. రాజమ్మ గుమ్మంలో వుంది. "నేనే,—మంచినీళ్లు లేకపోతే, తీసుకుందామని పోల్లో కొస్తుంటే, కాలు దానిమీద పడిందిగావును.—అంత కేకెయ్యాలిటే పుట్టిమునిగినట్టు?" అంది రాజమ్మ. "పోల్లో కెడతం బాగానే ఎళ్లారు. మెలకువగానే వుండా. వయనం తెల్సింది ఘరలేదుగందా అనుకుని కన్నుమూశా — వొచ్చి మళ్ళా ఎల్లారా?—సరిగ్గా పొట్టమీదే స్తిరి..."

"ఏడిశావు పాడుముండా. కొస్తుంటె ంపంత చేస్తావు" అని రాజమ్మ కసిరింది.

"జ్వరం వొళ్లు—తూలా వేమో—" అన్నాడు మాధవరావు. "కూతంతదూరంగా ఏసుకుంటాలెండి" అని చిట్టెమ్మ కొంత పక్కగా లక్కుంది చాప.

మొన్నాడు నడుంనొప్పి తగ్గింది. కాని బాగా నయంగాలేదు. ఆకలేస్తుంది. డాక్టర్ డయట్ మీదే వుంచమన్నాడు. రాజమ్మ మరోస్లీపింగ్‌పిల్ వేసుకుంది. నిద్రపట్టడంలేదు తలనొప్పి ఒళ్లంతా చెమట్లు పోస్తున్నాయి. సీతారత్నం వుడుకులాంనీళ్ళల్లో గుడ్డతడిపి వొళ్లు తుడుస్తోంది.

"వొళ్లంతా వాసనగావుంది కాదు — స్నానం లేక."

"తుడుస్తున్నాగా. మరోచీర తెస్తాను." అని తలకి నూనెరాసింది; కాటుకెట్టింది; బొట్టెట్టింది.

విసనకర్రతో చిట్టెమ్మని విసరమంది. భోజనంచేసి వొస్తానని అది వెళ్లింది. తనే విసురుతోంది.

"మీకు శ్రమ నామూలంగా."

"ఫరవాలేదులే."

"ఆదె బ్బెట్లా తగిలింది?"

"చిన్నప్పుడు ఆట్లాడుకుంటూ కత్తిపీటమీద పడ్డాను.

"వారింకా ట్యూషన్లు చెప్తూనేవున్నారే..." బైట పిల్లలు, భర్త చెప్పుకుంటున్న మాటలు వినబడుతున్నాయి. సీతారత్నం బైటకెళ్ళి 'ఉస్, మెల్లగా! నిద్రపోతోంది' అని చెప్పి వొచ్చింది.

"భోజనానికి పొద్దుపోతోంది, మీరు వెళ్లండి" అంది రాజమ్మ.

"నువ్వు నిద్రపోయ్యాక."

"ఇప్పుడే పోతా." అని కళ్ళుమూసి, పక్కకి తిరిగి పడుకుంది.

భోజనా లయ్యాక, వంటిల్లు బాగుచేసుకుని, సీతారత్నం హాలు పక్కగదిలోకొచ్చింది. తమలపాకులకి సున్నం రాస్తోంది.

"రాజమ్మకోసం స్టేషన్ కెళ్ళిన రోజు నొచ్చింది ఆకవరు. ఎవరిదగ్గరనుంచి—?"

"రాఘవయ్యని నాస్నేహితుడు. పూనా మిలిటెరి ఎకవుంట్స్‌లో పనిచేస్తున్నాడు."

"ఏమంటాడు—ఉద్యోగం ఏదన్నా...?"

"కాదు. మాణిక్యం అన్నకొడుకు — అరసయ్యని—యుద్ధంలో చేరాడు. రెండేళ్లుగా వాడిదగ్గరనుంచి జవాబులేదుట, వాణ్ణిగురించి వార్తలేదుట. వాడిఫొటో యిచ్చి, ఎక్కడుండేదీ కొస్త వాకబు చేసి పెట్టమంటే, రాఘవయ్యకి ఫొటోపంపి, తెలుస్తే వ్రాయమన్నాను. నేవీలో చేరాడుట. రెండేళ్లుగా ఓడప్రయాణం సాగించి, దేశాలుచూసి, బొంబాయి నుండి, పూనా వొచ్చాడుట. ఇదివిను '...మీ అరసున్న వోపట్టాన లొంగలేదు. వాడిమీద ఫిర్యాదనుకున్నాడో ఏమో, పేరుమాత్రం 'అసురు' అని మార్చేశాడు. వాడే. అంబాలాలో ట్రైనింగ్ కూడా పూర్తయింది.

పెర్మనెంట్ కమిషనిచ్చి, మద్రాస్ హార్బర్ కి పోసుచేస్తున్నారు. అక్కడ బంధువులు కూడా వున్నారుట. అక్కడికి వెళ్ళేవుంటాడు."

ఉత్తరం చదివి నిట్టూర్చాడు మాధవరావు. "మాణిక్యం గోడకలు రెండూ తీరినట్లే."

"ఇంకా నాలుగైదొంద లివ్వాలిటగా!"

"ఇప్పటికి నిల్చింది. మెల్లిమెల్లిగా తీర్చలేక పోతామా?"

సీతారత్నం పక్కసర్ది కాసేపు నిద్రపోమ్మంది. ఉత్తరాలు వ్రాసి మంచంమీద పడుకున్నాడు.

"మరి నువ్వో?"

"నే యిల్లా వేసుకుంటాలెండి."

"వొట్టి కిందా—నేనూ కిందే వేసుకుంటా, చల్లగా వుంటుంది" అని తువ్వాలుతో గచ్చు దులిపి, దిండు లాగి ఆమె తలకింద పెట్టాడు. తామలపాకులకి ఎర్రబడిన పెదవుల వెనక పళ్లవరస తళుక్కుమంది. జుట్టు రేగి నుదుటిమీద గీతమీదికి జారింది. ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"కళ్లకింద గీతలు చూసుకున్నావా?"

"మీవి చూసుకున్నారా?"

"ఏం? మనస్సే అద్దం—" అని తల చేతిమీద ఆనించి వోరగిల్లాడు.

బైట పోస్ట్‌జవాన్ పిలుపు వినిపించింది. మరో నాలుగైదు క్షణాలలో 'అయ్యో' అన్న రాజమ్మ కేక బిగ్గరగా వినిపించింది. ఇద్దరూ చివాలున లేచి హాల్లోకి వెళ్ళారు.

రాజమ్మ నుదుటిమీద రెండు చేతులూ నొక్కుకుంటూ, గుమ్మంమీద వాలిపోయింది. వేళ్ళ మధ్య నుండి, చెవిమీదుగా రక్తం బొటబొట కారుతోంది మంచం హాల్లోకి లాగి, దానిమీద ఆమెను కూర్చోబెట్టారు. తడిగుడ్డ కట్టారు. అరంగుళం పొడుగు గాయం పడింది నుదుటిమీద. మాధవరావు సైకిల్ మీద వెళ్లి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన ఆయింట్‌మెంట్ రాసి బాండేజ్ వేశాడు. రక్తం మరకల బట్టలు మార్చి, కొత్త బట్టలు ధరించి, వరండా గదిలోకి మంచం పట్టించి, రాజమ్మ దిండ్లని వెనకాల వేసుకుని, గోడని జార్లపడి కూర్చుంది.

టీ తెచ్చింది సీతారత్నం.

"పెద్ద దెబ్బే. ఇదంతా చిట్టెమ్మ పనే." అన్నది.

"అసలేం జరిగింది?" అంటూ మాధవరావు గదిలోకొచ్చాడు.

"నాకు సరిగా జ్ఞాపకం లేదు. పోస్ట్‌వాడి కేక విని వీధిలోకొద్దామని హాల్లో గదియుందు కొచ్చాను. తలుపుమీద చెయ్యి పడిందేమో. తలుపుమీద వున్న గొళ్ళానికున్న తాళంకప్ప, చెవీ, నుదుటిమీద పడ్డాయి." అంది రాజమ్మ. సీతారత్నం ఆమె తల దువ్వి జడ వేస్తోంది.

"ఆమధ్య మనం కొన్న పెద్దతాళంకప్ప, అక్కడ పెట్టుకుంటారా ఎవరేనా?" అన్నాడు మాధవరావు.

"అది చిట్టెమ్మ పనే" అంది సీతారత్నం.

"దాన్నేం ప్రయోజనం. ఆ తలుపుమీద వెయ్యేస్తానని కలగందా?"

"తాళం నొక్కకుండా గొళ్ళానికి బిగించడం తెలివితక్కువ కాదూ?" అన్నాడు మాధవరావు. పాతాలకుర్రాళ్లు హాల్లో కొచ్చారు. అతను బైట కొచ్చేశాడు.

మర్నాడు సాయంత్రం నాలుగైంది. మాధవరావు హూల్దాల్ సర్దడం పూర్తిచేసి, వరండాగదిలో కొచ్చాడు. రాజమ్మ కుర్చీమీద అద్దం పెట్టి, చూసుకుంటోంది.

"ఇప్పుడెట్లావుంది—నొప్పి తగ్గిందా?"

"ఇంక యీమచ్చ పోదుగా."

అద్దంతీసి కూర్చోమంది. అతను కుర్చీయివతలకి లాగడంలో మోచెయ్యి తలుపుకి తగిలి, మూసుకుంది. గోడకానివున్న దిండ్లమీద వొరిగింది రాజమ్మ. తల దువ్వుకోలేదు. పాపిడ కదిలిపోయింది. ఊడినజుట్టును పైకిలాగి బిగించి ముడేసింది. మెడలో నగలు లేవు. చెవులకి దుద్దులు లేవు. చేతులలో గాజులు లేవు. మొహాన బొట్టు చెరిగింది—ఎర్రగా పాపిడికేసి. మంచంమీద పూలరేకులు నలిగి వాడి పడున్నాయి. ముందుకి వొరిగి నుదిటిమీద చెయ్యి ఆనించాడు మాధవరావు

"హిస్టీరియా అంటే ఏమిటండి?"

"స్త్రీలకు మామూలుగా వుండేవ్యాధి— అన్నీ సక్రమంగా జరగక మానసికంగా కలతగాని ఆందోళనగానివుంటే, —యివన్నీ కలిసి కలుగజేసే అస్వస్థత హిస్టీరియా: ఫలానా అని తెలీనప్పుడు డాక్టర్లు యీ పేరు చెప్తూంటారు."

"నాకదేట—"

"నాకట్లా గనిపించడం లేదు."

"మీకేం తెలుసు. మీరు డాక్టర్ కారుగా." దెబ్బ తగిలినచోట, వేలుకి కరుకుగా తగిలింది. చుట్టూ చర్మం నలిగింది—కొలనులో నిశ్చలంగావున్న నీటిని కాముంతో కదిలిన చేప కనిపినట్లు. అద్దంలో పగులు,— ఆకాశంలో మెఱుపు, సముద్రప్రదేశంలో భూకంపం. వేలు వెనక్కి మళ్ళింది. కళ్ళకింద కాకపాదాలమాదిరి చిన్నిముడతలు, శ్వాసలో, సలాబి కాలినట్లు చేపలు విడినట్లు అఖాతంలోంచి ప్రజ్వరిల్లినట్లు వాసన ఆవరించి అప్రయత్నంగా అతన్ని వెనక్కినెట్టాయి.

"ఎట్లాగో వున్నానుకానూ — తలంటుపోసుకుందా మని అన్నీ సిద్ధంచేసి వెళ్ళబోతున్నా మీరొచ్చారు."

"మరోవారంలో అన్నీ తగ్గుతాయి బాగుంటావు."

"ఇప్పుడు బాగలేనా?"

ఆమె రెండుచేతులు అతని మెడచుట్టూ వేసింది.

"స్నానాని కెళ్లనా?"

"నేను వూరెడుతున్నా. అమ్మకి వొంట్లో బాగాలేదుట. నిన్న ఉత్తరం అదే. మళ్ళా రెపొచ్చేస్తాను. ఏం?"

"డబ్బు కావాలా? మనియార్డరొచ్చిందిగా."

"వొద్దు, అడగడానికి వొచ్చాననుకున్నావా?"

"అల్లా గనుకుంటానని ఎందుకనుకున్నారు?"

"ఇదివర కన్నదే..."

"అబద్ధం అంటారా?"

"నిజం రోజు రోజుకీ మారదుగా"

రాజమ్మ లేచింది. బుజంమీమ్మది చేతిని తొలగించింది—'అబ్బ, చెమట' అంటూ.

తలుపులు తీసింది.

"వెళ్లనా?"

"అమ్మగార్ని అడిగానని చెప్పండి."

మాధవరావు నవ్వుతూ బైటకొచ్చాడు ముందు కుర్రాడు హోల్డాల్‌తో నడుస్తున్నాడు. బైటికెళ్లి రాజమ్మ గదికేసి చూశాడు మాధవరావు. లోపలంతా

నల్లగా కనబడింది. ఊచల మధ్య రాజమ్మ ముఖం— దానిమీద ˆ అది జైల్లో దృశ్యం; తను స్వేచ్ఛా

తుది ఘట్టం — రెండు రోజులు తర్వాత

మాధవరావు యింటికొచ్చేటప్పటికి మధ్యాహ్నం మైంది. వీధిలో రాజమ్మ గదికేసి చూశాడు. కిటికీ మూసివుంది. హాల్లోకి రాగానే సీతారత్నం వో కవరిచ్చింది. గబగబ గదిలో కెళ్లాడు.

"రాజమ్మేదీ?"

"వెళ్లిపోయింది"

"అదేమిటి? ఎప్పుడు—?"

"రాత్రి"

...ప్రశ్నార్థకంగా చూశాడు.

"వాళ్లి కృష్ణమూర్తి చిట్టెమ్మని సాయంవుంచి హరికథ విందామని వెళ్లా. ఇంటికొచ్చేటప్పటికి పదైంది. కృష్ణమూర్తి వొక్కడూ వున్నాడు. చిట్టెమ్మ బండితెచ్చిందిట. కూడా స్టేషన్ కెళ్లిందిట. అన్నంపెట్టుకుని తిని వెళ్లిం..."

"నీతో ఏమీ చెప్పలేదు?" అంటూ కవరు చూశాడు. చిరునామా టైపు కొట్టబడివుంది. చించాడు. అందులోనుంచి రెండు కాగితాలు పడ్డాయి; వొకటి ఇంగ్లీషులో టైపు కొట్టబడిన వుత్తరం. రెండోది తెలుగులో—

ఇంగ్లీషుది మొదట చూశాడు. రాజమ్మకి జబ్బు చేసినప్పుడు తాము దగ్గరుంచుకుని ఎంతో ఆదరణగా కనుక్కుని చికిత్స చేసి నయంచేసి పంపినదంపతులకు కృతజ్ఞత. కులభేదాలు గణించక యిట్లా సమానత్వం అందరూ కనబరిస్తే సంఘం పురోగమించగలదన్న ఆశ, పట్నంవొస్తే వారి అతిథులుగా వుండాలని ఆహ్వానం—దాని సారాంశం—అసురు సంతకం.

"...మాణిక్యం మాఅమ్మ. నన్ను మావదగ్గఱ అట్టేవుంచి చదువు చెప్పించింది. అరసయ్య బావే గా. చేసుకుంటానని మావ సరదా పడేవాడు. ఇంకెవరే నా మనస్సులో వున్నారా అని వోసారి మీ రడిగారు జ్ఞాపకం వుందా. చెప్పానుగాను. నావిషయం తెలవక ముందే వెళ్లడం మంచిదనిపించింది. సీతగారికి మీరంటే వున్న అపేక్ష, మీకు ఆమె అంటే వున్న గౌరవం, కళ్లారా చూశాను. నావిషయం మీకు తెలియదని నాకు తెలిసినప్పటినుంచీ, నాకు వొచ్చెయ్యాలని వుండేది. తాళం దెబ్బ—తాళంచెవితో తలుపు తీసి నట్లు—నేను రావడానికి కారణం. ఇంతకీ నా మొహాన అట్లా రాసిపెట్టివుంది..."

మాధవరావు కిటికీ తలుపులు తెరిచాడు.

"బాగ్ మరిచిపోయింది."

"ఖాళీ బాగ్గే లెండి" అన్నది సీతారత్నం, టీకప్పు చేతి కిచ్చి.

# అభినవుని నాట్యశాస్త్రము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

నాట్యశాస్త్రము రెండు భిన్నపాఠములతో లభించుచున్నది. కాశీముద్రితపాఠము దక్షిణాత్యసంప్రదాయసిద్ధమైన పాఠము. కావ్యమాలాముద్రితపాఠము ఔత్తరాహసంప్రదాయసిద్ధ మగు పాఠము. లొల్లట, ఉద్భట ప్రభృతులు ప్రాచీనపాఠమును వ్యాఖ్యానించిరి. తోత, ఉత్పల, శంకుక, భట్టేందురాజ ప్రభృతులు నవ్యపాఠము నంగీకరించిరి. అభినవగుప్తుడు నవ్యపాఠమును తీసికొనినాడు. ధనంజయుడు నవ్యపాఠమునుండి, అదే నగరమందలి భోజుడు ప్రాచీన పాఠమునుండి శ్లోకముల నిచ్చియుండిరి. కేరలదేశమున కొన్ని నవ్యపాఠప్రతులు, నేపాలమున దాక్షిణాత్య పాఠప్రతులు లభించినవి.

ఐదవ అధ్యాయాంతమున దాక్షిణాత్య పాఠమున నలుబది శ్లోకము లధికముగా గలవు. నవ్యపాఠములోని తొమ్మిదవ అధ్యాయము ప్రాచీన పాఠమున రెండు అధ్యాయములుగా కనబడుచున్నది. ఛందోఽధ్యాయములయందు గణవిభేదము నాశ్రయించిన లక్షణము లొకపాఠమున, లఘుగురు వివేకముతో గూడిన లక్షణము లింకొక పాఠమున కన్పించుచున్నవి. లక్షణాధ్యాయమున నవ్యపాఠములో ముప్పదియారులక్షణములు ఉపజాతి వృత్తమున నిర్వచించబడినవి. వ్యత్యస్త క్రమమున నీ నిర్వచనము లనుష్టుప్ రూపమున ప్రాచీన పాఠములో గలవు. నవ్యపాఠములోని ఇరువదియారవ అధ్యాయవిషయము ప్రాచీన పాఠమున ముప్పదియైదవ అధ్యాయమున కన్పించుచున్నది. ప్రాచీన పాఠములోని చివరిఅధ్యాయము రెండు అధ్యాయములుగా నవ్యపాఠమున గలదు. ఇట్లు విశేషభేదము కన్పించుచున్నను నీ రెండు పాఠములును ప్రచారములో గలవు. వ్యాఖ్యాతృభేదము నాశ్రయించుకొని వచ్చిన ఈ పాఠభేదములు దేశ మంతట వ్యాపించియున్నను విషయభేదమును తీసివేయుట కనేక యత్నములు జరిగియున్నవి. పూనా, బికనీర్ వ్రాతప్రతులలో కొన్ని ఈ గెండు పాఠములను సమన్వయపరచునట్లు దిద్దబడినవి. ఫ్రెంచిదేశపు ముద్రాపకు లీ ప్రణాళిక నవలంబించి, పదునాల్గవ అధ్యాయముతో నీ శ్రమను వదలిపెట్టిరి. వ్రాతప్రతులలో నొకదాని కింకొకటి సరిపోవుట లేదు. ఇట్టి పరిస్థితులలో అభినవగుప్తుని వ్యాఖ్య కనుగుణమైన పాఠమును సాధ్యమైనంతవరకు గ్రహించుట యుక్తమని తోచును. అభినవుడు ప్రతీకలుగా పదముల నుదహరించుటయే గాక, మధ్యమధ్య పూర్వాపర శ్లోకములను గూడ పఠించుట గలదు. దీనివలన శ్లోకక్రమమును, పాఠమును సంస్కరించుటకు కొంత ఆధారము లభించును.

రసపరమైన దీశాస్త్ర మని భావించి పాఠమును తోతభట్టు, అభినవగుప్తుడు సంస్కరించినట్లున్నారు. నంది కోహలప్రభృతులు ఈ సిద్ధాంత ప్రతిపాదనయే పరమావధిగా ఎంచకపోవుటచే గీతనృత్యములలోని విషయములను గూడ ఇచట పఠించినారు. ఇట్లు విషయభేదవశమున వచ్చిన పాఠభేదములు నాలుగు తెరగుల గలవు. ప్రాచీనపాఠమున స్వల్ప సంఖ్యాక శ్లోకములతో నున్న గ్రంథమును ఉద్భటుడు చదివినట్లున్నాడు. ఇదే పాఠమున పెద్దగ్రంథమును చదివినవాడు లొల్లటుడు. నవ్యపాఠమున స్వల్పగ్రంథమును ఘుంటకుడు, పెద్దగ్రంథమును కీర్తిధరుడు పఠించినారు. భవిష్యన్నాట్యాభివృద్ధిని అరికట్టనిరీతిగా జూపు నవ్యపాఠమును అభినవగుప్తుడు పఠించియున్నాడు. ఈ పాఠము అతిస్వల్పము గాదు, అతిదీర్ఘము గాదు కూడ. ఇట్లు పాఠమును అభినవుడే సంస్కరించినాడని ఆధునికులు కొందరు భ్రమజెందినారు. నాట్యశాస్త్రము రసపర మని యెంచి సంస్కరించినవారిలో భట్టనాయకుడు, తోతభట్టు ప్రధానులని సిద్ధాంతీకరించవీలున్నది. కావున అభినవుని పాఠ మితరపాఠములకంటె ఎచ్చట భిన్నముగా కన్పించుచున్నదో వివేచింపవలెను.

తొమ్మిదవ అధ్యాయము ఉరఃకర్మవద్ద నుండి తర్వాత అధ్యాయముగా నితరులు పఠించినారు. కాని అభినవుని పాఠమున ఈ విభాగము కన్పించదు. గతి ప్రచారమున కొన్ని శ్లోకముల నభినవుడు పరిత్యజించినాడు. వృత్తలక్షణమున గురు లఘు వివేకముతో జెప్పిన లక్షణములనే అంగీకరించుచు "తత్రేహాధ్యాయే భరతమునికృత మితి త్రికై ర్మకారాదిభిః కైశ్చిత్కృంచిల్లక్షణం స్వీకృత మితి ద్వివిధః పుస్తకపాఠో దృశ్యతే, మధ్యే చ చింతనాయపుస్తకే షూభయ ముపి పఠ్యతే" అనినాడు. మగణాదిగణములతో వృత్తలక్షణములను భరతుడు ప్రవచించినట్లు కొందరు భావించినారని తదనుగుణము లగు లక్షణ శ్లోకములను గూడ పఠించినారని చెప్పినాడు. కాని ఈ పాఠాంతర మితనికి సమ్మతము కాదు. ఇట్లే లక్షణాధ్యాయమున గూడ పాఠభేదములు కలవని "తథా చ మతాంతరేణ భగతి మునిరే వాన్యథా పృథ్వ్యద్దేశలక్షణేన నామాంతరై రపి న వ్యవహారం కరోతి; తత ఏవ పుస్తకేషు భేదో దృశ్యతే. తం చ దర్శయిష్యామః పఠితోద్దేశక్రమ స్త్వస్మదుపాధ్యాయపరంపరాగతః" అనినాడు. ఈ పాఠభేదముల నిచట చక్కగా సంస్కరించినవాడు తోతభట్టు ఇతనిపాఠము నే అభినవుడు స్వీకరించినాడు. ఈ పాఠమున గన్పించని ఇతరశ్లోకముల నామాస్థలముల స్పృశించినాడు.

భాషావిధానము, సంబుద్ధివిధానము, కాకువిధానము పదునేడవఅధ్యాయమున పఠింపబడినవి. కాని ఇతరప్రతులలో భాషావిధానముతో నీయధ్యాయము సమాప్తమగుచున్నది. పదునెన్మిదవ అధ్యాయమున వీథ్యంగములు వీథిక్రింద పఠింపబడినవి. లాస్యాంగములను సంధ్యంగాధ్యాయమున పఠించినాడు. ఇరువదినాల్గవ అధ్యాయమును స్త్రీపుంసోపచారముగా అభినవుడు పఠించుచు ఇతరప్రాతిప్రతులలో నిచట కన్పించు చివరిశ్లోకములను ముప్పదియైదవ అధ్యాయమున చదివినాడు. ఇతరప్రతులలో కన్పించు ముప్పదినాల్గవ అధ్యాయము ప్రకృతివికల్పనము కొన్ని మార్పులతో అభినవుని ఇరువదియారవ అధ్యాయమైనది. ఇరువదియెనిమిదవ అధ్యాయమున జాతిలక్షణములను గద్యరూపమున అభినవుడు పఠించినాడు. కాని ఈ లక్షణముల నితరులు ఆర్యావృత్తమున చదివినారు. ధ్రువాగానమందలి జాతి వినియోగములు ఇరువదియెనిమిదవ అధ్యాయమున కీర్తిధరుని చేతనే పఠింపబడినవి. ఇరువదితొమ్మిదవ అధ్యాయమున పాఠభేదము లనేకములు గలవు. అభినవుని పాఠమున ఆరోహి, అవరోహి అలంకారములు నిర్వచింపబడలేదు. పైగా "సా నానుపయోగాత్ కావ్యాలంకారవ త్తేషాం ఇయత్తా. నియమేనాభిధాతు మశక్యత్వా ద్వర్ణోక్త్యైవ చ తేషాం పరమార్థతో వ్యాపనా న్మయా యథాపి సర్వే న లక్షితాః, తథాపి శాస్త్రాంతర లక్ష్యమాణ నిరుక్తపరస్పర సోపాయే నైతాన్ జానీయేతే త్యర్థః" అనినాడు. ఇతర శాస్త్రములలో నీలక్షణములు చెప్పబడినవని, అక్కడక్కడ కొన్ని లక్షణములనే స్పృశించుచున్నానని చెప్పుచున్నాడు. కాని ఈ సందర్భమున భరతునినుండి మతంగు డుదహరించిన విషయము అభినవుని పాఠమున లేకున్నను, ఇతర ప్రతులలో కన్పించుచున్నది.

ముప్పదవ అధ్యాయమున కీర్తిధరకృతముగా కన్పించు

"నవ వంశాస్తు విజ్ఞేయా స్త్రిస్థానస్వరగోచరాః
తేషాం చైవ హి వర్ణానాం స్థానే స్థానే త్రికత్రయమ్"

అనుశ్లోకము నభినవుడు పఠించలేదు. మనువంశ, షడానన, ముని, వసు, నాగేంద్ర, మహానంద, రుద్ర, ఆదిత్య, విశ్వమూర్తి అను తొమ్మిదివంశవిశేషములే ఈశ్లోకమున గ్రహించబడుచున్నవి. నాన్యదేవుడు సహితము:

"ఏవం నవైవ వంశాన్ శుద్ధాన్ బ్రూతే త్రివక్రమే ణేహ
భరతాచార్యో వంశాన్ 'స్థానే స్థానే త్రికత్రయ'మితి"

అని చెప్పుచు పైశ్లోకము భరతకృతముని భావించినాడు. కాని ఇట్లు సంఖ్యానిర్ణయము గావించి శాస్త్రవృద్ధిని అరికట్టుట అభినవునకు సమ్మతము కాదు. గనుక ఈశ్లోకమును నిరాకరించినాడు. సాధ్యమైనంత వరకు నాట్యశాస్త్రమును సర్వానుగ్రాహకముగా జెప్పుట అభినవుని లక్ష్యములలో నొకటి యని గుర్తుంచుకొనవలెను.

ఐదవ అధ్యాయాంతమున చిత్రపూర్వరంగాంగము నొకదానిని అభినవగుప్తుడు వ్యాఖ్యానించలేదు. "యత్తు కీర్తిధరేణ నందికేశ్వరమత మత్రాగమత్వేన ...తం, తదస్మాభిః సాక్షాన్న దృష్టం, తత్ప్రత్యయ

యాత్తు లిఖ్యతే సంక్షేపతః......ఏవం నందికేశ్వర మతానుసారేణాయం చిత్రపూర్వరంగవిధి రితి నిబద్ధః" అని ఇరువదితొమ్మిదవ అధ్యాయమున పలికినాడు. నందికేశ్వరుని అభినయగ్రంథమునుండి ఈ యంగమును కీర్తిధరుడు గ్రహించినాడని, ఇది భరతశాస్త్రమున లేకపోయినను కీర్తిధరుని అనుసరించి దాని సంక్షేపరూపము నభినవగుప్తుడు చెప్పినాడు.

ఇరువదియైదవఅధ్యాయమున "లోకప్రమాణంహి విజ్ఞేయం" అని భరతు డనగా "ఏతాన్ విధీ నితి సామాన్యాభినయాధ్యాయా త్ప్రభృ త్యేతదధ్యాయ పర్యంతం యే కర్తవ్యతారూపాభినయానాం విధయ ఉక్తాస్తాన్ సమ్యగ్విజ్ఞా య్యేతి వదన్ కోహలాది శాస్త్రలక్ష్య ప్రవాహసిద్ధ మపి చిత్రాభినయం సూచయతి" అని అభినవుడు వ్యాఖ్యానించెను. భరతునిచే అనుక్తములగు హస్తవిశేషములను వివరించిన నందికేశ్వరుని అనుసరించి కోహలాదులు విశేష హస్తములను చెప్పినారు. వాటిని గూడ ప్రామాణికములుగా నంగీకరించవచ్చునని ఇచట గలదు. ఇంతటితో నాగక కోహల కృతములగు శ్లోకములను కొన్నింటిని ఆ సందర్భమున సంక్షేపించి ఇచ్చినాడు.

ఇరువది యెనిమిదవఅధ్యాయాంతమున "యేన మద్వచన మేవాత్ర న కేవలం ప్రమాణం, యావత్కాశ్యప మునిప్రభృతిభి రపి యన్నిరూపితం తదపీతి శివమ్" అని అభినవు డనినాడు. వివిధరాగములకు కశ్యపాదులు చెప్పిన వినియోగముల నిచట అంగీకరించినాడు. భరతుని గ్రంథమును సూత్రప్రాయముగా నంగీకరించి తర్వాతి వ్యాకర్తలు, శాస్త్రజ్ఞులు ప్రపంచించిన విషయసమూహము నంతను సమన్వయ పరచగల్గుట కీరీతిగా మార్గము నొకదానిని అభినవగుప్తుడు చూపియున్నాడు.

ముప్పదియొకటవ అధ్యాయమున అనేక పాఠభేదములు గలవు. ఒకప్రతికి మరియొకప్రతికి సంబంధము కన్పించదు. లక్షణశ్లోకములే భిన్నములుగా కన్పించుచున్నవి. కావ్యమాలాప్రతిలోని 293వ శ్లోకము తర్వాత తొంబదిరెండుశ్లోకము లధికముగా గలవు. కాని ఇందులో దాదాపు ఏబదిమాత్రమే అభినవునిచే వ్యాఖ్యానింపబడినవి. అభినవుడు కొన్నిటిని వ్యాఖ్యానించలేదని త్రోసివేయుటకు వీలుపడదు. సులభగ్రాహ్యములు, అనధిగతార్థరహితములు నగు శ్లోకముల ననేకముల నభినవు డితరభాగములలో సహితము వ్యాఖ్యానించలేదు కాగా నాయా శ్లోకములలోని విషయమును గ్రహించి ఇవి ప్రక్షిప్తములా, కాదా యని వివేచింపవలెను.

ముప్పదిరెండవ అధ్యాయమున అభినవుడు పఠించని పన్నెండు ధ్రువాలక్షణోదాహరణము లితర ప్రతులలో కన్పించుచున్నవి. ప్రభావతీ, మాలా, సాచికా, మాలతీ, మృగీ, సురభిముఖీ, వలితగతి, రతి, భుజగముఖీ, ద్రుతగతి, నవమాలా, విభ్రమ అని వీటి పేర్లు. ఇవి గాథావృత్త విశేషరూపములేగాని వేరుగాదు. మాత్రావృత్తము లగు గాథావృత్తములు లయభంగాశ్రితములు. ఈలయభంగములు దేశీతాలమునకు జెందినవి. ధ్రువాగానమున మాత్రావృత్తముల ప్రసక్తిని భరతు డంగీకరించలేదు గనుక అభినవునిపాఠము భిన్నముగా కన్పించుచున్నది.

ముప్పదిరెండవ అధ్యాయమునుండి కొద్దిభాగమును అభినవుడు వేరుజేసి తర్వాతి అధ్యాయముగా పఠించినాడు. ముప్పదినాల్గులోని జాతిలక్షణములలో గూడ పాఠభేదము లున్నవి. అభినవుని పాఠమున నివి విస్తృతముగా కన్పించవు. తర్వాతి రెండధ్యాయములలో అభినవుని పాఠమునకు ఇతరుల పాఠమునకు విషయభేదము గలదు. అభినవుని గ్రంథము ముప్పదియేడవ అధ్యాయముతో సమాప్తమగుచున్నది. కాని కొన్నిచోట్ల నాట్యశాస్త్రమున ముప్పదియారు అధ్యాయములే గలవని చెప్పియుండుటచే నీ సమస్య చాలా క్లిష్ట మగుచున్నది. కాని ప్రతి అధ్యాయవ్యాఖ్యను ఒక ధ్యానశ్లోకముతో నారంభించుచు, శివాద్వయసిద్ధాంతమునగల ముప్పదియారు తత్త్వములను అభినవగుప్తుడు స్పృశించియున్నాడు. శివాద్వయ వేదాంతమున కన్పించు అనుత్తరప్రతిభతో ముప్పదియేడవ అధ్యాయము నారంభించినట్లు కన్పించుచున్నది. ఈ ముప్పదియేడవ అధ్యాయములో చివరభాగము కొంత భరతునిచే చెప్పబడలేదని, వార్తికకారులగు రాహుల, శనీ, శ్రీహర్షులలో నొకరిచే నిర్మింపబడినదని చెప్ప వీలగుచున్నది. ఈ యధ్యాయమున కోహల, వత్స, శాండిల్య ప్రభృతుల నామములు పేర్కొనబడినవి. గ్రంథావసానమున "నంది భరత సంగీత పుస్తకమ్" అని కొన్ని ప్రతులలో కన్పించుచున్నది. ఏదే యెట్లున్నను నాట్యశాస్త్ర

మతివిచిత్ర వరివర్తనల నంరిన దని స్పష్టము అభినవగుప్తుడు నేడు తిరిగివచ్చిన గూడ తాను వ్యాఖ్యానించిన ప్రతిని కనుగొనజాల డనుటలో నతిశయోక్తి లేదు. ఇట్టిచో భరతుని సంగతి వేరుగా జెప్పనక్కర లేదు.

## 3

భరతుని నాట్యశాస్త్రము రసపరమైన గ్రంథమని, రసమును కావ్యాత్మగా ప్రపంచించినవాడు భరతుడని సాహిత్యసంప్రదాయము వివిధవిషయములను రసపరముగా సమన్వయించిన భరతునిగ్రంథమును చక్కగా సంస్కరించినవాడు అభినవగుప్తుడు. ఇతరవ్యాకర్తలీవిషయమును గుర్తించినట్లు కన్పించదు. కావుననే వారిపాఠము లభినవుని పాఠముతో చాలచోట్ల ఏకీభవించకున్నవి. అభినవుని పాఠమున నిషధహస్తము:

"ముకులం తు యదా హస్తం కపిత్థః పరివేషయేత్
సమంతవస్త్ర స్తదా హస్తో నిషధో నామ నామతః."

అని గలదు. కా

"గృహీత్వా వామహస్తేన కూర్పరాభ్యంతరే భుజమ్
దక్షిణం చాపి వామస్య కూర్పరాభ్యంతరే న్యసేత్
స చాపి దక్షిణోహస్తః సమ్యఙ్ముష్టి కృతో భవేత్
ఇత్యేష నిషధో హస్తః"

అను లక్షణము ప్రాచీనపాఠముగా కన్పించుచున్నది. ఇచట పాఠాంతరముగా:

"జ్ఞేయో వై నిషధో నామ హంసపక్షౌ పరాఙ్ముఖ
జాలవాతాయనాదీనాం ప్రయోక్తవ్యోఽభిఘట్టనే"

అను లక్షణము గలదు. ఐనను

"శిఖర స్తు యదా హస్తో మృగశీర్షేణ పీడితః
నిషధో నామ విజ్ఞేయః స భయార్తే విధీయతే"

అని కీర్తిధరుని పాఠమున్నది. ఆగమములలోని ముద్రల నాశ్రయించుకొనినది అభినవుడు చదివిన లక్షణము. ఇదే లక్షణము విష్ణుధర్మోత్తరమున గూడ గలదు. అభినవుని నిషధహస్తలక్షణమును వర్ధమానహస్తలక్షణముగా కీర్తిధరు డిచ్చినాడు. అవయవ సన్నివేశ సౌందర్యము నభివ్యక్తము చేయునది అభినవుని పాఠము. అభినవుడా కొద్ది హస్త వర్తనముల నే గ్రహించి భరతుని హస్తలక్షణములలో పఠించినాడు. కాని కీర్తిధరుని పాఠమున హస్తములు, వర్తనములు వేరువేరుగా కన్పించుటచే లక్షణములు భేదించుచున్నవి. కోహలుడు వర్తనలను, చాలకములను తన సంగీత మేరువున వివరించినాడని చెప్పుచు అందలి శ్లోకములను కల్లినాథు డుదహరించియున్నాడు. కోహలశార్దూల సంవాదరూపమగు సంగీతమేరువున ఇతరవిషయములు గూడ ననేకములు గలవు. అభినవునకు కోహలుని గ్రంథము సుపరిచితమే. కాని కోహలుని వలె వర్తనచాలకములను వేర్వేరుగా పఠించక, ఏకత్ర సమన్వయపరచుటయే అభినవుని వ్యాఖ్యలో విశిష్టముగా కన్పించును. నాట్యశాస్త్ర మభినయపర మని కోహలాదులు ఎంచిరని, రసపర మని అభినవగుప్తుడు భావించినాడని ఇంతటితో స్పష్టమగుచున్నది. కావుననే "శాంతరసోపక్షేపోఽయం భవిష్యతి" అని భట్టనాయకుడు వచించిన గ్రంథప్రయోజనము నభినవగుప్తుడంగీకరించి యున్నాడు.

వృత్తులను నిర్వచించు సందర్భమున గూడ పాఠభేదములు, మతభేదములు గలవు. ఇవి గూడ రసాభినయభేదము నాశ్రయించుకొని వచ్చినవే యని చెప్పుట కీశ్లోకములను గమనింపవలెను. రసపర్యవసితము [illegible]

"శృంగార హాస్యకరుణై ర్వృత్తిః స్యాత్కైశికీ రసైః
సాత్త్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుతసమాశ్రయా"

అని కోహల పాఠముగలదు.

"శృంగారే చైవ హాస్యే చ వృత్తిః స్యాత్కైశికీతి సా
సాత్త్వతీ నామ సా జ్ఞేయా వీరరౌద్రాద్భుతాశ్రయా
భయానకే స బీభత్సే రౌద్రే చారభటీ భవేత్
భారతీ చాపి విజ్ఞేయా కరుణాద్భుతరూపయోః"

అని లొల్లటమతానుసారమైనపాఠ మున్నది.

"హాస్యశృంగార కరుణైర్వృత్తిః స్యాత్కైశికీ రసైః
సాత్త్వతి చాపి విజ్ఞేయా వీరరౌద్రాద్భుతాశ్రయా
భయానకే సబీభత్సే రౌద్రే చారభటీ భవేత్
భారతీ చాపి విజ్ఞేయా వీరహాస్యాద్భుతాశ్రయా"

అని ఘంటకమతానుసారమగు పాఠము కన్పించుచున్నది. కాని

"వాక్ప్రధానాతు భారతీ
తథా వీరరసప్రాయా విజ్ఞేయాసాత్త్వతీనృప
తథా రౌద్రప్రచాండ భవత్యారభటీసదా
శృంగార హాస్యబహులా తథా భవతి కైశికీ"

అని విష్ణుధర్మోత్తరపాఠము గలదు. ఈ పాఠము నకు సన్నిహితముగా

"హాస్యశృంగార బహులా కైశికీ పరిచక్షితా
సాత్త్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుత సమాశ్రయా
రౌద్రేభయానకే చైవ విజ్ఞేయారభటీబుధైః
బీభత్సకరుణే చైవ భారతీ సంప్రకీర్తితా"

అని అభినవుని పాఠ మున్నది. కోహలపాఠమును విద్యానాథు డంగీకరించినాడు. కాని అభినవుని పాఠము భరతమునిసమ్మతముగా కన్పించుచున్నది. ఇచ్చట కన్పించు పాఠభేదము ఉత్సృష్టికాంకమున నే వృత్తిని యోజించవలె నను విషయమున భిన్నవాదము లకు దోహద మొసగినది. ఉత్సృష్టికాంకమున న్యాయవృత్తి, అన్యాయవృత్తి, ఫలవృత్తి గలవని ఉద్భటునివాదము. ఈ న్యాయవృత్తియే కోహలుని కైశికీవృత్తి. లొల్లటుడు ఫలవృత్తి నంగీకరించలేదు. ఉత్సృష్టికాంకమున సాత్త్వతీవృత్తియే ఉండవలె నని శంకుకుని మతము. సాత్త్వతీ నిర్వచనమున 'శమాశ్రయా' అనుపాఠము నంగీకరించిన కోహలుడు ఈ వృత్తి సందర్భమున శాంతరసమును ప్రస్తుతింపవలసివచ్చినది. ఉత్సృష్టికాంకమున భారతీవృత్తినే అభినవు డంగీకరించినాడు. ఉద్భటుని పంచమవృత్తిని శంకుకుడు సహితము నిరాకరించియున్నాడు. అభినవుడు మాత్రము భరతుని భావములకు వ్యతిరేకముగా శాస్త్రమును ప్రవచించలేదు. ప్రాచీన మతములలో నెన్నింటిని సులభముగా నంగీకరించ వీలున్నదో, వాటి నన్నింటిని వివేచించినాడు. తాను స్వీకరింపజాలని పాఠమును, భావమును సోపపత్తికముగా వివరించినాడు.

సమవకార లక్షణమున :

"ఉష్ణిగ్గాయత్రీ వా యాని తథాన్యాని బంధకుటిలాని
వృత్తాని సమవకారే కవిభిర్నైవ ప్రయోజ్యాని".

అని ఉద్భటుని పాఠముగలదు. కాగా శర్మకామశృంగారములకు గతి కల్పించబడినది. కాని

"ఉష్ణిగ్గాయత్ర్యాద్యా న్యన్యాని చ యాని బంధకుటిలాని
వృత్తాని సమవకారే కవిభి స్తాని ప్రయోజ్యాని."

అని అభినవునిపాఠ మున్నది. సమవకారమున సంఘ్యంగములకు విద్రోహ కపటముల కిచట గతి కలుగుచున్నది. అల్పాక్షర వృత్తములను గాక స్రగ్ధరాది వృత్తముల నే యోజింపవలె నని ఉద్భటుడు వ్యాఖ్యానించుట అభినవునకు సమ్మతము కాదు.

హస్తాభినయమున వాచికప్రాధాన్యమును తెలుపు సందర్భమున

"ఉత్తానః పార్శ్వగ శ్చైవ తథాధోముఖ ఏవ చ
ప్రచార స్త్రివిధోఽఙ్గానాం నాట్యనృత్తసమాశ్రయః'

అని అభినవుని పాఠమున్నది. కాని "ఉత్తానోథస్థల స్త్ర్యశ్రోఽగ్రగోఽధోముఖ ఏవచ పఞ్చప్రచారో హస్తస్య నాట్య నృత్త సమాశ్రయాః" అని ఉద్భటుడు పఠించుచు పంచ ప్రచారములను చెప్పినాడు. కాని హస్తప్రచార త్రైవిధ్యమే అభినయమునకు లాలిత్యమును, సౌష్ఠవమును తీసికొని రాగలవు గనుక ఉద్భటుని పాఠమును త్రోసి వేయవలసి వచ్చుచున్నది.

అభినవుని పాఠము ననుసరించి ఇరువది తొమ్మిదవ అధ్యాయమున మొదటి శ్లోకము :

"షడ్జోదీచ్యవతీ చైవ షడ్జమధ్యాతథైవ చ
మధ్యపంచమ బాహుల్యాత్కార్యా శృంగార
హాస్యయోః

అని గలదు. కాని ప్రాచీన పాఠమున "షడ్జ పంచమ" అని కన్పించుచున్నది. ఐనను [మా'
'హాస్యశృంగారయోః కార్యా స్వరా మధ్యమపంచ
'మధ్యపంచమ భూయిష్ఠం గానం శృంగార హాస్య
యోః'

అను భరతుని వాక్యములవలన అభినవుని పాఠమే భరతసమ్మతమైన దని వ్యక్తమగుచున్నది. "షడ్జ పంచమ" మను పాఠమును నాన్యదేవుడు గూడ గ్రహించినాడు.

ఈ రీతిగా పాఠభేదములు, విషయభేదములు చాల కన్పించుచున్నవి నాట్యశాస్త్రము రససిద్ధాంతము నే ప్రధానముగా ప్రపంచించుచున్న దని సంప్రదాయవచనము గలదు. అందుచే వితన్మార్గావలంబి యగు అభినవుడు పఠించిన నాట్యశాస్త్రమే మనకు ప్రామాణికము కావలెను.

# విషాదాంతం

నాగభూషణ్

* గతసంచిక తరువాయి

## రెండవరంగం

* * సూర్యం, చంద్రం అలా కూర్చునే వుంటారు. కుసుమ వస్తుంది. మనిషి అతినవీనమైన నాగరిక యువతి... మాటా, చేతా కూడా అందుకు అనుగుణంగానే వుంటయ్. భాగ్యవంతులపిల్ల, చదువుకున్నది, కాస్త అందమయినది కూడాను. ఆమెలో లేని లోపం—సాధారణంగా అలాంటి పిల్లలకుండే గర్వం లేకపోవడం.

కుసుమ : హల్లో! సూర్యం...మార్నింగ్ చంద్రం... (ఎవ్వరూ మాట్లాడరు) అరె! ఏమిటిది?... ఓ సూర్యచంద్రులారా! మీ దయాసముద్ర తరంగములను మావైపు తరలించకున్న, మే మందరమును బీడుపట్టిన భూములవలె, నీరు లేని లతలవలె, ప్రేమలేని హృదయములవలె శ్రమోడైపోమా? అందుకే, మామీద ఆగ్రహించకుండా, తమ అనుగ్రహాన్ని ప్రసాదించండి—

సూర్యం: సూర్యచంద్రులు నీ ప్రార్థనను అంగీకరించారు.

చంద్రం: నీ తపస్సుకు మెచ్చారు. ఏం కావాలో కోరుకో—

కుసుమ : మీరు నా ప్రశ్నలకు సమాధానం చెప్పడమే నాకు కావలసిన వరం.

చం : మేము సిద్ధముగా నుంటిమి. నీ ప్రశ్న లేవి?

కుసుమ : అవధరింపుడు దేవరలారా! మీ యీ మాన విషాదవదనములకు కతంబెద్ది?

చం : ఆ ప్రశ్నకు సమాధానము చెప్పబడెగు.

కుసుమ : ఏమిటి సూర్యం? ఎందు కలా వున్నారు? నిజం చెప్పండి.

సూ : ఏం చెప్ప మంటావు కుసుం? మన నాటకానికి మధ్యలోనే భరతవాక్యం పలికారు.

కుసుమ : ఏం?

చం : ఏం ఏమిటి? కథానాయకుడే కాదంటున్నాడు.

కుసుమ : ఎందుకని?

సూ : పైనున్న ఆ భగవంతుడికి చెప్ప వాడికి కూడా తెలియదు. నాన్న నాటకాలు వేసి చెడిపోతున్నావని కేకలు వేశాడు. అందువల్ల నాన్న ప్రయోక్తగా వుండి వెయ్యబోయే నాటకంలో తను వెయ్యకుండా నాన్నమీద కసితీర్చుకుందా మనుకుంటున్నాడు అన్నయ్య.

కుసుమ : నువ్వనుకొనే ప్రవాదాలన్నిటికీ, ప్రచారాన్ని కల్పించి ప్రమాదాన్ని తీసుకురాకు. మీ అన్నయ్య ఎందుకు వద్దన్నాడో సరిగ్గా తెలియకుండా—

చం : అసలు వాడు చెబుతున్న కారణం, వాడి ప్రక్కన వేసే నాయిక లేదని.

సూ : ఓ! గొప్ప ఐడియా! ఆనాడు ఇజాక్ న్యూటన్‌కు వచ్చింది. ఇవ్వాళ మనకు వచ్చింది...కుసుం! నువ్వే వేస్తేనో ఆ వేషం?

కుసుమ : నేనా!

సూ : అవును, నువ్వే!

కుసుమ : నాకు చేతకాదు బాబూ!

సూ : ఇన్నాళ్ళ్... ఇంతమందిమి హేమాహేమీలం ఇక్కడ వున్నాం. ఇంకా చేతకాదంటావా? నువ్వు 'ఊ' అను, నీకు తయారు తినిపిస్తాం. ఒక అయిదు, ఆరు నెలల్లో. శ్రీమతి—తప్పు తప్పు—కుమారి కుసుమాదేవి ఆంధ్రదేశం గర్వించదగ్గ అగ్రశ్రేణి నటీమణి కాబోతున్న దనడంలో ఆశ్చర్యం అణుమాత్రంకూడా లేదు.

కుసుమ : నేను వెయ్యను సూర్యం. అమ్మా, నాన్నా వింటే ఇంకేమైనా వుందా?

సూ : చాలా సంతోషిస్తారు... నీకు యిష్టం వున్న దను. మిగిలిన అడ్డంకు లన్నింటినీ ఆంజనేయుడు సముద్రందాటినట్టు, అవలీలగా దాటేస్తాను.

చం : ఇంతకూ కుసుమ సందేహానికి సమాధానం?

సూ : విను మరి—కుసుమాదేవిగారు ఏ నెపంతో నైతే మన యింటికి పంపబడుతున్నదో, ఆ నెపమే దీనికీ సమాధానం చెబుతుంది.

కుసుమ : అంటే?

సూ : అంటే, ఎవరికోసమైతే మీరు ఈ యింటికి వస్తున్నారో—వారే స్వయంగా ఆహ్వానించారనుకోండి—

చం : అంటే?

సూ : ఇంకా అంటే ఏమిట్రా, అంటే ?—అంతే! మట్టిబుర్ర !

చం : మట్టిబుర్ర ఏమిట్రా ? ఎప్పుడో పట్టేస్తే—

సూ : ఏడిశావ్... ఏమంటావు కుసుం?

కుసుమ : ఏమిటి?

సూ : వేషం వెయ్యడానికి—అభ్యంతరం లేదు కదా !

కుసుమ : మరి మీ అన్నయ్య—?

సూ : అవన్నీ నాకు వదలమంటిని గదా!

కుసుమ : సరే!

సూ : థాంక్స్... ఇవ్వాళ ఇంత గొప్ప సమస్యను పరిష్కరించినందుకు నన్ను నేను అభినందించుకోకుండా వుండలేకపోతున్నాను.

చం నేను?

సూ : ఇంకా నేను అంటావేరా? అమాంతం నన్ను అభినందించక!

చం : (నీరసంగా) అంతేనా?

సూ : ఏడవకురా... ఏడ్చినా మొగుణ్ణి కొట్టిన ఆడవాళ్ళమాదిరిగా పబ్లిక్ గా ఏడవకూడదురా—సరే! ఇంతవరకూ ప్రతివిషయంలోనూ మనం భాగస్వాములం కాబట్టి, దీని బాపతు క్రెడిట్ నీకూ సగం యిచ్చాను. తీసుకో—

కుసుమ : ఇహ వెడతాను—

చం : ఇంటికా?

సూ : అహాఁ!—ఇంట్లోకి—

కుసుమ : ఏయ్ సూర్యం! ఏమిటిది ఇందాకటినుంచీ చూస్తున్నాను, మరీ అంత మిడిసిపడుతున్నావ్?

సూ ఓహోహో! ఎంత సున్నితమైన కోపం? ఈ ఆకారంలో నిన్ను చూచి నీ మాటలు విన్నవాడు ఓ నటుడైపోయాడు. కాని, అదే ఒక కవి అయితే, నీమీద ఆశువుగా అమాంతం ఓ లక్ష పద్యాలు చెప్పి, వాటిని నీకే అంకితం చేసేవాడు. నీకు జీవితాంతం దాసోహం చేసేవాడు... కాని ఈ నిర్భాగ్యుడేం చెయ్యగలడు?

కుసుమ : తొందరపడకు. నువ్వూ కవిత్వం చెప్పే రోజులు రావూ? రాధ నీచేత ఎప్పుడు కవిత్వం చెప్పిద్దామా అని చూస్తోంది—

చం ఏ రాధ? కొంపదీసి—

కుసుమ ఆఁ! మీ క్లాసుమేటు రాధే! అక్కడికే వెడుతున్నాన్లే... చెప్పొస్తాను...

చం ఏమనో?

కుసుమ ఆ కోతిని పెళ్ళిచేసుకొని చెవులు పట్టుకు సాగదియ్యమని.

సూ ఇంతపనికట్టుకునీ అక్కడకు వెడుతున్నావు గనక, ఆ అమ్మాయితో చెప్పు... కోతులు మరీ పెద్దకోతికి గాని లొంగవని—

కుసుమ : అదే చెబుతాను. ఆ అమ్మాయి నిన్ను గురించి అడగని క్షణం లేదు.

సూ : వెళ్ళు, వెళ్లు ... తుమ్మెదకోసం పువ్వు విచ్చుతుందో, పువ్వుకోసం తుమ్మెదే వస్తుందో చూస్తాం.

చం : విష్ యు గుడ్ లక్ ...

కుసుమ : అగుగో!—(అంటూ త్వరగా వెళ్లిపోతుంది. ఇద్దరూ దీర్ఘనిశ్వాసాలు విడిచి, కరచాలనం చేసుకుంటారు.)

[రామం వస్తాడు. దేనికోసమో ఆతృతతో ఎదురుచూస్తూ వుంటాడు. మనిషిలోనూ, మాటలోనూ తొందర.]

సూ కంగ్రాట్యులేట్ చెయ్యరా బ్రదర్!

చం షేక్ —(ఇద్దరూ చేతులు చాస్తారు.)

రామం ఎందుకురా?

సూ నువ్వు ఇంతవరకు నాటకం వెయ్యడానికి చూపిన అభ్యంతరాలన్నింటినీ అధిగమించి విజయం సాధించాం కనుక—

రామం : సరిగ్గా చెప్పండిరా—

చం : కుమారి కుసుమా దేవిగారు మన నాటకంలో కథానాయికగా వెయ్యడానికి ఒప్పుకుంది.

రామం : (నిస్పృహతో, నిట్టూర్చి) ఆఁ..(కుర్చీలో కూర్చుంటాడు.)

సూ : దీన్లో అంత మూర్ఛ నటించవలసిన దేముందిరా?...నువ్వు ఆనందంతో ఆకాశం అంత ఎత్తున ఎగురుతావని నే ననుకుంటే, అమాంతం క్రిందపడ్డావ్!

రామం : ఆవిడ వేషంవేస్తే మనం నాటకాలు వెయ్యడం ఎందుకురా? చెప్పులషాపు పెట్టుకోవచ్చు.

సూ : బ్రదర్! ని అభ్యంతరాలు నా కర్థంకావడం లేదు. నాటకాలు వెయ్యడానికి సంస్కారవతులైన 'ఫామిలీలేడీస్'రావాలని ప్రపంచమంతా ఘోషిస్తూవుంది. నాటక కళారాధనలో నటరాజును మనం మరో వినూత్నమైన పుష్పంతో పూజిస్తున్నామని గర్వపడక, ఉసూరుమంటావ్?

రామం : నీ వుపన్యాసం కట్టిపెట్టి, కాసేపు అవతలకు పో—

చం : (సూర్యంతో) రామానికి ఈ రంగంలో పనివుంది కాబోలు రా!—

రామం : ఆఁ! వుంది—

చం : ఆ పని యేమిటో ఈ భృత్యులకు కూడా చెప్పి పుణ్యం కట్టుకుందురూ!

రామం : నాకు పుణ్యం అక్కర్లేదు నడవండి.

సూ : మరి నాటకం వేస్తానని వాగ్దానం చెయ్యి.

రామం : అట్లాగేరా నాయనా! ఇహనైనా వెధవ వేషాలు వెయ్యక బయటకు నడవండి.

చం : మనం వేసేవి మంచివేషాలయినట్లు!

సూ : వాడికేంరా? జానపద నాటకాల్లోనూ, పౌరాణికనాటకాల్లోనూ వాడు యువరాజు; సాంఘికాల్లో అయితే ఓ భాగ్యవంతుడి ముద్దుబిడ్డ....ఎక్కడకు వెళ్లినా ఆదరసత్కారాలు, ఏ పనిచేసినా పొగడ్తలు.—తనను ప్రేమించి తనకోసం ప్రాణాన్నిసయితం యివ్వగల ప్రియురాండ్రు—

చం అబ్బ! గ్రాంధికంతో చంపకురా—ప్రియురాళ్లు అను.

సూ ఏ రాళ్లయితే నేం వీడి పళ్లు వూడడానికి?.. చిట్టితండ్రి వీడికేంరా, మహరాజు బిడ్డ.

[రామం ఎవరికోసమో చూస్తూ, చిరాకుపడతాడు.]

చం : ఎవరికోస మీా నిరీక్షణ?

సూ : ఎవరికోసమో ఎందుకురా? ఏ రాజకుమారికోసమో!—ఎన్ని కోటగోడలు ఎగబ్రాకాలో, ఎన్ని అంతస్థులు ఎక్కాలో, ఎందరిలో యుద్ధాలు చెయ్యాలో—(రామానికి కోపం వచ్చిందని తెలుసుకొని) నిజం చెబితే నిష్ఠూరంలేరా బ్రదర్! అయినా మాకెందుకు? వస్తాం....

చం : (వెడుతూ) గుడ్ లక్......[వెడతారు]

[ఓ క్షణం నిశ్శబ్దం...నిశ్శబ్దాన్ని భరించలేనివాడిలా కొంచెంసేపు చిరాకుగా అటూ యిటూ తిరిగి, చివరకు లోపలకు చూచి, చాలా రహస్యంగా పిలుస్తాడు.]

రామం : విజయా! విజయా!!

[విజయ వస్తుంది. మానసికంగానూ, శారీరకంగానూ కూడా శ్రమించిన మనిషిలా వుంది.]

రామం : చివరకు ఆడవాళ్ళనుంచి సానుభూతి కూడా కరువైంది మాకు.

విజయ : కరువైంది సానుభూతి కాదు. మా సానుభూతిని అర్థం చేసుకొనే హృదయాలు లేక పోవడం.

రామం : అర్థం చేసుకున్న హృదయాల ఆరాటం మీరు తగ్గించారు కాబోలు! చరిత్రలో ఎంతమంది—

విజయ : చరిత్ర సంగతి చెప్పకండి...గతంలో మన గొప్పల్ని చూసి మాత్రమే బ్రతకటం మాకు చేతకాదు.

రామం : పోనీ ఈ రోజుల్లో చూడు...నీకోసం నేను ఎంతగా బాధపడుతున్నానో నీకు తెలుసు. తెలిసి కూడా ఈ సంగతి నాన్నతో చెప్పడానికి నువ్వు ఎందుకు సుముఖంగా లేవో చెప్పు.

విజయ : నాకుమాత్రం ఇలా వుంటే సుఖంగా వుందా చెప్పండి...కాని పరిస్థితులు అనుకూలంగా వుండవద్దా? మీ నాన్నగారు చెప్పే మాటలనుబట్టి మనజీవితాలమనుగడ వుంటుందని మనం జ్ఞాపకం వుంచుకోవాలి.

రామం : ఏమిటి విజ్జీ, నువ్వనేది? ఆయన ఇష్టపడనంత మాత్రాన నా అభిప్రాయాన్ని మార్చుకుంటానంటావ్?

విజయ : నేనన్నానా? కాని ముందే పోట్లాటలతో బయలుదేరడ మెందుకు?

రామం : పోట్లాటలతో బయలుదేరడం నాకూ యిష్టం లేదు విజ్జీ. కాని నా అభిప్రాయాలతో ఆయన ఏకీభవించలేకపోతే అందుకు నేను కాదు బాధ్య

విజయ : మీరు మాత్రం తొందరపడకండి.

రామం : తొందరా! ఇంత దగ్గరగా వుంటున్నా, ఈ ఇంట్లోనే, దూరంగా నిన్ను చూచి, నీ దగ్గరకు రాకుండా, నన్ను నేను నిగ్రహించుకోమంటావ్? ఇన్నాళ్ళు చూపించిన ఓర్పు చాలు...ఇహ—

విజయ : (నోటి కడ్డంగా చెయ్యివుంచి, వారిస్తూ) అదే! మీ యీ తొందర మనకు ఎప్పుడే ప్రమాదం తీసుకువస్తుందో నని నాభయం.

రామం : భయం ఏమీ అక్కర్లేదు ... (విజయను దగ్గరకు తీసుకొని) నాన్నగారిని ఇంటికి రానీ, ఈపూట తప్పకుండా చెబుతాను.

[ఇంతలో ప్రసాదరావు వస్తాడు. రామం చివరిమాట ఆయన విన్నాడు. వాళ్ళిద్దర్నీ అలా చూడగానే ఆయనకు కోపం వచ్చిన మాట నిజమే కాని, చాలా నిగ్రహించుకుంటాడు. ఆయనను చూసి ఇద్దరూ భయపడి, దూరంగా జరుగుతారు. విజయ పాలిపోయింది. ఆమె మొహంలో నెత్తురు చుక్క లేదు. రామమోహన్ కూడా ముందు జంకినా, తరువాత ఓ నిశ్చయానికి వస్తాడు].

ప్రసా : నువు వెళ్ళమ్మా—(విజయ వెళ్ళడానికి సంకోచిస్తుంది.) వెళ్లు విజయా, మేం కొంచెం మాట్లాడుకోవాలి. (వెడుతుంది.) (ఓ క్షణం ఆగి) ఏమిటిదంతా? (రామం మాట్లాడడు.)

ప్రసా : నిన్నే ఏమిటిది?

రామం : నేను విజయను ప్రేమిస్తున్నాను.

ప్రసా : ప్రేమించు. దానికేం?

రామం : పెళ్ళిచేసుకుంటాను.

ప్రసా : అబ్బా! అంతవరకు వచ్చిందా? ఎన్నాళ్ళనుంచీ ఆడుతున్నారీ నాటకం?...మొన్న వేసంకాలం సెలవులకు నువ్వు దీనికోసమన్నమాట పల్లెకువెళ్ళింది ... స్టేజీమీద నేకాక జీవితంలో కూడా నాటకాలు ఆడుతున్నా వన్నమాట!

రామం : ఎగతాళికాదు నాన్నా...నిజంగా చెబుతున్నాను.

ప్రసా : అంటే, విజయను నేను పెళ్ళిచేసుకుంటాను, నమ్మమంటావ్?

రామం : ఏం? నమ్మకుండా వుండవలసిన అగత్యం దానిలో ఏం లేదే!

ప్రసా : చాలావుంది.

రామం : ఏమిటది?

ప్రసా : నేను ఒప్పుకోను కనుక—

రామం : దీనికి అభ్యంతరం ఏమిటి చెప్పండి... నేను విజయను పూర్తిగా అర్థంచేసుకున్నాను. ఆమె కూడా అంతే—

ప్రసా : ప్రేమించుకొని పెళ్ళిచేసుకుంటున్నా మనుకొనే యువతీయువకు లందరూ అదే సమాధానం చెబుతారు. కాని వాళ్ళ జీవితం తప్పులతో మొదలైకాని, మామూలు మార్గాన పడదు.

రామం : పోనీ, నన్నూ ఆ మార్గాన్నే నడవనివ్వండి.

ప్రసా : అది ముళ్లున్న మార్గం.... నాకు తెలిసివుండి కూడా నిన్నెలా పోనిస్తాను?

రామం : అంటే, మీరు ఈ పెళ్లికి ఒప్పుకోనంటారు!

ప్రసా : పెళ్ళంటే దబాయింపు కాదోయ్. నువ్వు ఇప్పుడీ పెళ్ళిచేసుకోడానికి నీకున్న అర్హత ఏమిటి? నువ్వు మగవాడివి, విజయ ఆడది కావడమేనా? కానీ సంపాదించడం చేత కాదు, పైగా ఇంటినుంచి వందలకు వందలు తీసుకువెళ్ళి, నాటకాల పేరుతో నాశనం చేస్తావ్! ఇదేనా నీ ఘనత?

రామం : ఇవ్వాళవుంది కాబట్టి ఖర్చు పెడుతున్నాం. రేపు లేకపోయినా ఇలాగే ఖర్చు పెట్టాలనుకున్నవాడు మూర్ఖుడై వుండాలి.

ప్రసా : వాడెవరైతేనేం? నువ్వు మాత్రం అది కాకుండా చూసుకో!

రామం : ఆభయం మీ కక్కర్లేదు. నన్ను నేను పోషించుకోగల స్తోమతు, పోషించుకోగల నన్న ధైర్యం నాకున్నయ్.

ప్రసా : నిన్నుగురించి నువ్వు అంతగా భ్రమపడకు. చాలామంది తమనుగురించి గొప్పగా వూహించుకొనే, తమ జీవితాన్ని నాశనం చేసుకుంటారు...సరే! అవన్నీ ఎందుకు? నువ్వు విజయనే పెళ్ళిచేసుకోవడానికి స్థిరపరుచుకున్నానంటావ్! (రామం తల తిప్పుతాడు.) నాకు యిష్టంలేకపోయినా?

రామం : ఎందువల్ల చెప్పండి....విజయ చిన్నప్పటి నుంచీ ఇక్కడె పెరిగింది. నాతోపాటు చదివింది. ఆమాటకువస్తే నాకంటె ఎక్కువ చదివింది. ... చదువూ, చక్కదనం; సంస్కారం, — ఇన్నీవున్న మనిషిలో లోటేమిటో నాకర్థం కావడంలేదు.

ప్రసా : నీకు తెలిసింది అంతవరకే—కాని అంతకు మించినవి అనేకం యీ వివాహానికి అభ్యంతరాలుకాగల వని నీకు తెలియదు. .. ఇన్నీ ఆలోచించావుకాని, మీ యిద్దరిమధ్య నున్న అంతస్థులసంగతి ఆలోచించావా?

రామం : అదే అభ్యంతరమైతే,దాన్ని నేను నిరభ్యంతరంగా అధిగమిస్తాను.

ప్రసా : అంటే, అది స్వల్పమైన అభ్యంతరంగా కనిపిస్తున్నదన్నమాట!

రామం : అసలు నాకది అభ్యంతరంగానే కనిపించటం లేదు. ఊహలతో గోడలను నిర్మించుకొని అవతల వున్న మనిషి ఇవతల లేడన్న నెపంతో ఆమనిషి మనిషి కాదనడం వివేకం కాదు

ప్రసా : తరతరాలనుంచి శ్రమించి నిర్మించిన ఈ అంతస్థులను ఇవ్వాళ నీ ఒక్కమాటవల్ల నాశనం చెయ్యదలచుకుంటే, నువ్వు బికారిగా మాత్రమే మిగుల్తావు.

రామం : నాకాభయం ఎప్పుడూ లేదు.

ప్రసా : అదుగో! ప్రతిదానికీ అడ్డుచెబుతావు, నీ సంగతే నీదికాని ఎదుటివాళ్ల సంగతి పట్టదేం! ఆ జడ్జీగారు వాళ్ల అమ్మాయిని చేసుకోమంటున్నారు. మన కంతకన్న మంచిసంబంధాలు రావు. ... నామాటకాదనక, ఆ అమ్మాయినిచేసుకో! —

రామం : ఆ అమ్మాయినా? ఆ నడక, ఆమాట—దేవలోకంనుంచి దిగివచ్చిన అప్సరస ఏమీ కాదావిడ—

ప్రసా : కాకపోవచ్చు. కాని అయిదంతస్థుల మేడ మీదనుంచి దిగివస్తుంది.

రామం : అంతస్థులు నిర్మించడం, వాటినిగురించి గొప్పలు చెప్పుకోవడమే పనిగా పెట్టుకున్నవాళ్లు నాతో ప్రయాణం చెయ్యలేరు. నేల మీద, నాతోపాటు నడువగలిగిన వాళ్లెవరైనా నాకు చాలు.

ప్రసా : ఈ ఇంట్లో ఇంత చనువు ఇచ్చాను. కన్న కూతురుగా చూసుకున్నందుకు ఆ అమ్మాయి చేసేపని యిదేనా?

రామం : ఇందులో ఆ అమ్మాయి చేసిం దేముంది నాన్నా? అయినా ఆమెను మనిషిని చేద్దామని తీసుకువచ్చి, తీరా మనిషిగా తయారైనతర్వాత ఆనందించవలసిందిపోయి, కోపగిస్తారా?

ప్రసా : ఇంకా నయం. నేను కాబట్టి ఇంత జరిగిన తర్వాత మాట్లాడకుండా వూరుకుంటున్నాను. అయినా ఇన్నాళ్లు పెంచి పెద్ద చేసినతండ్రికి నువ్విచ్చే ప్రతిఫలం ఇదన్న మాట!

రామం : అందుకు నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. కాని నేను ఆమెకు వాగ్దానంచేశాను.

ప్రసా : ఈ వాగ్దానాల కేముంది? మనం చేశామను కుంటె వుంటాయ్, లేకపోతే లేదు.

రామం : అలా అనకండినాన్నా! నేను మాట యిచ్చి మాత్రం మనసు మార్చుకోలేను.

ప్రసా : నేనుపట్టిన కుందేటికి మూడేకాళ్ళని పోట్లాడ్డం మూర్ఖుడు చెయ్యవలసినపని. నేనూ జడ్జీగారికి వాగ్దానం చేశాను. కొడుకుగా నా వాగ్దానాన్నే బలపరుస్తావో, ప్రియుడుగా ఆమె వాగ్దానాన్నే మన్నిస్తావో ఆలోచించుకో—

రామం : నేను వెళ్లి జడ్జీగారిని క్షమాపణ వేడుకుంటాను...కుసుమను ఒప్పిస్తాను.

ప్రసా : నాకోసం ఒకళ్లదగ్గరకు వెళ్లి వేడుకోవలసిన అగత్యంలేదు. నీ వాగ్దానంకోసం మంకుపట్టు పట్టి నువ్వు విడవకపోతే, నా వాగ్దానం చెల్లించుకోవడానికి నేనూ అంతే పట్టుపట్టవలసి వస్తుంది.

రామం : అంటే, నేను విజయను పెళ్లిచేసుకోకుండా చేస్తానంటారు. అంతేనా?

ప్రసా : నా మాటలకు లేని అర్థాలను ఆపాదించకు. వాటికి ఎంతవరకు అర్థంవుందో అంతవరకే తీసుకో!—అయినా కుసుమకు ఏం తక్కువ? చదువు లేదా? సంస్కారం లేదా? అందం లేదా? అంతస్థులేదా?

రామం : అవన్నీ విజయలోమాత్రం లేవా? మీరు పై అంతస్థున వుంటూ, 'ఆ ఎత్తున వున్నవాళ్లను మాత్రమే చూస్తాను, క్రిందవున్నవాళ్లను చూడను' అంటే మీ అభిప్రాయాలతో నేను ఏకీభవించలేను.

ప్రసా : అంటే, కుసుమను పెళ్లిచేసుకోవడం నీ కిష్టం లేదన్నమాట!

రామం : అవును.

ప్రసా : సరే! నా ఆస్థిలో ఒక్క చిల్లిగవ్వ కూడా నీకు దక్కడం నాకు యిష్టంలేదు...నీ యిష్టం వచ్చినట్లు వూరేగు. (వెళ్ళిపోతాడు.)

[రామం బాధతో కుర్చీలో కూర్చుంటాడు. ఒక నిమిషం ఆలోచించి, ఏదో నిశ్చయానికి వచ్చినట్లు తలపంకించి, విజయను పిలవడానికి లేస్తాడు—ఇంతలో కుసుమ వస్తుంది. మనసులో ముందుకు పోదామన్న ఊహ తెరుసుకు వస్తు వుంటుంది ]

కుసుమ హల్లో, రామం! గుడ్ మార్నింగ్.

రామం (డీలాపడిపోతాడు నీరసంగా) మార్నింగ్.. కులాసానా?

కుసుమ : ఏదో—వున్నాం...నువ్వు మద్రాసునుంచి వచ్చిన తర్వాత ప్రతిపూట నీకోసం ఎదురు చూడడమే! మొన్న సాయంకాలం వస్తానని డాడీతో చెప్పావట. ఎంత 'డిజపాయింట్' చేశావ్? నిన్ను నేను కాబట్టి క్షమించాను. మరొకరైతేనా—?

రామం థాంక్స్...ఆమాత్రం దయ మామీద వుంది. అంతే చాలు!

కుసుమ అది దయ అనకు రామం...నాకది చాలా సరదా!

రామం ఏమిటది? నేను తప్పులు చెయ్యడమూ!

కుసుమ అవును. మగవాళ్లు తప్పులుచేసి తప్పించుకోవడానికిచూస్తే ఎంత తమాషాగా వుంటారని! వాళ్లంటే నాకు సరదా.

రామం ఇదేదో కొత్తరకం సరదా...సరే! నాన్నగారు కులాసానా?

# విషాదాంతం

కుసుమ : ఆఁ! నువ్వువస్తావని ప్రతిపూటా ఎదురు చూస్తున్నారు.

రామం : అగెగె! ఎంతమాట! కాకితో కబురంపితే, రెక్కలు కట్టుకొని వాలేవాణ్ణి—

కుసుమ : అలా అనడం బాగులేదు రామం. నీకున్న గౌరవం,డిగ్నిటీనీది. డాడీకివుంది డాడీది—

రామం : నువ్వుచెప్పే డిగ్నిటి మనుషుల్లో వుందికాని, మనసుల్లో లేదు. మాటల్లోవుంది కాని చేతల్లో లేదు. అటువంటి డిగ్నిటీ పేరు చెబితే నే నాకు జ్వరం వస్తుంది.

కుసుమ వస్తే, నేను నయంచేస్తాను.

రామం నీవంటివాళ్లు డాక్టర్లు కాలేరు. కుసుమా! అయినా, వస్తే నయంచేద్దా మనుకో నేకన్న అసలు రాకుండా చెయ్యడం మంచిది కాదూ?

కుసుమ : ఏంచెయ్యా లంటావ్?

రామం : అదుగో, ఆ నీతివచనాలు పలకకపోవడమే!

కుసుమ : ఆల్ రైట్ ... నువ్వేంచెయ్య మంటే అదే చేస్తాను. (ముళ్లమీదవున్నట్లుగా వుంటాడు) థాంక్స్ ... అన్నట్లు, నువ్వు పనివుండి వచ్చినట్లున్నావ్. విజయ యింట్లో లేదా?

కుసుమ : ఏమో—కాని, ఇవ్వాళ నీకో గొప్పసంగతి చెబుతాను.

రామం : (నీరసంగా) ఊఁ...

కుసుమ : నువ్వు విని ఎంతఆశ్చర్యపడతావో తెలుసా?

రామం : నువ్వు చెప్పిన ఏ విషయం ఆశ్చర్యంగా లేదు?...చెప్పు.

కుసుమ నేను ఇందాక ఇక్కడకు రాగా నే సూర్యం అడిగాడు—నువ్వు రామంప్రక్కన నాటకంలో వేస్తావా అని ... నేను వెంటనే ఒప్పేసుకున్నాను ... నేను వెయ్యగలనా?

రామం ఆఁ!

కుసుమ నిజంగా!

రామం ఏమి టది?

కుసుమ అదే! నేను బాగా వెయ్యగలనా?

రామం : ఏమిటి?

కుసుమ : శ్రీరామచంద్రా! ఇందాకటినుంచీ చెప్పిందంతా పోయింది నీ ధ్యాస యిక్కడేమీ వున్నట్లు లేదు—నేను నీతోపాటు నాటకంలో వేద్దాం అనుకుంటున్నాను... వెయ్యగలనా?

రామం : అదా!...ఏమో, నేనేం చెప్పగలను? జీవిత నాటకాల్లో బాగా నటించగలవారు స్టేజి మీద అంతగా రాణించలే రని అంటారు.

కుసుమ : నువ్వు డైరెక్టు చేసినా—

రామం : దర్శకుడి దేముంది? మెరుగులు దిద్దగలడు కాని సృష్టించలేడుకదా! ఆర్టిస్టు పుట్టాలి కాని, తయారుకాలే డన్నారు—

కుసుమ : అయినా నేను వేస్తాను రాం. నాకు చాలా సరదాగా వుంది.

రామం : మనిషి ప్రాథమిక హక్కులను నిలబెట్టుకొనే ఆస్కారం లేదు. ఇక సరదాలు తీర్చుకుంటానంటావ్!

కుసుమ : నీకు యిష్టం లేదనుకుంటాను- అయినా చెప్పు—నువ్వు వద్దంటే మానేస్తాను.

రామం వద్దని చెప్పడానికి నే నెవర్ని కుసుమా! నీ యిష్టం—

కుసుమ థాంక్స్.

రామం సరే!.. నేను కొంచెంసేపు రాసుకుంటాను.

కుసుమ మేం చూడకూడదు కాబోలు! ప్రేమ లేఖలా ఏం?

రామం కాకూడదా?

కుసుమ అబ్బే తమాషా కడిగాను—సరే, రాసుకో- ఇంట్లోకి వెడతాను.

రామం గుడ్ బై—

కుసుమ అప్పుడే గుడ్ బై కొట్టకండి సార్...వెళ్లేటప్పుడు మీ దర్శనం చేసుకోకుండా వెడతానా?

[వయ్యారంగా వెళ్లిపోతుంది. రామం దీర్ఘమైన నిశ్వాసం వదిలి చుట్టూ చూస్తాడు. మధ్య గదిలోనుంచి విజయ వస్తుంది.]

రామం : (సంతోషంతో, దగ్గరగావచ్చి) విజ్జీ! ఇప్పుడా రావడం! (అవు నని తల వూపు

తుంది.) గంటనేసట్నుంచీ నీకోసం వెతుకుతున్నాను. ఇంతలో పానకంలో పుడకలా ఆ కుసుమాదేవిగారు దాపురించింది.

విజయ : ఆవిడ నేమీ అనకండి ... ఎంతైనా మీకు కాబోయే యిల్లాలు!

రామం : ఇల్లాలా! భేష్!...విజ్జీ! నువ్వు రామాన్ని అర్థం చేసుకున్నది అంతవరకే నన్నమాట! నేను నా జీవితాన్ని ఎంత నిర్లక్ష్యంగా చూసుకున్నా, మరొకళ్ళ కిచ్చినమాటను మాత్రం నిర్లక్ష్యంగా చూడలేను.

విజయ : అలా అని, పరిస్థితుల నెంతకాలం ఎదిరించగలరు, చెప్పండి.

రామం : అవి స్వాధీన మయేటంతవరకు—మధ్యలో నే జారిపోయేటంత బలహీనుణ్ని కాదు.

విజయ : పరిస్థితు లంటే ఏమనుకుంటున్నారు? తల్లిదండ్రుల్ని, ఆస్తిపాస్తుల్నీ — అన్నింటినీ వదిలాలి—వద్దు. అంతదూరం రానివ్వ

రామం : ఏమిటి విజ్జీ నువ్వంటున్నది? అర్థం లేకుండా వాళ్లు అడ్డుపుల్లలు వేస్తుంటే, మన జీవితాల్ని నాశనం చేసుకుందామంటావ్! ... విజ్జీ! నిన్ను వదిలి నేను వుండగలనా, చెప్పు.

విజయ : పోనివ్వండి. అనామకురాలిని ... నా దేముంది?...నాకోసం మీ రింత బాధ పడుతున్నారు!—

రామం : అసలే నాకు మన సేమీ బాగు లేదు...నన్ను ఇంకా బాధ పెట్టదలుచుకుంటే అవన్నీ చెప్పు—

విజయ : క్షమించండి—ఇప్పుడేం చెయ్యగలం?

రామం : ఇంకా ప్రశ్నలదగ్గరేవుంటే ఎలా? నువ్వు సిద్ధంగా వుండు. మరోగంటలో ఇక్కడినుంచి మన ప్రయాణం—

విజయ : ఎక్కడికి?

రామం : ముందు మనవూరు...ఆ తరువాత ఎక్కడో ఒకచోట వుద్యోగం చూసుకోవడం—

విజయ : అంత త్యాగం చేస్తున్నారు...నాకోసం—

రామం : అదుగో! నీకోసమనే ఎందు కనుకోవాలి? నాకోసం మాత్రం కాదా? నువ్వు లేకుండా నేనూ లేను. ఇప్పటికే ఈ నావ, దారీ డొంకా లేకుండా అడ్డదిడ్డంగా నడుస్తోంది. నువ్వు చుక్కాని పట్టకపోతే అది వెళ్ళి ఏ పర్వతానికో కొట్టుకోవడం, ఏ ముక్కకాముక్క విరిగిపోవడం తప్పదు.

విజయ : (దుఃఖాన్ని ఆపుకోలేక తన చేతులతో ముఖాన్ని దాచుకుంటుంది) రామం! (రామం ఓదార్పుగా ఆమె బుజంమీద చెయ్యి వేస్తాడు.)

రామం : భయపడకు విజయా! నేను ఎప్పుడూ నీ వాణ్ణే!

[ఇంతలో ప్రసాదరావుగారు వస్తాడు.]

ప్రసా : నే నెప్పుడూ రాకూడని సమయాల్లో నే వస్తున్నాను. క్షమించండి .. విజయా! నీతో మాట్లాడాలి. (ఎవ్వరూ మాట్లాడరు.) రామం! నేను విజయతో మాట్లాడాలి

రామం : నేనూ వుంటాను.

ప్రసా : విజయతో నే మాట్లాడాలంటే నువ్వూ వుండాలన్న అర్థం రాదు.

[తండ్రివంక తీక్ష్ణంగా చూసి రామం వెళ్లిపోతాడు.]

ప్రసా : కూర్చో. (విజయ కూర్చోదు.) కూర్చోవమ్మా, ఫరవా లేదు. (కూర్చుంటుంది.) పుత్రభిక్షకోసం నీదగ్గరకు వచ్చాను.

విజయ : (బాధపడి) బాబుగారూ!

ప్రసా : అవునమ్మా! నిన్ను చిన్నప్పటినుంచీ కూతురులా పెంచాను. ఆ మాత్రం అడిగే హక్కు నాకు వున్నది కదూ! (మాట్లాడదు.) నాకు కూతురే వుంటే నామాట కాదనదు. నువ్వూ నా కూతురికంటె ఎక్కువైనదానివి ... ఏమంటావ్?

విజయ : నన్నేం చెయ్యమంటారు?

ప్రసా : అదుగో! నువ్వు అంత బాధతో అడిగితే నాకు బావుండదు. చూడమ్మా! నా ఆశలన్నీ వాడిమీద వున్నయ్. వాడు ఎంత ఎదురుతిరిగినా, చివరకైనా నామాట కాదనడని నా నమ్మకం. ఆ ఆశతోనే నేను బ్రతుకుతున్నాను. ఇప్పుడు నీవల్ల వాడి

...త్తుకు అణుమాత్రం అంతరాయం వచ్చినా నువ్వు సహించగలవా?...నీ కది సంతోషదాయకమా! (మాట్లాడదు.)...... నేను జడ్జీగారికి మాట యిచ్చాను...ఎందుకిచ్చావని రామం అడిగాడు. అదీ నిజమే! ...కాని నిన్ను ఈ యింటికి తీసుకువచ్చేటప్పుడు కూతురుగా తెచ్చుకున్నాను కాని, కోడలుగా తీసుకురాలేదు. అలాగే జరిగి వుంటే, ఇప్పుడు ఎవ్వరికీ మాట ఇవ్వవలసిన అవసరం వుండేదికాదు—

విజయ : ఇప్పుడు మాత్రం—

ప్రసా : ఆమాట నువ్వు అనవలసింది కాదమ్మా! మాటకంటె మనిషే ఎక్కువని నాకు తెలుసు. ఆమాటకు వస్తే, కుసుమకంటె నువ్వే నాకు ఎన్నోరెట్లు ఎక్కువ ఆమాత్రం నన్ను అర్థం చేసుకోలేవా?

విజయ : అదికాదు బాబూ!...ఆయన మరీ త్వరపడుతున్నారు.

ప్రసా : ఏమంటాడు? (విజయ జవాబు చెప్పదు) చెప్పమ్మా! నాకు తెలియకూడదా?

విజయ : మరోగంటలో ఇక్కడినుంచి వెళ్ళిపోవాలన్నారు.

ప్రసా : నాకు తెలుసునమ్మా వాడిపంతం. అది నెగ్గే వరకూ వాడికి నిద్రపట్టదు. .... కాని ఇది నావిషయం కాదమ్మా! కేవలం వాడికి సంబంధించినది. వాడి అభ్యుదయాన్ని కాంక్షిస్తే, నేను చెప్పినట్లు చెయ్యలేకపోతే, వాడు జీవితంలో ఎదుర్కొనే ప్రతి ఆటంకమూ నువ్వు కల్పించినదే నని జ్ఞాపకం వుంచుకో—

విజయ : నన్ను పెళ్లిచేసుకోవడమే వారి జీవితానికి ఆటంక మంటారా?

ప్రసా : ఆలోచించమ్మా! కుసుమను పెళ్లి చేసుకోవడంవల్ల వాడికి సంఘంలో పెరిగే అంతస్థు, దానివల్ల వాడికి జీవితంలో కలిగే లాభం—

విజయ : (గాద్గదికంగా) బాబూ! నేను ఆయనను వదిలి ఒక్కక్షణం వుండలేను.

ప్రసా : (తన్ను తాను సంబాళించుకొని) నాకు మాత్రం తెలియదా అమ్మా! వాడిపరిస్థితి కూడా అలాగే వుంది. కాని నేనేం చెయ్యగలనో చెప్పు...వాడి బాగుకు పరిస్థితులనైతే కల్పించగలను కాని, ఆటంకాలను నెట్టుకొని ముందుకు రాలేనుకదా! జడ్జీగారికి నేనిచ్చినమాటంటావ్! మాటతప్పటంవల్ల అవమానం ఏదైనా వస్తే నాకు!— కాని వాడికేమీ లేదు. ఇది ఒక్కటే అక్కడు కాదు. .ఈ పెళ్లివల్ల వాడు అడుగడుగునా పొందవలసిన అవమానాలు, ఎదుర్కోవలసిన పరిస్థితులు తక్కువగామాత్రం వుండవు. వీటన్నింటినీ ఎదుర్కోగల సాహసం, సహించగల మనోబలం వాడికి వున్నయ్యా?

విజయ : క్షమించండి బాబూ!... నేను లేకపోతే ఆయనపడే బాధ నాకు తెలుసు. తనలో తాను పొందగల బాధకన్న ఇతరులు పెట్టగలబాధ లెక్కువంటారా?

ప్రసా : నీకర్థం అయ్యేటట్లుగా చెప్పలేకపోతున్నాననుకుంటాను. ... వాడు కళాజీవి ... వాడిలోవున్న కళ ఉజ్జ్వలంగా ప్రకాశించాలంటే ప్రేమ కావాలి ... వాడిని నీకంటె ఎవ్వరూ ఎక్కువగా ప్రేమించలేరు—నాకు తెలుసు—ఆ ప్రేమ లేనందువల్ల వాడికి మానసికమైన దౌర్బల్యం రావచ్చు. కాని అది పరిస్థితుల నెదిరించలేనిదై, ప్రమాదాలను ఆదుకోలేనప్పుడు వాడి జీవితం నిష్ప్రయోజనకరంగా తయారు కావడానికి హామీ ఏమిటి?

విజయ : బాబూ! ఆయనను విడిచివుండడం నాకు చేతకాదు. ఆయనా అంతే! నేను లేకపోవడంవల్ల ఆయన ఏ కొంచెం బాధపడ్డా నేను భరించలేను. నా మాట వినండి బాబూ!... నేను చిన్నప్పటినుంచీ మీదగ్గర పెరిగాను. ఇంట్లో అందరికన్న నేనంటే అపేక్ష చూపించారు మీరు. ఆ చనువుతో అడుగుతున్నాను ... మమ్మల్ని విడదీయకండి... నేను ఆ తరువాత ఒక్కక్షణం జీవించలేను.

ప్రసా : (ఆమె ప్రార్థనకు విచలితుడైనా, ఆయన మనో నిశ్చయమే గెలుస్తుంది.) ఉద్వేగం కలిగినప్పుడు మనుషులు మామూలుగా ఆలోచించలేరు. ఇంత చెప్పినా నామాట వినక వాడి జీవితానికి నువ్వే గుదిబండవు కాదలచుకుంటే, నా కేమీ అభ్యంతరంలేదు... అయినా మీమీద నా కేమీ కోపంలేదు. మీ వయసులో వున్న ప్రతివాళ్లు చేసేదీ అదే? ఇహ నే నంటావా?....వాడు నాకు పెద్దకొడుకు. వాడిమీద నేను ఆశలు పెట్టుకున్నాను...ఇప్పుడు!—వాడి జీవితమంతా మీ రిద్దరూ వేస్తున్న తప్పటడుగులవల్ల నాశనం అయిందని జీవితాంతం కుమిలిపోతాను...అందరికన్నా మీ యిద్దరినే ఎక్కువగా ప్రేమించటంవల్ల, మీరు నాకు ప్రత్యామ్నాయంగా యిచ్చిన ఫలిత మనుకుంటాను...వస్తానమ్మా—

విజయ : (పొంగివస్తున్న దుఃఖాన్ని అతి ప్రయత్నం మీద ఆపుకొని) బాబూ! (వెడుతున్న ప్రసాదరావుగారు వెనుకకు తిరుగుతాడు.) మీ యిష్టంవచ్చినట్లు కానివ్వండి. నాకు అభ్యంతరంలేదు.

ప్రసా : చూడమ్మా! ఇది నాకోసం నువ్వు చేస్తున్న త్యాగం కాకూడదు. నేను చెప్పింది వాడికోసం. ఇందులో నా స్వార్థం ఏమీలేదు. నువ్వు పొరపాటుగా తొందరపాటున ఏం చెప్పినా అది మీ బాధకు యింకా ఎక్కువ కారణం కావచ్చు.

విజయ : లేదు బాబూ! బాగా ఆలోచించే చెబుతున్నాను. నాకు కావలసిందీ ఆయన సుఖమే కదా! నన్ను పెళ్ళిచేసుకోవడంవల్ల ఆయనకు ఏ ఒక్క బాధ కలిగినా, నేను భరించలేను.

ప్రసా : బాగా ఆలోచించమ్మా! నేను చెప్పానని నీ వుద్దేశ్యాలను మార్చుకోకు.

విజయ : అక్కర్లేదు బాబూ. అదే నా నిశ్చయం... ఆయన నన్ను పెళ్లిచేసుకోరు...ఇహ నే నంటారా? నేను బ్రతికి చెయ్యవలసింది ఏమీలేదు. ఉన్న సర్వస్వం త్యాగం చేసిన మనిషి ఆశించే దేముంటుంది?

ప్రసా : అంత నిస్పృహ పడకూడదమ్మా! ఎందరు నిన్ను వదిలినా, ఎందరు నన్ను వదిలినా, నువ్వు నాతో వుండక తప్పదు.

విజయ : ఆపనిమాత్రం నన్ను చెయ్యమనకండి బాబూ! ఇక్కడ ప్రతివస్తువూ వారిని జ్ఞాపకం చేసేదే వాటిని చూస్తూ, నేను బ్రతకటం కల్ల—మరొకచోట నంటారా, ప్రాణాలు పోవడం కష్టమైన పనికాదు. ఇక్కడ క్రుంగి కృశించిపోతాను; మరొకచోట చావటం తేలిక—

ప్రసా : అలా అనడంవల్ల నాకూ బాధే కలగాలనుకుంటే నువ్వే గెలిచావు.. నేనూ మనిషి నే! ప్రక్క మనిషిమీద నేను సానుభూతి చూపించలేనివాడి నని ఎందు కనుకోవాలో నాకు తెలియదు.

విజయ : పొరపాటు బాబుగారూ! ఆవేశంలో ఏదో అన్నాను... మిమ్మల్ని నాకంటె బాగా ఎవ్వరూ అర్థం చేసుకోలేరు.

ప్రసా : నాకు తెలుసునమ్మా! ఇప్పుడు నా కోరికల్లా నువ్వు బాధపడకుండా వుండడమే!... నువ్వు ఏమాత్రం బాధపడ్డా, నేను భరించలేను.

విజయ : (విషాదకరమైన నవ్వుతో) బాధ ఎందుకు బాబూ! నా కేమీ బాధలేదు.

ప్రసా : (ఒక్క క్షణం ఆగి) వస్తానమ్మా! నీ ప్రేమనూ, నువ్వు నాకు చూపిన గౌరవాన్నీ ఎన్నడూ మరిచిపోలేను. (వెళ్ళి పోతాడు.)

[విజయ పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడానికి అనవసరమైన ప్రయత్నం చేస్తుంది. చివరకు ఆ ప్రయత్నంవల్లనే అది కట్లు తెగుతుంది.

ఓ క్షణం తరువాత కుసుమ వస్తుంది. ముఖం మీద ఏదో ఒక క్రొత్తరకం సిగ్గు, ఏదో సాహసకార్యం చెయ్యడానికి ప్రయత్నించడంవల్ల మాటిమాటికి క్రింది పెదవిని

పళ్ళతో నొక్కిపట్టడం వంటివి చేస్తూ వుంటుంది.]

కుసుమ : హల్లో విజయా! ఇక్కడా వున్నావ్! నీకోసం ఎంతసేపటినుంచీ వెదుకుతున్నానో తెలుసా? (విజయ ప్రక్కకు తిరిగి కళ్లు తుడుచుకుంటుంది.) ఏమిటది విజయా?

విజయ : ఏమీ లేదు.

కుసుమ : నా దగ్గర దాయకు విజయా! చెప్పవూ?

విజయ : లాభం లేదు కుసుం...నా బాధలు మరొకళ్ళతో చెప్పి, వాళ్ళనూ పంచుకోమనడం న్యాయం కాదు.

కుసుమ : ఇంతేనా నన్నర్థం చేసుకున్నది? ఎవరు ఏం చేశారు నిన్ను? ఎందుకలా వున్నావ్? చెప్పు విజయా, నీకోసం ఏమైనా చేస్తాను నేను.

విజయ థాంక్స్...వద్దు కుసుం.. ఆ బాధలు నన్నే పడనీ—

[త్వరగా వెళ్లిపోతుంది. ఇంట్లోనుంచి త్వరగా రామం వస్తాడు. కుసుమ నివ్వెర పోయి విజయ వెళ్లిన వైపుగానే చూస్తూ వుంటుంది.]

రామం : విజ్జీ!—

కుసుమ : రామం!—

రామం : ఓ! నువ్వా కుసుమా! నేను విజయ అనుకున్నాను.

కుసుమ : ఎందుకో కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నది. తీరా నేను వచ్చేసరికి కారణం చెప్పకుండానే వెళ్ళిపోయింది.

రామం : అలాగా వస్తాను...

కుసుమ : ఎక్కడకు సార్......ఈ ఇంట్లో తమరు మాట్లాడవలసింది ఒక్క విజయతోనేనా?

రామం : కాదు కుసుం. పనివుంది...

కుసుమ : నేనూ పనివుండే వచ్చానుసార్....(రామం నిస్పృహతో కూర్చుండిపోతాడు.) కోపం వచ్చిందా?

రామం ప్చ!

కుసుమ : (దగ్గరకువచ్చి) ఇవ్వాళ నీకు ఎన్నివిషయాలు చెబుదామని వచ్చాననుకున్నావ్?

రామం : చెప్పు—

కుసుమ అబ్బ...అంత తేలికగా చెబుతానా? నువ్వు చెప్పుకో—

రామం అంత మరీ చిన్నపిల్లవు కావు కుసుం. సంగతేమిటో చెప్పు..

కుసుమ : అట్లా అని తప్పించుకోవడానికి చూడకండి ....మీకు తెలుసు, చెప్పండి.

రామం (రామం, కసిగా) ఆ, ఏముంటుంది? మీ నాన్నగారు ఢిల్లీ ఆలిండియా రేడియోలో మాట్లాడారనో, మీ మామయ్య పారిస్ నుంచి బ్రహ్మాండమయిన చీరలు తెచ్చాడనో, ఇంకా—

కుసుమ పప్పులో కాలువేశారు సార్ ... అవ్వేమీ కాదు.

రామం కుసుమా! నాకు అవతల చాలా పనివుంది. చంపక చప్పున చెప్పు, అంతటి గొప్ప విషయం ఏమిటో?

కుసుమ : ఈ మగవాళ్ళందరూ యింతే! ఆడవాళ్లు ఎంత ఆప్యాయంగా దగ్గరకువచ్చినా ముఖం మాడ్చుకుంటూరు.

రామం : ఆడవాళ్లు మాత్రం తక్కువతిన్నారా? అయినప్పుడూ కానప్పుడూ కూడా మామీద స్వారీ చెయ్యడంలా ... మళ్ళీ ఒక్క మాటంటే మీ అబలా సమాజ మంతా కత్తి కట్టి మా ఇళ్ల మీదకు యుద్ధానికివస్తుందే!... సరే! నేను బుద్ధిమంతుడిలా కూర్చుంటాను. త్వరగా చెప్పు...

కుసుమ : అట్లా అన్నారు, బావుంది...చెప్పనా? మా నాన్నగారు మీ నాన్నగారిదగ్గరకు వస్తున్నారు....

రామం : రానీ! దానిలో గొప్ప ఏముంది?

కుసుమ : తగ్గుమరి ఎందుకో తెలుసా? మా నాన్నగారు మీ నాన్నగారిదగ్గరకు వచ్చి "మీ అబ్బాయికి మా అమ్మాయిని ఇస్తాం.......చేసుకోండి." అంటారు—

రామం : (ప్రాణంలేని నవ్వుతో) అలాగా!

కుసుమ : ఏమంటావు రామం?

రామం (కుర్చీలోనుంచి లేచి) కుసుమా! ఈసంగతి నాకు మూచాయగా తెలియకపోలేదు. ఒక్క మాట చెబుతాను; నామీద కోపగించకు కుసుం.... నేను విజయను పెళ్ళి చేసుకోబోతున్నాను—

కుసుమ (నూతిలో గొంతుకలా) విజయనా!

రామం అవును కుసుం... నాన్నగారు ఒప్పుకోలేదు. అందువల్ల మరోగంటలో నే యిక్కడినుంచి వెళ్ళిపోతున్నాం. ఇప్పుడు నీకు ఆశ కలిగించి వెళ్ళడం నాకు సుతరామూ యిష్టం లేదు...నువ్వు నన్ను ప్రేమించావని నాకు తెలుసు. కాని నేనేం చెయ్యగలను, చెప్పు? ఎన్ని అడ్డంకులు వచ్చినా, నేను విజయను పెళ్ళి చేసుకోదలిచాను.

కుసుమ (తన చేతుల్లో ముఖాన్ని దాచుకొని) రామం!

రామం కుసుం! నువ్వు బాధపడతావని నాకు తెలుసు. కాని ఏం చెయ్యను?

కుసుమ : (తేరుకొని) పోనీ రామం! నువ్వేం చెయ్యగలవు?...ఇంతకూ నా అదృష్టం.. అయినా గాలిలో మేడలు కట్టబోయేముందు వాటికి పునాదులుంటేకాని పడకుండా వుండవన్న జ్ఞానం నాకు లేకపోయింది. ఇప్పుడనుకొని ఏం లాభం?...సరే! మీరైనా సుఖంగా వుండండి...నీకు ఏం అవసరం వచ్చినా నాకు చెప్పకుండా వుండవుకదూ! నేను ఎప్పుడూ నీ పక్షమే!

రామం (ఆమెకు తనమీద నున్న ప్రేమకు ఆశ్చర్యపడతాడు, చలిస్తాడు) కుసుం!

కుసుమ వస్తాను, రామం...

[మెల్లగా వెళ్ళిపోతుంది. ఒక క్షణంతర్వాత సూర్యం 'కుసుం, కుసుం' అని పిలుస్తూ వస్తాడు.]

సూ : కుసుమ ఏదిరా?

రామం : వెళ్లిపోయింది.

సూ : ఏం?

రామం : ఈ ఇంట్లో తనకు స్థానం లేదని—

సూ : ఈ నాటకం ఇంత ఎక్కువ కాలం జరగడం బాగాలేదురా. నాన్నను రానీ, ఎందుకు ఒప్పుకోడో చూసాను.

రామం : నాన్నను ఒప్పించడం బ్రహ్మతరంకాదు

సూ : మనం ఆయన తలలోనుంచి వెళ్లుకు వచ్చాంరా—చూస్తావుగా!

[ఇంతలో ప్రసాదరావుగారు కుసుమను పిలుస్తూ వస్తాడు.]

ప్రసా : కుసుమ ఏదిరా?

సూ : (రామంవైపు తిరిగి) ఏదిరా?

రామం : వెళ్ళిపోయింది.

ప్రసా : ఏం?

సూ : బహుశః తనకీ యింట్లో స్థానం లేదని తెలుసుకొని వుంటుంది.

ప్రసా : సూర్యం!—

సూ : ఈ నాటకాన్ని ఇంతసేపు సాగనివ్వడం ఏమీ బాగాలేదు.

ప్రసా : ఏమంటావ్?

సూ : నిజాన్ని గ్రహించి, నీతితో జవాబు చెప్పమంటాను.

ప్రసా : ఇందులో నా దేముంది? వాళ్ల యిష్టం—

సూ : వాళ్ల యిష్టాయిష్టాలతో సాగితే నాటకం ఎప్పుడో సుఖాంతం అయ్యేది. ఈ 'సస్పెన్సు' దేనికి?

ప్రసా : నీకీ గొడవలు తెలియవుగాని, నీ నాటకాలు ఏమిటో నువ్వు చూసుకో—

సూ : జీవితంలో నాటకాల తర్వాత కదా, స్టేజి మీద నాటకాలు!

ప్రసా : అయితే, ఈ నాటకంలో నీపాత్ర ఏమిటి?

సూ : అదే అర్థంకావడంలేదు..... నేనే కథానాయకుణ్ణయితే ఇంత రాద్ధాంతం వుండేదా? అన్నయ్య మెత్తటివాడు కాబట్టి మొదుతున్నారు.

ప్రసా : నీ కెందుకురా యివన్నీ? ఎవరి సంగతి వాళ్లు చూసుకోలేరా యేం?

సూ : తమసంగతి తాము చూచుకోక, ప్రక్కవాళ్ల సంగతుల్లో తలలు దూర్చేవాళ్లు వున్నారు కాబట్టే, నేను వచ్చాను.

ప్రసా  అంత అవసరం ఎవరికి?

సూ  నాన్నా! అంతస్థుల పేరు చెప్పి అన్నయ్యను బెదిరించటం, వాడి భవిష్యత్తు పేరుతో విజయను భయ పెట్టడం — ఇవన్నీ యేమిటి?

ప్రసా  నేను మంచి దనుకున్నది వాళ్లకు చెప్పాను. వాళ్లు దాన్ని పాటించకపోతే — వాళ్ళ ఖర్మ — పోతారు. నేనేం వద్దనలేదే!

సూ : వేస్నే బేసులు వేస్తుంటే, వాళ్లుమాత్రం ఎలా నెగ్గుతారులెండి.

ప్రస : నీ ధర్మపన్నాలు ఎవ్వరికీ అక్కరలేదు.

సూ : అక్కరలేనివాళ్లకోసం ధర్మపన్నాలు ఎవ్వరూ చెప్పరు నాన్నా! అయినా ఈ పెళ్ళి ఆగడానికి వీలులేదు...ఎలా జరగదో నేనూ చూస్తాను. (విజయ వస్తుంది.) చెప్పు విజయా! నీకు రామాన్ని పెళ్లిచేసుకోవడం యిష్టమా, కాదా? ఆమాట ఆయనముఖాన చెప్పు — సంవత్సరంనుంచీ మీ హృదయాలు కలుసుకోవడానికి నిరంతరం ఆరాటపడ్డవని చెప్పు.. మీ జీవితాలు కలుసుకున్న తర్వాత, ఎంతటి అవాంతరాలనైనా, చిరునవ్వులతో ఎదిరించగలమని చెప్పు. మీ ఆనందానికి అవధి లేదని, మీ సుఖానికి పరిధి లేదని చెప్పు — చెప్పు, విజయా! (విజయ మాట్లాడదు.)

ప్రసా : చెప్పడం చెప్ప మన్నంత తేలిక కాదోయ్!

సూ : హృదయంలో వున్నప్పుడు చెప్పడం, చెప్ప మనడంకన్న తేలిక —

[ఇంతలో రంగయ్య వస్తాడు.]

రంగయ్య : నమస్కారం బాబూ! ఏమి టిదంతా? నాటకంగాని వెయ్యడంలేదు కదా!

ప్రసా : అలాంటిదే రంగయ్యా! చూస్తూవుండు.

రామం  రంగయ్యా! నేను విజయను పెళ్లి చేసుకోబోతున్నాను.

రంగ  (ఆశ్చర్యంతో) ఏమిటి బాబూ!

సూ  అవును రంగయ్యా! నిజమే! అన్నయ్య విజయను పెళ్లిచేసుకోబోతున్నాడు.

రంగ  బావుంది బాబూ! గోపాలంకూడా సీతను చేసుకోడానికి ఒప్పుకున్నాడు. బాబూ! ఇదంతా మీ మాటలచలవే బాబూ! వాడు ఇంటికి వచ్చి, రాత్రంతా ఆలోచించి "బాబుగారు చాలా నిజం చెప్పారు నాన్నా!" అన్నారు "వారెప్పుడూ అలాగే చెబుతార్రా" అన్నాను. అంతే — చేసుకోవడానికి ఒప్పుకున్నాడు...బావుంది కదూ!

ప్రసా : కాని, నాకు వీళ్ల పెళ్ళి జరగడం ఏమీ యిష్టంలేదు రంగయ్యా!

రంగ : బాబూ!

ప్రసా : అవునయ్యా! ఈ పెళ్ళి జరగడం నాకేమీ యిష్టంలేదు.

సూ : ఎందుకు వుంటుంది రంగయ్యా! అంతస్థుల పేరు చెప్పి, అవకాశాలను అవరోధించడం రాజకీయ నాయకులకు తప్ప మరొకరికి చేత కాదు.

రంగ : అదేమిటి బాబూ! విజయ చిన్నప్పటినుంచీ మీదగ్గర పెరిగింది. దాన్ని నా పిల్ల అని ఎప్పుడూ అనుకోలేదు...అటువంటివాళ్లను మీరు విడదీస్తారా? అంతస్థుల భేదం పాటించకూడదని మొన్న నేగా మీరు చెప్పారు. మీరు చెప్పినట్లు చెయ్యకపోతే గోపాలానికి వుద్యోగం యివ్వమని బెదిరించారు. ఇదేనా మీరు చేస్తున్న న్యాయం?

సూ : ఏమిటి రంగయ్యా, పాతకాలంనాటి మాటలు మాట్లాడుతావ్! ఈ రోజుల్లో న్యాయం చెయ్యడం పాపం.

రంగ : బాబూ! నా మాట వినండి. వాళ్ళ ఆనందానికి అడ్డు రాకండి.

ప్రసా : అదేమిటయ్యా, రంగయ్యా! నీ పిచ్చి కాని, వాళ్లు సుఖపడతా మంటే నేను వద్దంటానా? నాకు మాత్రం వాళ్లు ఏమీ కారా?

సూ : అందుకేనా నాన్నా, ఈ పెళ్లి నాకిష్టం లేదంటున్నారు! అంతస్థులు జీవితాల వినాశనానికి కారణం అవుతాయని మీ నమ్మకమే అయితే, ఈ మాటే గోపాలానికి కూడా చెప్పివుండవలసింది.

విజయ  సూర్యం!...నాన్నగారి నేమీ అనకు...ఈ పెళ్ళి నాకే యిష్టం లేదు.

సూర్య / రామం / రంగ : విజయా!

విజయ : (తనను తాను నిగ్రహించుకుంటూ) అవును ....నాకు ఇష్టం లేదు.

సూ : విజయా! పరిస్థితులకు లొంగిపోయి నువ్వు ఇప్పుడేం చెప్పినా, జీవితాంతం విచారించవలసివస్తుంది.

రామం : విజయా! నువ్వేనా ఆ మాట అనగలిగింది!

సూ : భయపడకు విజయా! ధైర్యంగా నిజాన్ని చెప్పగలిగినవాళ్ళే, నిజంగా బ్రతకడానికి అర్హులు.

విజయ : (గాద్గదికంగా) నేను నిజమే చెబుతున్నాను సూర్యం...... నే నీ పెళ్ళి చేసుకోలేను.

రామం :

విజయ : ఆ సంగతి నన్ను అడగకు చినబాబూ! మీ సుఖంకోసం నేను ఈ పెళ్ళిని మానివేస్తున్నాను.

రామం : (మాటలు రాక) ఓ!

సూ : (పెదవి విరిచి) ఇక జీవితం నాటకం కాగలదని ఎవ రనగలరు?

విజయ : (ఒక క్షణం ఆగి).. వెళదాం, పద నాన్నా!

రంగ : వస్తాం బాబూ! నే నన్నవన్నీ మనసులో వుంచుకోకండి.

ప్రసా : విజయా! మరోసారి అడుగుతున్నాను. నువ్వు ఇక్కడ వుండలేవా?

విజయ : క్షమించండి బాబూ! నన్ను ఆమాట మాత్రం అడగకండి.

ప్రసా : కాని విజయా! నామీద కోపంతో మాత్రం వెళ్ళడంలేదని, మీ కష్టాలకు నేను కారణం కాదని చెప్పి వెళ్ళు. అదే నాకు వూరట నిస్తుంది.

విజయ : మీమీద కోప మెందుకు బాబూ?...మీ దయాఋణాన్ని ఎన్నడైనా తీర్చుకోగలమా?...వస్తాను. (రామానికి దగ్గరగా వస్తుంది.)

రామం : (దుఃఖాన్ని ఆపుకోలేక) విజయా!

విజయ : చినబాబూ! నన్ను మరచిపోవడానికి ప్రయత్నించండి. నేనేం చేసినా, మీకోసమేనని నమ్మండి...

సూర్యం! నీవైపు చూడడమే నాకు భయంగా వుంది. నన్ను క్షమిస్తావు కదూ!...పద, నాన్నా!

రంగ : వస్తాం, బాబూ! (రంగయ్య, విజయ, వాళ్ళ వెనుక ప్రసాదరావుగారు వెళతారు.)

సూ : కథంతా అడ్డం తిరిగింది కదా!

[రామం పిచ్చివాడిలా వుంటాడు. ఇంతలో చంద్రం వస్తాడు.]

చం : సారీ బ్రదర్! కొంచెం లేటయింది. ఏ సీను వేస్తున్నారు?

సూ సీ నేమిట్రా నీ తలకాయ! నాటకమే అయిపోతే!

చం అంటే—

సూ అంటే ఏమిటి? రిహార్సల్సు లేకుండానే నాటకం ఆడబడ్డది.

చం మరి కుసుమ యేది?

సూ వెళ్ళిపోయింది.

చం విజయ—?

సూ ఆమెనూ వెళ్ళకొట్టాం...

[ఈమాటలతో రామం పిచ్చివాడిలా నవ్వుతూ, 'అవును, వెళ్ళకొట్టాం' అంటూ వాకిట్లోకి వెళ్ళిపోతాడు.']

చం : మరి కథానాయిక ఎవ్వరా?

సూ : కథానాయిక ఎవరో వుంటే ఇంకా నాటకం విషాదాంతం ఎందుకు అవుతుందిరా?

చం : అసలేం జరిగింది?

సూ : ఏముంది? కొందరు మేడమీదనుంచి దిగి రానూ లేరు, మరెవ్వరినీ పైకి రానీవ్వనూ రానివ్వరు. వాళ్ళవల్ల అందరూ బాధపడతారు.

చం : మరి ఇది సుఖాంతం కావడం ఎప్పుడు?

సూ : ఈ అటంకాలను అధిగమించడానికి ధైర్యం వున్న యువతీయువకులు ముందుకు వచ్చిననాడు. ఇది దానంతట అదే సుఖాంతం అవుతుంది.

చం : అంతవరకూ ఎదురుచూద్దాం—

సూ : అవును మరి. కళోపాసకులు, భవిష్యత్తుమీద ఆశవున్నవాళ్ళు నాటకంలో పాత్రధారులైనప్పుడు, ఈనాటకం ఎప్పుడూ సుఖాంతమే! ఆరోజు తప్పక వస్తుంది. ...

చం : ప్రస్తుతం ఇది విషాదాంతమేకదా!

సూ : తప్పదుమరి!...తప్పకుండావిషాదాంతమే!!

[మొదట ఎలా వుంటారో ఇప్పుడూ అలాగే ఆలోచిస్తూ వుంటారు. ... ఇద్దరూ పెదవులు విరిచి 'అవును, విషాదాంతం' అనుకుంటారు.]

సూ : (హఠాత్తుగా లేచి (ప్రేక్షకులతో) చూశారుగా, ఇదీ నాటకం—ఇది విషాదాంతమని వేరే చెప్పక్కర్లేదుకదూ!—

చం : అవును...విషాదాంతం— [తెర]

# సెకండరీ విద్యావిధానము

శ్రీ వెంపటి పురుషోత్తము

విద్య జాతిరక్షణకు పెట్టనికోట అన్నాడు ఎడ్మండ్ బర్క్. (*Education is the chief defence of nations*). ఇది అన్ని కోటలవంటిది కాదు దీనికై ఎక్కువ ద్రవ్యం వెచ్చింప నక్కరలేదు కూడా.

ప్రభుత్వం అమలుపరచే యే ప్రణాళికలకైనా, కార్యక్రమాలకైనా, ద్రవ్యం అవసరమే కాని సామాన్యంగా ఏ దేశంలో చూచినా విద్య పేరు చెప్పగానే చాలినంత ద్రవ్యం లేదంటారు. కొంచెం విశాలదృష్టితో పరికించితే దీన్ని అధిగమించటానికి మార్గం లేకపోలేదు. సైనికదళాలను పెంచి, మారణాస్త్రాలను సృష్టించి, యుద్ధనౌకలను, విమానాలను నిర్మించి—ఈరీతిగా యుద్ధపరికరాలమీద వెచ్చించే ధనంలో దాదాపు సాబాలు కూడబెట్టుకోవచ్చు. ఆ ద్రవ్యాన్ని అంతా జాతీయవికాసానికి ముఖ్యంగా ఉపకరించే విద్యను దేశంలో అందరికీ అందుబాటులో ఉంచే ప్రణాళికల క్రింద వెచ్చిస్తే, కొలదికాలంలో దేశమంతా ఒక గొప్ప వైజ్ఞానికదళమై మన యావాకంఠని విధంగా జాతి సంపూర్ణ రక్షణకు, దేశ సంపదకు, సౌభాగ్యానికి, సభ్యతకు, ఔన్నత్యానికి, తద్వారా విశ్వశాంతికీ, విశ్వమంతా కలిసి యొకటే కుటుంబమనే భావం వర్ధిల్లడానికి తోడ్పడుతుంది. ఈ తీయని కల సఫలమైతే, అంతర్జాతీయ విజ్ఞానం సక్రమమార్గాల వెల్లివిరిస్తే—యుద్ధపు ఖర్చులకే తావుండక పోగలదేమో!

దేశకాలపరిస్థితుల ననుసరించి విద్య ప్రధాన లక్ష్యం మార్పు చెందుతుంది. ఏది యెట్లాఉన్నా, ఏ విద్య అయినా ఆకటి చిచ్చును శాంతింపచేసి కడుపునిండా అన్నము సమకూర్చగలిగితే, అది చక్కని విద్య. 'కోటివిద్యలు కూటికొఱకే.' ఇది ప్రస్తుత విద్యావిధానలక్ష్యం. ఇందులో తప్పేమీ లేదు. మానవుని మనుగడకు విద్య నుపయోగించుకోవచ్చు. కాని దాని ముఖ్యలక్ష్యం అంతమాత్రమేనా? అంతకంటె ఉన్నతాశయాలు సాధించుకోలేమా?

మానవుడు సంఘజీవి. సంఘాన్ని విడిచి ఒంటరిగా బ్రతుకలేడు. సంఘానికి మానవునికి త్రెంపరాని సంబంధ మున్నది. సంఘాభ్యున్నతిమీదనే మానవాభ్యున్నతి ఆధారపడి ఉంటుంది. మానవుడు సక్రమమార్గాల నడిచిననాడే సంఘం కళకళ లాడుతూ వర్ధిల్లుతుంది. ఎట్టి పరిస్థితులలోనైనా నేర్పుతో, న్యాయదృష్టితో, ఔదార్యంతో తన విధ్యుక్తధర్మాలను నిర్వహించుకొనే విధంగా మానవుని—అతని చిత్తవృత్తిని—తీర్చిదిద్దగల్గింది విద్య. ఈలక్ష్యం సిద్ధింపచేయలేని విద్య విద్య కాదు.

ఇట్టివిద్య దేశ మంతటా వ్యాప్తిచెందటానికి తగిన వాతావరణాన్ని మనం ప్రతికుటుంబంలో సృష్టించుకోగలగాలి. మానవునికి తల్లిదండ్రులు మొదటిగురువులు. వారు విద్యావంతులైతే కుటుంబములోనివారంతా ఆదర్శప్రాయమైన జీవితము గడుపగల్గుతారు. తరువాత సంఘ వాతావరణం కూడా విద్యావ్యాప్తికి అనుకూలంగా వుండాలి. వయోజనులలో కూడా విద్యావ్యాప్తి జరగాలి. ఇటు పెద్దలకు మాత్రమే కాక, పిల్లల లేతహృదయాల నాకర్షించే పుస్తకాలతో నిండి, పిల్లలకు గూడా ఉపయోగించే పుస్తకాలయాలు నెలకొల్పితే అవి కూడా విద్యావ్యాప్తికి చాలవఱకు తోడ్పడగలవు. ఇట్లా చక్కని వాతావరణం కుదిరిననాడే పాఠశాలలలోని విద్యావిధానం కూడా వర్ధిల్లుతుంది. లేనినాడు సాంఘిక, రాజకీయ కల్లోలాలు పాఠశాలల ఆవరణలో కూడా ప్రవేశించి అచటి శాంతిని, వాటి పవిత్రతను రూపుమాపి విద్యాలయాన్ని కల్గించుతాయి.

రెండుశతాబ్దాలపు మును పు పాశ్చాత్యదేశాలలో అమలులో ఉండే విద్యావిధానాన్ని పరిశీలించి చూస్తేనాటి విద్యాలయాలు దాదాపు కారాగృహాలే

అనవచ్చు. ఉపాధ్యాయుడంటే విద్యార్థికి భయంకర స్వప్నం. తరువాత శతాబ్దంలో ఈ విధానంలో కొంతమార్పు వచ్చింది. రూసో, పెస్టాలోజి అనే వారు నూతన మార్గాన్ని విద్యావిధానంలో కనిపెట్టారు. పిల్లలకు ఆటలంటే ప్రాణం లేచివస్తుంది. ఆటలాడే సమయంలో వారు పూర్తిగా మైమరచిపోతారు. వారిలో ఉండే పట్టుదల, ఉత్సాహం, త్యాగం, కష్టసహనం—మొదలైన గుణాలన్నీ ఆ సమయంలో వారిలో మూర్తీభవించుతాయి. అందుచేత ఆడుతూ పాడుతూనే కావలసిన విద్య వారికి గరపే సూత్రం అమలులోనికి తెచ్చారు. 1921 లో కొంతమంది పాశ్చాత్య విద్యావేత్తలు కలిసి ఒక నూతన విద్యాసంఘం, (*New Education Federation*) స్థాపించి విద్యావిధానంలో విద్యార్థికి ముఖ్యస్థానం యిచ్చి, విద్యార్థులే క్రమశిక్షణ పద్ధతులను అమలు జరిపేవిధంగా, వ్యక్తిగత, సాంఘిక బాధ్యతలను వారు గమనించేవిధంగా వాతావరణంలో మార్పు తీసుకురాగలిగారు.

ఒక శతాబ్దంపైగా వెనుకకు తిరిగిచూస్తే మన దేశంలో వీధి అరుగులమీద పాఠశాలలు, విద్యార్థులకు క్రమశిక్షణ గరిపే నిమిత్తం బెత్తాలు, బండకొయ్యలు, కోదండాలు ఉండేవని చెప్పుతూవుంటారు. ఒక శతాబ్దంక్రింద మన రాష్ట్రంలో బ్రిటిష్ పాలకులు 'ఆంగ్లో వర్నాక్యులర్' పాఠశాలలు నెలకొల్పారు. తమ రాజ్యాంగవిధానం సుస్థిరంగా వుండే రీతిని విద్యా ప్రణాళికలను ప్రవేశపెట్టారు. నాటినుండీ ఆంగ్ల భాషాబోధన ప్రారంభమయింది. క్రమంగా అదే 'మెట్రిక్యులేషన్' విధానంగా రూపొందింది. దాని ప్రకారం అందులో బోధింపబడే అన్ని పాఠశాలల్లోనూ నిర్ణీతములైన మార్కులు వచ్చి విద్యార్థులు పరీక్షలలో గెలుపొందాలి. అట్లు ఉత్తీర్ణులైన వారికే వుద్యోగాలిచ్చారు. అనగా ఆ పాఠశాలలు ఆ ప్రభుత్వానికి అవసరమైన, అట్టి దృక్పథంగల గుమాస్తాలను, చిన్న చిన్న ప్రభుత్వోద్యోగులనూ తయారుచేయటానికి చాలవరకు ఉపయోగించినారు. ఉదరపోషణకు కొంతవరకు ఆ విద్య వుపయోగించినట్లు కనబడటంచేత అది కొంతవరకు ప్రజాదరణ పొందింది కూడా. ఆంగ్ల భాష రాజభాషకాబట్టి దానిముందు, మన దేశభాషలన్నీ తలలు వంచవలసివచ్చింది. అంతేకాదు. మన సంస్కృతి, సంప్రదాయాలు కూడా విదేశీయ సంస్కృతి, సంప్రదాయాలతో చేతులు కలిపి క్రొత్తరూపాన్ని దాల్చాయి. ఈ విధానంలో విద్యార్థుల అభిరుచులతోనూ, యోగ్యతలతోనూ నిమిత్తం లేదు. నిర్ణీత పాఠ్యప్రణాళిక ననుసరించి మార్కులు సంపాదించుకొని పరీక్షలో విజయం సాధింపగలిగియుండుటా, మౌనంగా ఈ విధానాన్ని శిరసావహించి ఈ దారిన నడమటా ఇవే విద్యార్థుల కర్తవ్యంగా పరిగణింపబడినవి. ఈ రీతిగా ఆంగ్లభాషా ప్రభావం మన జాతిమీద బాగా ప్రబలమయింది. కాని దేశకాలపరిస్థితులు, సాంఘిక, ఆర్థిక పరిస్థితులు మారిన కొలదీ విద్యావిధానంలో కూడా మార్పులు వస్తూఉంటాయి. ఒకప్పుడు ఏ మహా విద్యావేత్తయో, యుగపురుషుడో అవతరిస్తాడు. తన అమేయ మేధాసంపత్తిచేత, తాను దర్శించిన నూతనదృక్పథాన్ని, నూతనవిద్యావిధానాన్ని ప్రబోధం చేస్తాడు ప్రాత క్రొత్తల సంఘర్షణ క్రమంగా మనస్సులలో చెలరేగుతుంది. దేశాభ్యున్నతికీ జాతివికాసానికీ ఏకజాతి పతనానికీ విద్యావిధానం ప్రధానకారణ మని మన విద్యావేత్తలు గ్రహించి యీ విధానంలో మార్పునకై ప్రయత్నాలు చేశారు. ఆ కృషిఫలితంగా మెట్రిక్యులేషన్ విధానంలో కొంత మార్పుకలిగి 1911 లో యస్. యస్. యల్. సి విధానం వచ్చింది. ఇందులో రెండు 'సబ్జక్ట్స్' విద్యార్థులైచ్ఛికంగా చదువుకోవచ్చు. దానివల్ల కొంత సౌకర్యం కలిగింది. తెలుగులో విద్యాబోధన ప్రారంభమయింది. కాని కళాశాలలో పాఠాలన్నీ ఆంగ్లంలో బోధింపబడటంచేత ఆ విద్య యే కొద్దిమందికో తప్ప మిగిలినవారికి అందని ద్రాక్షపండయింది.

ఇంతలో 1921లో భారతజాతి కంతకూ నూతన రాజకీయచైతన్యం గలిగించిన మహాత్ముడు పెద్ద యెత్తున సహాయనిరాకరణోద్యమం ప్రారంభించాడు. అదియొక మహా విప్లవం. అది నలువైపులా విజృంభించింది. విదేశీయ ప్రభుత్వ నిరసనతోబాటు, విదేశీయ వస్తు బహిష్కరణంతోబాటు, విదేశీయ విద్యావిధానంమీద కూడ నిరసన ప్రారంభమయింది. పాఠశాలలు, కళాశాలలు బహిష్కరింపబడ్డాయి. అంతటా సమ్మెలు ప్రబలినాయి. ఆనాటి విషబీజాలే నేటికిగూడా అక్కడక్కడ మొలక లెత్తుతూ ఉన్నాయి. అప్పటిలో ఆ పొంగు చల్లారింది. కాని

పాఠశాలల గౌరవం, ఉపాధ్యాయుల ప్రతిపత్తి క్రమంగా క్షీణించుటకు ప్రారంభించాయి. పాఠశాల లెక్కువైనకొద్దీ నిరుద్యోగసమస్య యెక్కువైంది. విద్యావిధానంలో మార్పు తీసుకురావాలని విశేష ప్రయత్నాలు జరుగసాగినాయి. నాటినుండి నేటి వఱకు సుమారు 40 సంవత్సరాలు విద్యావిధానంలో నిలుకడజెందిన మార్పేమీ రాలేదు. ఉన్న విద్యావిధానంమీద విశ్వాసం పోయింది. క్రొత్త నిర్ణయాలకు ప్రభుత్వం చాల ఔదాసీన్యం చూపింది. అయినా వృత్తివిద్యలయం.దభిరుచి కల్పించటానికి పాఠశాలలలో వడ్రంగం, చేనేత, నవారు నేయుట మొదలగువానికి కొద్ది స్థానం యిచ్చారు. వ్యాయామ విద్యకు కొంత ప్రాధాన్యం సృష్టించారు.

ఇప్పుడే గాంధీమహాత్ముని బేసిక్ విద్యావిధానం పొడసూపింది. ప్రాథమికవిద్యతోబాటు దీని నమలు పఱచాలనీ, దీనితో చాలవఱకు మన సమస్యలు తీర గలవనీ అయన సూచన చేశారు సామాన్య విద్యతో బాటు ప్రతి విద్యార్థికీ వృత్తివిద్య అవసరమన్నాడు. దీనికి తగిన శిక్షణ నిచ్చుటకొఱకై కొన్ని సంస్థలు నెలకొల్పబడ్డాయి. కాని స్వరాజ్యసాధనకై అహింసా సమరమూ, విద్యావిధానంమీద నిరసనా ప్రబలుతూనే ఉన్నాయి.

1947 లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. దాస్యశృంఖలాలు విడిపోయినాయి. దేశాన్ని సర్వతోముఖంగా అభివృద్ధికి తీసుకురావలసిన బాధ్యత ప్రజలపైబడింది. పురోగమించిన యితరదేశాలతోబాటు వర్ధిల్లటానికి తగిన ప్రణాళిక ఆవశ్యకత ప్రభుత్వం గుర్తించింది. తత్ఫలితమే మొదటి పంచవర్షప్రణాళిక. ఇందులో దేశస్వరూపాన్ని మార్చివేసే పథకాలెన్నో వున్నాయి. బేసిక్ విద్యాశిక్షణ కేంద్రాలు కొన్ని నెలకొల్పారు. పాఠశాలలు క్రొత్తగా స్థాపించారు. కాని ప్రాథమిక విద్య ఉద్దేశించినంతగా అభివృద్ధి కాలేదు. ఫలితం ప్రోత్సాహకరంగా లేదు.

## 3

విద్యావిధానం అంటే, ప్రాథమిక, సెకండరీ, కళాశాల విద్యావిధానాలన్నిటినీ సమగ్రంగా సమీక్షచేసి మార్పులుచేయాలి. ఈ మూటిలోనూ సెకండరీ విద్యావిధానం ఆయువుపట్టువంటిది. ఇటు ప్రాథమిక విద్యను బోధించే ఉపాధ్యాయులను తయారు చేయుటకూ, అటు కళాశాలలకు తగినవిద్యార్థులను కూర్చుటకూ ఉపయోగింపవలసిన వీ సెకండరిపాఠశాలలు. అందుచేత వీటిలో విద్యావిధానం తృప్తికరంగా వుంటేనే మిగిలిన విద్యావిధానంకూడా చక్కగా వర్ధిల్లుతుంది. అయితే దీని భవిష్యత్తు ఎలా వుండాలి? ఇప్పుడేమి నిర్ణయించాలి?

దీనివిషయమై ప్రభుత్వం తగినంతగా పట్టించుకోలేదు. పాఠశాలల పరిస్థితి నానాటికి నిరుత్సాహకరంగావుంది. దేశంలోని రాజకీయ, సాంఘిక, ఆర్థిక తీవ్రశక్తుల స్వరూపం పాఠశాలల ఆవరణలలో కూడా ప్రవేశించి దాని స్వరూపాన్ని మార్చివేసినాయి. విద్యార్థుల దృక్పథం వేరు. వారి లౌకిక విజ్ఞానం మామూలుస్థాయిని మించింది. పాఠ్యభాగముల మీదకంటె, సంగీతము, నాటకాలు, నృత్యం, మొదలగువానిమీద అభిరుచి పెరిగింది. చదువుపట్ల నిర్లక్ష్యభావంతో బాటు వారిలో కష్టసహనశక్తి సన్నగిలింది. వివేచనాశక్తి కొఱవడింది. అనాలోచిత వ్యర్థసంభాషణలు, మాటలు ఎక్కువైనాయి నియమబద్ధ జీవితం అలవాటు తప్పింది. హక్కులకు వత్తిడి, అధికారుల యెడ నిర్లక్ష్యభావం ప్రబలినాయి. కట్టాలకొఱకు చదువులు, పరీక్షావిధానమునందు రోత — అంతా అవగాహన చేసుకోటానికి వీలులేనంత గందరగోళ పరిస్థితి అవతరించింది. ఈవిధంగా విద్యార్థుల దృక్పథం వేరుగా పరిణమించింది. ఉపాధ్యాయుల దృక్పథం వేరయింది. రెంటికీ సమన్వయము కుదుర లేదనీ—కుదురుట లేదనీ చెప్పవచ్చు. విద్యావిధానం మార్పుచేయుటలో ఉపాధ్యాయులకు స్థానం లేక పోవుట కూడా ఈ అనర్థానికి కొంతకారణం.

ఇట్టి పరిస్థితులలో సెకండరీ విద్యావిధానంలో మార్పులు రాకపోలేదు. ఈవిషయాన్ని సమగ్రంగా పరిశీలించే కమిటీలు వాటిరిపోర్టులు,సార్జెంటువిధానం, యూనివర్సిటీ కమిషన్‌రిపోర్టు, సెకండరి యెడ్యుకేషన్‌కమిటీ రిపోర్టులు వచ్చినాయి. వీటిలోని సూచనలన్నీ గమనించి చివరకు సెకండరీ యెడ్యుకేషన్‌కమిటీ రిపోర్టును కేంద్రప్రభుత్వం ఆమోదించింది. సంతృప్తికరంగా మార్పులు జరుగలేదు. కాని 1947లో పాఠశాలావాతావరణంలో కొంత మార్పు వచ్చింది. నాలుగవఫారమునుండి విభాజ్యవిద్యావిధానం (బైపర్‌కేటెడ్ కోర్సెస్) ప్రారంభించబడ్డాయి. 1948 నుండీ

పాఠశాలలుకూడా ప్రజాస్వామిక పద్ధతులమీద నడిపే పద్ధతులు అమలులోనికి వచ్చాయి. పౌరశిక్షణను (*Citizenship training*) ప్రారంభించారు. దీని వల్ల పూర్తిగా కాకపోయినా పాఠశాలా క్రమశిక్షణలో కొంత అభివృద్ధి కనుపించింది.

బేసిక్ విద్యావిధానం ప్రాతిపదికగా ప్రాథమిక విద్యావిధానాన్ని మార్చుటకు నిశ్చయం అయిన తర్వాత సెకండరీ విద్యావిధానంలో కూడా మార్పు చేయుట ఆవశ్యకమయింది. దీన్ని అనుసరించే కళాశాలలలోకూడా మార్పురావాలి. అందుచేత కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు, యూనివర్సిటీ అధికారులూ, సెకండరీ యెడ్యుకేషన్‌బోర్డువారు—కలిసి సమావేశాలు జరిపారు. ఇంకా జరుపుతున్నారు. 1953లో అధ్యాపకులను కూడా సలహాసంఘాలలోనికి తీసుకున్నారు. ప్రధానోపాధ్యాయులను కూడా సమావేశపఱచి ఆచటి నిర్ణయాలను ప్రాతిపదికగా తీసికొని, విశ్వవిద్యాలయాధికారులుకూడా సమావేశమై క్రిందటి జనవరిలో తుది నిర్ణయానికివచ్చారు. వీటిని కేంద్ర సెకండరీ విద్యాసంఘం, ఇంటర్‌యూనివర్సిటీ బోర్డు వారును ఆమోదించారు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల ప్రణాళికలను పఱచటాని కుపక్రమించినాయి.

(1) 8 సంవత్సరాలపాటు (ప్రాథమిక మాధ్యమిక తరగతులను కలిపి) సమగ్రమైన ప్రాథమిక (బేసిక్) విద్య. సాధారణముగా 6 సంవత్సరముల ప్రాయం నుంచీ 14 సంవత్సరాల వరకూ విద్యార్థి ఈ ప్రాథమిక శిక్షణ పొందుతాడు. కాని చివరి సంవత్సరం అంటే 8 వ సంవత్సరం విద్యార్థియొక్క అభిరుచులనూ జీవితాశయాలనూ పరిశీలన చేయటానికి ఉపయోగించుతారు.

(2) అటుపైన సెకండరీ విద్య మూడు సంవత్సరాలు—అంటే సుమారు 14 సం॥ నుంచి 17 సం॥ ల వయసు వరకూ. ఈ దశలో విద్యార్థులు వారివారి అభిరుచులను బట్టి వివిధ పాఠ్యాంశాలను అభ్యసించేపద్ధతి వుంటుంది.

(3) అనంతరం తొలి 'డిగ్రీ' పుచ్చుకు నేందుకు అనువుగా 3 సంవత్సరాల విశ్వవిద్యాలయ శిక్షణ.

## ప్రణాళిక వివరాలు

అంతా ఒక్కమారుగా మార్పుతీసుక వచ్చుట అసాధ్యం కొబట్టి మొదటి పంచవర్ష ప్రణాళిక ననుసరించి, రాష్ట్రప్రభుత్వాల సహకారంతో కేంద్రప్రభుత్వం (1) దేశంలో ముందు 500 బహుళార్థసాధక పాఠశాలలు (*Multipurpose schools*) స్థాపించుతున్నారు. ఖర్చు 16 కోట్లు.

(2) ఒక్కొక్క పాఠశాలకు రు 50,000 ల చొప్పున సైన్సును బోధించే పాఠశాలలు 300 స్థాపించబోతున్నారు.

(3) స్కూలుకు రు 15,000 చొప్పున, సామాన్యశాస్త్రము (*General Science*) సాంఘిక విజ్ఞాన శాస్త్రము (*Social studies*), వృత్తులు (*Crafts*) బోధించే ఉన్నత పాఠశాలలు 1500 నెలకొల్పుతారు.

(4) ఒక 500 బహుళార్థసాధక పాఠశాలల్లో, విద్యార్థుల సాహిత్యాభిరుచిని పెంపొందింపజేయటానికి తగిన కార్యక్రమాలను నడుపుతారు. ఇందు క్రింద పాఠశాల ఒక్కింటికి రు 5000/- ఖర్చుచేస్తారు ఇదే కార్యక్రమాన్ని మరొక 1500 మామూలు పాఠశాలల్లో కూడా ప్రవేశపెడతారు — పాఠశాల ఒక్కింటికి రు. 1500 చొప్పున ఖర్చుపెడతారు.

(5) ఇప్పుడు నడుస్తున్న 2000 మాధ్యమిక పాఠశాలల్లో వృత్తివిద్యలు నేర్పటానికి యేర్పాటు చేస్తారు. ఇందు క్రింద పాఠశాల ఒక్కింటికి తొలి పెట్టుబడి రు 4000/- చొప్పునా, వార్షికంగా రు 3500/- చొప్పునా ఖర్చుపెడతారు.

(6) వృత్తి విద్యలు నేర్పే ఉపాధ్యాయులకు తరిఫీదు నివ్వటానికి ఎనిమిది కేంద్రాలను నడుపుతారు. ఈ కేంద్రాలకు ఒకొక్కదానికి తొలిపెట్టుబడి రు 60,000, వార్షిక వ్యయం రు 20,000. ఇది గాక యిప్పుడు నడుస్తున్న అట్టి కేంద్రాలలో ఎనిమిదింటిని అభివృద్ధిచేసి నవీన పద్ధతులలో నడపటానికి, కేంద్రం ఒక్కింటికి ప్రాథమిక వ్యయం రు 60,000 చొప్పున వార్షికవ్యయం రు 16,000 చొప్పున ఖర్చు చేస్తారు.

(7) ఇన్‌స్పెక్టర్లు, ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు — మొదలైనవారికి, 'రిఫ్రెషర్ కోర్సులు', గోష్ఠులు నడపటానికి, ఇంకా యితర చిల్లరమల్లర కార్యక్రమాలకూ మరొక 15 లక్షలు కేటాయించారు.

ఈ కార్యక్రమాని కంతకూ పాఠ్యప్రణాళికలు తయారుచేసున్నారు. మనరాష్ట్రంలో ప్రస్తుత ప్రణా

ళిక ననుసరించి 13 ఉన్నతపాఠశాలల్లో విభాజ్యవిద్యావిధానము (*Bifurcated Courses*) ప్రారంభించారు. ఇందుకై ఈ పాఠశాలలకు ఒక్కొక్కదానికి రు 15,000/- స్పెషల్ గ్రాంటు ఇస్తారు. కాకినాడలోను చిత్తూరులోను రెండు 'సెమినార్స్' జరుపుటకు నిర్ణయించారు.

1955 జనవరి, ఫిబ్రవరి నెలల్లో తూర్పు, పడమటి గోదావరిజిల్లాలలోను చిత్తూరుజిల్లాలోను అయిదు, కార్మికసాంఘిక సేవాశిక్షణ శిబిరాలు నడిపారు.

దాదాపు 50 లక్షల రూపాయల ఖర్చుతో, 30 క్రొత్తకోర్సులతో 15 బహుళార్థసాధక పాఠశాలలనూ, సైన్సు బోధనాపద్ధతులను 30 పాఠశాలల్లో అభివృద్ధి పఱచుటకునూ అంచనాలు వేయబడ్డాయి.

మొత్తంమీద ఈస్కీములకన్నిటికీ దాదాపు రు 96 లక్షల ఖర్చు అంచనా వేయబడ్డది.

మఱియు నీ పంచవర్ష ప్రణాళికలో ఆర్థికస్తోమతు ననుసరించి 1961 నాటికి సెకండరీ పాఠశాలల నన్నిటినీ హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చుట — ఇంకా బహుళార్థసాధకపాఠశాలలను ఎక్కువగా స్థాపించుట వానిలో బోధించుటకు తగినట్లుగా ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చుట — ఇవి చెప్పుకోదగిన అంశాలు. అందఱికీ సమానావకాశాలు కల్పించుట — ఉన్నతవిద్య అందఱికీ అందుబాటులోనుండే విధమున అన్నికులాలవారికీ న్యాయం కల్గించుట ఈ ప్రణాళిక ముఖ్యలక్ష్యం. ఆయా విద్యలను బోధించే సాంకేతిక నిపుణులను తగినంతమందిని తయారు చేయుట కూడా దీని లక్ష్యం. పాఠశాలలలో సర్వత్రా విద్యాభివృద్ధి ప్రోత్సాహకరంగా లేదు కాబట్టి ఉన్నత పాఠశాలలో 11వ తరగతిని కలిపి యింకొక సంవత్సరం విద్యార్థులకు శిక్షణ నివ్వాలని యొకప్రణాళిక — లేక — కళాశాలలోని 'ప్రీ ఇంటర్ క్లాస్' ఏర్పాటుచేసి శిక్షణ నివ్వాలని మఱియొక పద్ధతి — ఆలోచనలో ఉన్నది. పాశ్చాత్యదేశాలలో కూడా విద్యాప్రమాణం (*Standard*) ఇట్లే మార్పు చెందినట్లు కూడా తెలుస్తోంది. ఇదంతా యుద్ధానంతర లక్షణంగా స్ఫురిస్తుంది. ఏది యెలావున్నా నిర్ణయం చేసి విధానాన్ని సర్వవిధములా సమీక్షచేస్తూ అమలుపరచడంలో తోడ్పాటు యివ్వడానికి పెక్కువర్గాల ప్రతినిధులతో కూడిన సంఘం ఏర్పడుట శుభసూచకము.

## 4

ఏది యెట్లావున్నా సంఘంలో ప్రస్తుతం కలిగే పరిణామం ఒక సుస్థిరరూపం తాల్చనంతవఱకూ కొంతకాలంవఱకు విద్యావిధానం కూడా నిలుకడలేక సుస్థిరరూపం తాల్చలేదు. అంతా అస్థిరంగానే వుంటూ ఉంటుంది.

దేశమంతా పారిశ్రామికంగా వృద్ధిచెంది ముందడుగు వేయాలనేది అందఱూ అభిలషించేదే. ఆ పరిస్థితిలో పరిశ్రమలలోను, వ్యవసాయపద్ధతులలోను చక్కని మార్పులు వచ్చి నీటివనరులు మున్నగువానికి కావలసిన ప్రాజెక్టులు విద్యుదుత్పత్తికేంద్రాలు మొదలైనవి చాలినన్ని నిర్మించుకుంటేనేకాని దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందదు. వానిని నిర్వహించేందుకు సాంకేతిక విద్యానిపుణులెందఱో కావాలి. వారిని తయారుచేసే సాంకేతిక విద్యాశిక్షణ కేంద్రాలు ఎక్కువగా స్థాపింప నవసరముంది. అయితే సాంకేతిక విద్యాపాఠశాలలు, ఈ వృత్తి విద్యాపాఠశాలలు, సాధారణ పాఠశాలలు రీతిగా పాఠశాలలను వేర్వేరుగా స్థాపించాలి. ఇది చాలాముఖ్యం. వేర్వేరుగా స్థాపించినట్లయితే విద్యార్థులు తమతమ అభిరుచులను పురస్కరించుకొని ఆయా పాఠశాలలలో చేరి విద్య నేర్చుకుంటారు. దీని మూలంగా పాఠశాలల్లో రద్దీకూడా తగ్గుతుంది. ప్రశాంత వాతావరణంకూడా లభిస్తుంది. అట్లాకాక మామూలు పాఠశాలల్లోనే క్రొత్తక్రొత్త కోర్సులు, గ్రూప్‌లు ఎన్ని ప్రవేశపెట్టినా ఇష్టమున్నా, లేకపోయినా అందఱూ తప్పక వానిని చదువవలసి వస్తుంది. పాఠశాలల్లో బాలురసంఖ్య కూడా పెరిగిపోయి క్రమశిక్షణ వారిలో తగ్గుతుంది. అంతేగాక ఈ పాఠశాలలు స్వతంత్రములుగా ఉండాలి. ఆయా సాంకేతికవిద్యకు కావలసిన సాధారణ విద్య (*General Education*) కూడా పరిమితంగా ఆయా పాఠశాలలలోనే బోధించాలి. అప్పుడు అవి స్వతంత్రంగా ఉంటాయి.

స్త్రీల పాఠశాలలు సాధ్యమయినంతవఱకు ప్రత్యేకంగానే ఉండాలి. వారి విద్యావిధానానికీ బాలుర విద్యావిధానానికీ తేడా సహజంగా కొంత

ఉంటుంది. కుటుంబవ్యవస్థకు స్త్రీ పురుషు లిరువురు బాధ్యులు కాబట్టి స్త్రీ కూడ విద్యావతియై కుటుంబ మును సక్రమమార్గమున నైతికమార్గమున నడుపగల విద్యావిధానము నమలులోనికి తీసుకురావాలి. ఉన్నత విద్య - లేక - సాంకేతిక విద్యను బోధించే స్త్రీ కళా శాలల స్థాపించి తగు విధంగా స్త్రీ విద్యను కూడా ప్రోత్సహించాలి.

పాఠశాలలలో కొన్నిటిలో నేను సుమారు రెండు వేలమంది వఱకూ బాలురు ఉన్నారు. అందు వలన అట్టి సంస్థలలో క్రమశిక్షణ తృప్తికరంగా వుండ దంటే ఆశ్చర్యం లేదు. అందుచేత ప్రతిపాఠశాలలోను తరగతులలో బాలురసంఖ్య కనీసం ముప్పదిమందికి మించకుండా, మొత్తం పాఠశాల బాలురసంఖ్య 600 లకు మించకుండా ఉండాలి. విద్యార్థి సంఖ్య తగ్గితే పాఠశాల ఆదాయం తగ్గిపోవచ్చు. కాని బాలురకు చక్కనివిద్య,క్రమశిక్షణ ఆవశ్యక మని తలచిన నా డా నష్టాన్ని ఆ పాఠశాలలను నడిపే మేనేజిమెంటువారు కానీ, ప్రభుత్వమువారుగానీ భరింపసిద్ధపడాలి. అదీ కాక పాఠశాలలన్నీ సాధ్యమయినంతవఱకు "రెసి డెన్షియల్ స్కూల్సు"గా మార్చుకోగల్గితే నే కాని విద్యార్థులలో మననూశించే విద్యకానీ, నైతిక ప్రవ ర్తనకానీ, క్రమశిక్షణకానీ లభ్యం కావు. ఇది సఫలం కావటానికి ఎక్కువకాలం కూడా పట్టవచ్చు. అయి నప్పటికీ మనలక్ష్యం మాత్రం అట్టి పాఠశాలలను సాధ్యమయినంతవఱకు పెంపొందించుకొనుట యని మాత్రం మఱచిపోరాదు.

ప్రస్తుతం విద్యావిధానంలో భాషాసమస్య వొకటి అందఱినీ బాధిస్తున్నది. రాజకీయంగానే కాక అంత ర్జాతీయంగా కూడా ప్రఖ్యాతి వహించిన, వహి స్తున్న ఆంగ్లభాషను త్రోసిరా జనటం అవివేకమే అవుతుందేమో! సాంకేతికంగా, వైజ్ఞానికంగా, పారి శ్రామికం అంతర్జాతీయంగా కూడా మనదేశం ప్రఖ్యాతివహించాలని కోరుతున్నాం కాబట్టి యీ భాషతో మన మెన్నటికీ తెగతెంపులు చేసుకోలేము. అయితే దీనిని సాధారణ పాఠశాలల్లో తగ్గించి సాంకే తికాది పాఠశాలల్లో ప్రవేశపెట్టితే బాగుంటుందేమో!

ఇక దేశభాషల యావశ్యకతను గూర్చి చెప్ప నక్కఱలేదు. అవి వర్ధిల్లాలంటే వాటితోబాటు వాటిని దాదివలె ప్రచ్ఛన్నంగా వుండి పోషించే సంస్కృతాన్ని కూడా ఈ సాధారణ పాఠశాలల్లో ప్రోత్సహిస్తే తప్పేమీలేదు. సంస్కృత గర్భంలో ఇమిడివున్న విజ్ఞాన రహస్యాన్ని విద్యార్థులు గ్రహించ యత్నించటానికి మనం విధిగా ప్రోత్సాహ మివ్వాలి కూడా! ఇక హిందీని గబ్బిలంలాగా ఉంచితే అది వర్ధిల్లటానికి మారుగా అపహాస్యంపాలవుతోంది. దాన్నికూడా నిర్బంధ భాషగా తప్పక చేయాలి.

ఇక పౌరశిక్షణవిషయం. ఇది పాఠశాలల్లో ప్రవేశపెట్టబడిందేకాని నామమాత్రావశేషంగావుంది. నైతికంగా దాని ఆవశ్యకత అందఱూ గ్రహించారు. కాని దానిని చక్కగా అమలుపరిచే విషయంలో పాఠశాలాధికారులు, ప్రభుత్వంవారు కూడా ఉదాసీ నంగా ఉన్నారు. ఆ ఔదాసీన్యాన్ని విడిచి అందరూ దానిపై దృష్టిని కేంద్రీకరింపగల్గితే పాఠ శాల ఒక ఆదర్శప్రాయమైన కుటుంబంగా, చక్కని ప్రజాస్వామిక సంస్థగా గుర్తింపజేయగల్గుతారు. ఆ ప్రజాస్వామ్య నిర్వహణంలో విద్యార్థులూ, ఉపా ధ్యాయులూ, తల్లిదండ్రులూ లేక సంరక్షకులూ, పాలకవర్గమువారూ సమాన భాగస్వాములే. ఇందొక రెక్కువ, ఒకరు తక్కువ అనే భావంలేదు. కుటుం బంలో అందఱు తమతమ విధ్యుక్త ధర్మాలను గుర్తించుకొని యుంటేనే కుటుంబం వర్ధిల్లుతుంది. అట్లే పాఠశాల కూడా. కుటుంబంలో మిగిలినవారి కన్నా కుటుంబయజమానికి బాధ్యత యెక్కువ. అట్లే పాఠశాలా కుటుంబంలోకూడా ఉపాధ్యాయుల కెక్కువ బాధ్యతవుంది. దీనిని విస్మరించకుండా అందఱూ పనిచేస్తే వారి ఆత్మగౌరవంతోబాటు పాఠ శాలా గౌరవంకూడా పెంపొందుతుంది.

ఇట్టి ఉత్తమపౌరులను తయారుచేసే బాధ్యత పాఠశాలలమీద ఉన్నదికాబట్టి విద్యార్థుల చిత్త వికాసానికి తోడ్పడే పాఠ్యప్రణాళికకు సంబంధిం చని ఇతర కార్యక్రమాలు కూడా విద్యతోపాటు తగిన స్థానంవహించాలి. పాఠశాలాచిహ్నము, పాఠశాలా పతకం యేర్పాటుచేసికోవాలి. వైజ్ఞానిక సంఘాలు, సారస్వతసంఘాలు, విహారయాత్రలు, దృశ్యవిద్యకు సంబంధించిన సినిమా ప్రదర్శనాలూ, మాజిక్ లాన్ టరన్ ప్రదర్శనాలూ. మిలిటరీ (*N. C. C. or A. C. C.*) శిక్షణ, నాటకసంఘాలు, సంగీతము మొద లైన వన్నీ తగినరీతిగా, ప్రతిపాఠశాలలోను ప్రోత్స

హించాలి. ఏమైనా విద్యఅంటే 'డిగ్రీ' లేక సర్టిఫికేట్లును ఎట్లైనా సంపాదించుకొనుట అనే భావం విద్యార్థులలో తగ్గిపోవాలి.

ఇక ఉపాధ్యాయుల విషయం. ఇది చాలా ముఖ్యమయినవిషయం. దేశ సౌభాగ్యానికి రైతు పునాది అయినట్లే అటు ధనవంతులూ, ఇటు కేవలం నిరుపేదలు కాని మధ్యతరగతి ప్రజలు కూడా దేశానికి వెన్నెముకవంటివారే. దేశంలో ఇట్టివారే ప్రధాన పాత్రవహించుతున్నారని చెప్పవచ్చు. కాని యీ సంఘం తగిన కట్టుబాట్లు లేక క్రమబద్ధంగా లేదు. అందుచేత దానికి తగిన రక్షణ లేదుకూడా. ఉపాధ్యాయులు దాదాపు అందరూ ఈ తరగతికి చెందినవారే. ఈసంఘాన్ని ఉపేక్షిస్తే దేశం అన్ని రంగాలలోను ఎట్లా ముందంజ వేస్తుంది? అన్ని రంగాలలోను ముందంజవేయవలసినవారూ, వేస్తున్నవారూ ఎక్కువగా వీరే. అందుచేత వీరి నుపేక్షించకుండా ఉపాధ్యాయుఃకు పాఠశాలలో తగిన ప్రతిపత్తి కల్పించాలి. ఆర్థికంగా కూడా తగిన అభివృద్ధి చూపించాలి. విద్యావిధానం మార్పు చేయుటలోనూ, పాఠ్యప్రణాళికలను తయారుచేయుటలోనూ, అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులకు తగిన స్థానం యివ్వాలి. ఇతరుల కర్తృత లేదని కాదు కాని ఎప్పుడూ విద్యాప్రపంచంలో జీవితాన్ని గడిపే అనుభవమే దేశాన్ని విద్యావిషయకంగా ఎక్కువగా పురోగమింపచేస్తుందని నా నమ్మకం. అప్పుడే జాతివికాసానికీ, ఉత్తమపౌర నిర్మాణానికీ, దేశాన్నత్యానికి మనం ప్రథమసోపానం నిర్మించినట్లు అవుతుంది.

ఇట్టి వాతావరణాన్ని కలిగించితేనే ఆదర్శప్రాయులగు ఉపాధ్యాయులు లభ్యమౌతారు. అట్టివారే విద్యాలయానికి తోడ్పడకుండా విద్యాలయ సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుతారు. తాను కోల్పోయిన ఉత్తమస్థానాన్ని ఎన్నటికైనా ఉపాధ్యాయుడు తిరిగి సంపాదించుకోగలగాలి. ఎవరు ఏ విధముగా సహాయంచేసినా, ఆదరణ చూపినా, పాఠశాలకు జీవగఱ్ఱ ఉపాధ్యాయుడే. అతని కృషి, ఉత్సాహము, పట్టుదలయే పాఠశాలకు తిరిగి ప్రాణం పోయగలవు.

పైన సూచించిన విధంగా పాఠశాలలను పరిష్కరించి విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, తల్లిదండ్రులూ, అధికారులూ పరస్పరం సహకరించి సమైక్యభావంతో పనిచేసిననాడే తమ దేశాన్ని తమ జాతినీ చక్కగా దిద్దితీర్చుకోగల విద్యార్థులు వర్ధిల్లుతారు. ఈ మధురభావాలను పెంపొందింపజేసే విద్యావిధానాన్ని యెన్నటికైనా మనం సమకూర్చుకోవాలనీ, సమకూర్చుకోగలమనీ నా విశ్వాసం.

# దశాంశపద్ధతి నాణెములు

శ్రీ బి. ప్రసాద్—శ్రీ కె. వి. రమణ

దశాంశపద్ధతిలో నాణెములను దేశంలో ప్రవేశపెట్టాలని నిర్దేశించే బిల్లును లోక్‌సభ జూలై 30వ తేదీని ఆమోదించింది. ఇది భారతీయ ద్రవ్యమాన పద్ధతిలో ఒక విప్లవాత్మకమైన మార్పు కాగలదు. శాస్త్రీయవిజ్ఞానంతో అమితవేగంగా పురోగమిస్తున్న ఆధునిక ప్రపంచానికి భారతదేశం దూరంగా వుండక, ఆర్థిక వైజ్ఞానిక రంగాలలో ఇతర దేశాలతో సమంగా ముందుకు వెళ్లుతోందనడానికి ఇదో నిదర్శనం. కేవలం అహేతుకమైన కొన్ని మానసిక అభ్యంతరాలకు లోనుగాకుండా ఇట్టి శ్రేయోదాయకమైన చర్య తీసికొన్న పార్లమెంటు సభ్యులు అభినందనీయులు.

ద్రవ్యమానంలో దశాంశ పద్ధతివలెనే, కొలము, దూరము, బరువు మరే యితర పదార్థములనైనను కొలచుటకొక ప్రమాణం అత్యవసరం. ఈ ప్రమాణాలు అన్ని దేశాలలోను అన్ని సమయాలలోను ఒకేవిధంగా వుండి నిర్దిష్ట అనుక్రమంలో అమర్చటానికి వీలుగాను ఆచరణలో సౌలభ్యం కలగజేసేవిగా వుండాలి. చరిత్రలో మొదటినుండి ఏ దేశమున కాదేశము వారి అభిరుచులకు ఆలోచనలకు అనుగుణంగా వారివారి కొలతలు, తూకాలు, ద్రవ్యమానాలు నిర్ణయించుకున్నారు. అప్పటి పాలకులు కూడ పై సూత్రాలను గమనించక పోలేదు.

రానురాను వాణిజ్య సంబంధములవల్లనూ విదేశీయ దండయాత్రలవల్లనూ ఒకదేశపు కొలతలూ ప్రమాణాలు మరోదేశానికి వ్యాపించడం జరిగింది. కాని అప్పుడు ఒకే దేశంలో ఒకే ప్రమాణ పరిమాణానికి వివిధమైన యూనిట్లు వుండేవి. యూరపు ఖండంలో 18వ శతాబ్దాంతమందు “పౌనుకు” 391 యూనిట్లు వుండేవి. అలాగే “అడుగు”నకు 282 యూనిట్లు వుండేవి. ఇలా విభిన్నమైన పరిమాణాలు కొలతలు వుండటంవల్ల వర్తక వాణిజ్యములకు అంతరాయం కలిగేది. ఇట్టి అంతరాయములను పోగొట్టటానికే 1795లో “టాలిరాండ్” అను నతను ఫ్రాంసు నేషనల్ అసెంబ్లీని కొలతలు తూకాలలో మెట్రిక్ పద్ధతిని అమలు జరుపవలసిందిగా కోరాడు. ఫ్రెంచి విప్లవఫలితాలలో ఒకటి ఈ మెట్రిక్ పద్ధతి. ఈపద్ధతి ప్రకారం ‘మీటర్’ (మీటర్ అనగా భూపరిధిలో నలభై మిలియన్లవంతు) కొలతకు ప్రమాణంగాను, ‘ఫ్రాంకు’ ద్రవ్యమానంలో ప్రమాణంగాను స్వీకరించబడినాయి. 1875 నాటికే మెట్రిక్ పద్ధతి జర్మన్ సామ్రాజ్యమునందంతటను నెలకొల్పబడింది. తరువాత 1879లో ప్యారిస్ మహానగరంలో తూకాలు కొలతలను గురించి చర్చించుటకొక సమావేశము జరిగింది. దాంట్లో 18 రాజ్యాల ప్రతినిధులు పాల్గొని అన్నిదేశాలలోనూ సామాన్యంగా వుపయోగించుటకై తగిన కొలతల యూనిట్ల గురించి చర్చించారు. మెట్రిక్ పద్ధతియొక్క సౌలభ్యాన్ని అందరు గుర్తించారు. కాని అమెరికా ఇంగ్లాండు దేశాలు మాత్రం దీన్ని అనుకరించలేదు. దీనికి కారణం లేకపోలేదు. ఒకటి: అంతకు పూర్వం వున్న పద్ధతిని వదలి నూతన పద్ధతిని ప్రవేశపెట్టుటకు మానసికంగా వారు బాధపడటం; రెండవది: అంతకు ముందున్న ‘ద్విదశాంక పద్ధతి’ (*Du-o-decimal System*) — ఇందు 2, 3 అంకెలు గుణిజములుగా వుంటాయి) కంటె, మెట్రిక్ పద్ధతి నిర్మాణ వాణిజ్యములందు తక్కువ ఉపయోగకారి అనే అభిప్రాయం ఉండుట. కాని అంతర్జాతీయ వ్యాపార వాణిజ్య రంగములలో ప్రముఖపాత్ర వహించిన అమెరికా బ్రిటన్ దేశాల ప్రమాణములకు గల వ్యత్యాసం అనేక యిబ్బందులకు కారణభూతమైంది. అనవసరమైన చిక్కులను అతిక్రమించి విదేశీయ వాణిజ్యమును సులభతరం జేయటమే ఈ మెట్రిక్ పద్ధతి ముఖ్యలక్షణం.

మనదేశంలో కూడ ఈ పద్ధతిని అమలు జరుపటానికి 1945 లోనే చర్చలు బయలుదేరాయి. మొదటి నుండీ భారతీయ తూకములకు గాని, నాణెములకు గాని

శాస్త్రీయమైన భూమిక లేదు. దేశమంతటా ఒకే ప్రమాణం ఆచరణలో లేదు. సంస్థాపితమైన బ్రిటిషు పరిపాలన కూడ భారతీయ తూకముల కొలమానములపై ఎట్టి మార్పును చేయలేకపోయింది. ఇప్పటికీ దేశంలో ప్రతి రాష్ట్రానికి, ప్రతి జిల్లాలోనూ, ప్రతి ప్రాంతంలోనూ వివిధ తూకములు కొలమానములు అమలులో వున్నాయి! అందుకనే నేడు మరింత శాస్త్రీయమైన పద్ధతిని అమలు జరుపవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఇట్టి ఆవశ్యకత ఇప్పుడే కాదు—1946 లో నే గుర్తింపబడి పార్లమెంటులో ఒక బిల్లు ప్రవేశపెట్టబడింది. ప్రస్తుత సమస్య కేవలం ద్రవ్యమానంలో దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టుటకు మాత్రమే ఆమోదింపబడింది. ఇందుమూలంగా లెక్కలు కట్టడం — ముఖ్యంగా "స్టాటిస్టిక్సు శాస్త్రానికి" సంబంధించిన లెక్కలు— సులభం కాగలదు ద్రవ్యమానాన్ని దశాంశములలో సులభంగా గ్రహించగలము. అన్నిటికన్న ముఖ్యముగా వ్యవసాయ పారిశ్రామికరంగాలలో శీఘ్రగతిని పురోగమిస్తున్న ఆధునిక ప్రపంచంలో భారతదేశం కూడ తన స్థానాన్ని నిలబెట్టుకొని అభివృద్ధి చెందుటకు దశాంశ పద్ధతి ఆవశ్యకత ఎంతైనా వుంది.

1946 లో ఈ బిల్లు తయారయినప్పుడు దేశంలో చాలామంది—అందులో ముఖ్యంగా గాంధీజీ—అడ్డు చెప్పారు. వారు చెప్పిన కారణం: ఇంతవరకు ఒక పద్ధతికి అలవాటుపడ్డ ప్రజలు నూతన విధానాన్ని వెంటనే అర్థం చేసుకొని అలవర్చుకోలేరు. అట్టి అశక్తతను ఆధారంగా తీసికొని వ్యాపారస్థులు, ధనికులు సామాన్యప్రజలని దోచుకొనవచ్చు నని వీరందరు భావించారు. గాంధీజీ అభ్యంతరానికి ముఖ్యంగా పై కారణమే. కాని నెమ్మదిగా ఈ విధానాన్ని అవలంబించాలని అప్పుడు కూడ సూచించారు. జాతీయ ప్రభుత్వం వచ్చిన తర్వాత ఈ విధానంలోని సాధక బాధకాలను ఆలోచించి ప్రజాభిప్రాయాన్ని సేకరించి సావధానంగా అమలుజరుప వచ్చునని కూడ గాంధీజీ అప్పుడే సూచించారు.

ఈ దశాంశ విధానానికి వ్యతిరేకముగా అభిప్రాయపడిన వారు వెలుబుచ్చిన అభ్యంతరాలు అంత సహేతుకంగా కనపడవు — యుగయుగాలుగా అలవాటు పడిన జీవనంలో లేశమాత్రం సంస్కరణ కూడ కొన్ని చిక్కులను తెచ్చిపెట్టవచ్చును. కాని కేవలం అట్టి స్వల్ప కారణములతో పరిగ్రాహ్యమైన పద్ధతిని వదలుకొనుట వివేకం కాదు. జాగ్రత్తగా ఆలోచించి తగు కాలవ్యవధిలో సంస్కరణలు తీసికొని వచ్చిన ఊహించిన ఆ కొన్ని యిబ్బందులు కూడ కలగకపోవచ్చును. అయినా భారత ప్రజలు ఇట్టి చిన్నవిషయాలలో మోసపోవునంతటి అజ్ఞానులు మాత్రం కారు. ఇది హైదరాబాదురాష్ట్రం ఉదాహరణగా తీసికొన్న నిరూపించవచ్చును. హైదరాబాదురాష్ట్రంలో ప్రాంతీయ 'హాలీ' నాణెములు, భారతప్రభుత్వ నాణెములు రెండునూ మొన్న మొన్నటివరకూ వాడుకలో వున్నందువలన ఏ ఇబ్బందులు కలుగలేదు. ఇచ్చిపుచ్చుకోవడాలు వర్తక వ్యాపారాలు ఏ యిబ్బందులు లేకుండా సులువుగా జరిగిపోయేవి. కాగా నేటికి భారతదేశంలో అక్షరాస్యత పెరుగుతోంది. సామాన్య ప్రజలు ఏమంత తెలివితక్కువను కనబరచటం లేదు. అప్పటి ప్రజల నిరక్షరాస్యత దృష్ట్యా గాంధీజీ అడ్డు చెప్పినా, నేడు ఆ అభ్యంతరము అకారణంగా కనుపిస్తుంది. ఇంక ఈ పద్ధతిని మరింత తొందరలో కాలహరణం లేకుండా దేశంలో అమలు జరుపవలసిన అవసరం ఎంతైనా వుంది. దేశంలో యింకా కొంత భాగంలో వర్తక వ్యాపారాలు యింకా "వస్తుమారక" (*Barter*) రూపంలోనే జరుగుతున్నాయి. అనగా ఆ ప్రాంతాలలో రూపాయలు వ్యాపార రంగంలో లేవన్నమాట. ఆ ప్రదేశాలలో ప్రస్తుత రూపాయలైనా, దశాంశనాణాలైనా క్రొత్తవిగానే వుంటాయి రెండింటి సౌలభ్యం వారికి ఒకటిగానే వుంటుంది. ఆర్థికంగా మన దేశం అభివృద్ధి చెందేకొలదీ వస్తువులలోనే మారకాలు జరుగుతున్న ఆ ప్రాంతాలు కూడ క్రమంగా ద్రవ్యమారకంలోకి (*Monetary economy*) తీసికొని రాబడుతాయి. ఈ ప్రాంతాలలో రూపాయలను ప్రవేశపెట్టుటకు మారుగా ముందుగానే దశాంశ నాణెములను ప్రవేశపెట్టిన మన యత్నం కొంతసులభతరం కాగలదు.

తిరిగి ఈ మధ్య ఈ సమస్య ప్లానింగు కమిషన్ వారిచే ప్రభుత్వదృష్టికి తీసికొనిరాబడింది. ఈ సంస్కరణకు ప్లానింగు కమిషన్ వారు తమ అంగీకారాన్ని నిర్దిష్టంగా ప్రభుత్వానికి తెలియజేశారు. ఈ సలహాననుసరించి వాణిజ్య శాఖామంత్రి కృష్ణమాచారిగారు ఒక ప్రకటన చేస్తూ దశాంశపద్ధతిలో ద్రవ్యమానాన్నే కాకుండా తూకములు కొలమానాల్లో మెట్రిక్ పద్ధతిని

కూడ దాని వెనువెంటనే సముచిత వ్యవధానంతో అమలు జరుపుటకు ప్రభుత్వనిర్ణయాన్ని తెలియ జేసారు.

దశాంశ పద్ధతి వస్తే, భారతీయులకు అలవాటు పడ్డ అణా, రెండణాలు, పైసలు వ్యవహారంలోనుంచి అదృశ్య మవుతాయి. కనుక, ఈ నూతన విధానంలో వీటిని యథోచితంగానే వుంచాలని కొందరు సూచించారు. కాని వ్యవహారం సౌలభ్యం కోసం ప్రవేశపెట్ట బడుతున్న ఈ నూతన విధానంలో పాతనాణెములు వుంటే మరి కొన్ని కొత్త చిక్కులు కలుగుతాయి. అందుకని వీటిని పూర్తిగా తీసివేయుటే మంచిది. ఇంక పైసలు నేడు చెలామణీలో నే కనబడవు. అవి పోయినా బాధపడే దెవరూ లేరు. ఆధునిక విజ్ఞాన వాణిజ్య రంగాల్లో ఈ దశాంశ మెట్రిక్ పద్ధతులవలన కలిగే లాభాలను గమనించే నెదర్లాండ్స్, మలయా ఈస్టు యిండీస్ ఇరాక్ తాయిలాండు దేశాలు ఈ విధానమును అమలు జరిపిన విషయం మనకు తెలుసు.

ఈ నూతనవిధానంవల్ల వచ్చు కొన్ని తాత్కాలిక యిబ్బందులను నేటి ప్రభుత్వం గుర్తించకపోలేదు. ఇంతకు పూర్వం వున్న వస్తువుల ధరలూ, రైల్వేటికెట్ల రేట్లనూ, క్రొత్త విలువల్లో నిర్ణయించటం కొంత శ్రమ నివ్వవచ్చును. పోస్టలు స్టాంపులు అమ్మకంలోనూ తదితర విషయాలలోను కొన్ని యిబ్బందులు కలుగుతాయి. వీటిని భరించాలి. మొదట కొంతకాలంవరకూ పాత కొత్త నాణెములు రెండునూ వాడుకలో వుంటాయి. కాని రెండురకముల నాణెముల పరస్పర విలువలు ప్రకటిస్తూ కొన్ని ప్రకటనలను (*Slips*) ప్రభుత్వం ప్రజల కందుబాటులో వుంచిన, పైన పేర్కొన్న కొన్ని యిబ్బందులు తగ్గుతాయి. ఏ విషయంలోనైనా సౌలభ్యసాధనకు సంస్కరణ ప్రియులు ఇట్టి తాత్కాలికమైన యిబ్బందులను ఎదుర్కొనవల సినదే.

తూకములు కొలతలు మెట్రిక్ పద్ధతిలో కనువదించుట మరింత కష్టమైన పని. మెట్రిక్ కొలత విధానాన్ని అమలుజరుపవలసిందని మొట్టమొదట 1870లో స్ట్రాచీ అను నతను సూచించారు. 1949 లో శ్రీ జె. సి. ఘోష్ గారి అధ్యక్షత క్రింద "ఇండియన్ స్టాండర్డ్సు ఇన్‌స్టిట్యూషన్" వారు ఓ సబ్ కమిటీని నియమించారు. వారు ఈ నూతన విధానాన్ని 10, 15 సంవత్సరముల వ్యవధిలో క్రమేణా అమలు జరిపిన బాగుండు నని సూచించారు. ప్లానింగు కమీషన్ కూడ ఈ విధమైన మార్పు యొక్క ఆవశ్యకతను గుర్తించారు. దీని నాధారంగా తీసికొనే శ్రీ టి. టి. కృష్ణమాచారి కొంతమంది నిపుణులతో కానంగో కమిటీని నియమించారు. ఈ సమస్యను వారు పరిశీలించారు. ఈ తూనికల మార్పును గురించిన బిల్లును కామర్సు - ఇండస్ట్రీస్ మంత్రివర్గం త్వరలో లోక్ సభలో పెట్టనున్నారు. దశాంశ నాణెముల ప్రవేశపెట్టుటకంటె తూనికలలో మెట్రిక్ విధానమును అమలు జరుపుట కష్టతరమైనది. అసలు దేశంలో ప్రతిప్రాంతానికి తలోకవిధమైన తూనికలు వున్నాయి. వీటన్నిటికీ మారుగా ఒకే రకమైన నూతన పద్ధతిని ప్రవేశపెట్టుట ఒక విధముగా సులువైనా, మరొక విధంగా కష్ట మవుతుంది. ముఖ్యంగా ఈ విధమైనమార్పు వ్యాప్తిచెందుతున్న ఇంజనీరింగు పరిశ్రమ నంతటినీ తట్టుతుంది. ప్రస్తుతం మన ఇంజనీరింగు వస్తువు లన్నీ "పౌన్లు" 'అంగుళముల' కొలతల్లో తయారవుతున్నాయి. దీనికి కారణం ఆదినుండీ మనకు బ్రిటన్‌తో వున్న వాణిజ్య సంబంధాలే. అయినప్పటికీ ఎప్పుడైతే దశాంశ పద్ధతి మంచిదని నిర్ణయించి ప్రథమంగా నాణెములలో మార్పు తేవటానికి సంసిద్ధుల మయ్యామో, అప్పుడే తూనికలలో మెట్రిక్ విధానము ప్రవేశపెట్టటానికి సిద్ధపడి వుండాలి. అయితే ముందుగా దశాంశ విధానమును ప్రవేశపెట్టి, తర్వాత క్రమేపీ మెట్రిక్ తూనిక విధానాన్ని అములుజరుప వచ్చును. మార్పు మంచిదని తోచినప్పుడు, సగంలో ఆగిపోవుట మార్పును అంగీకరింపక పోవుటకంటె అరిష్టదాయక మవుతుంది.

ప్రస్తుతం ఆమోదించబడిన బిల్లు ప్రకారం చలామణీలోనికి రాగల కొత్త నాణెములపై ఇప్పటి వలె "గవర్నమెంటు ఆఫ్ ఇండియా" అనిగాక హిందీలో 'భారత్' అని ముద్రించబడుతుంది. నాణెమునకు ముందువైపున యిప్పటిలాగు నే అశోక స్తంభం సింహాలు వుంటాయి. వెనుకవైపున అశోక స్తంభముపై నందిగాని అశ్వంగాని వుండవచ్చు. అందుకు స్థలం లేకపోయిన కేవలం నాణెపు విలువ, తేదీ ముద్రింపబడివుంటాయి.

ఈ నూతన విధానంలో రూపాయి నూరు భాగాలుగా విభజింపబడుతుంది. అప్పుడు అర్థ రూపాయికి 50 నాణెములు పావలాకి 25 నాణెములు వుంటాయి.

రూపాయి, అర్ధ రూపాయి పావలా విలువల్లో మార్పు ఏమీ వుండదు. అంతకన్న తక్కువ నాణెముల విలువల్లోనే మార్పు వుంటుంది. క్రొత్త నాణెములను జారీ చేయగానే యిప్పటి నాణెములను ఉపసంహరించటం జరగదు. కొత్త నాణెములతో పాటు ఇవికూడ కొంత కాలం చెలామణీలో వుంటాయి. క్రమేణా పాతవి ఉపసంహరింపబడతాయి రూపాయలోని వందవ భాగమునకు పెట్టవలసిన పేరును సభ నిర్ణయించలేదు. 'చక్రము'ని 'సెంటు' అని వివిధ నామములను సభ్యులు పేర్కొన్నారు. కాని దేశంలో అన్నిమూలలా అందరికీ అలవాటయిన పేరు "పైస". దీన్నే దశాంశ నాణెముకు పెట్టిన ప్రజలకు కొంత ఉపయోగకారిగా వుంటుంది.

దశాంశపద్ధతిలోని బహుళ ప్రయోజనాలను గుర్తించినట్లయితే ఈ మార్పును సర్వతోముఖ సత్వరాభివృద్ధి పొందుతున్న భారతదేశము స్వీకరించుట తప్పనిసరి. విజాతీయమైనంత మాత్రాన ఏశాఖలోనైనా ఉత్తమ పద్ధతిని అవలంబించటానికి ఆక్షేపణ వుండరాదు. అయినా ఈ దశాంశ పద్ధతికి మూలమైన "సున్న"ను గణిత శాస్త్రంలో రూపొందించినది భారతీయ శాస్త్రజ్ఞులే. తర్వాత బాగ్దాదుగుండా పాశ్చాత్యులు దాన్ని గ్రహించి అభివృద్ధి పరిచారు. దాన్నే తిరిగి మనం స్వీకరించటంలో తప్పేమీ లేదు.

ముఖ్యంగా ఈ మార్పు ఏ ఒక్క రాజకీయ పక్షంయొక్క ఆశయాలు సిద్ధాంతాల ననుసరించీ ప్రవేశపెట్టేది కాదు. విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని వర్ధమాన సమాజంలో త్వరలో సులువుగా వ్యాప్తి చెందునట్లు ఉపకరించటానికి ప్రవేశ పెట్టబోయే సక్రమ శాస్త్రాభివృద్ధి మానవసంఘాలలో, ప్రభుత్వాలు పార్టీలకంటె శాశ్వతమైనది. దానికై మనం సౌష్ఠవమైన పునాదులను నిర్మించుకోవాలి. వలసినంత సామగ్రిని సమకూర్చుకోవాలి. ఈ దశాంశ మెట్రిక్ విధానములు ఇట్టివే. దేశంలో కొంతకాలంగా వాడుకపడిన ఒక పద్ధతిని మార్చి నూతన విధానాన్ని ప్రవేశ పెట్టవలసి వచ్చినప్పుడు తాత్కాలికమైన కొన్ని అసౌకర్యాలకు ప్రజలు సిద్ధపడక తప్పదు. అంత మాత్రాన వీటికి వెరచి ఎంత వాంఛనీయమైనా సంస్కరణే కూడదనడం అభివృద్ధి కాముకుల లక్షణం కాదు. ఈ నూతన పద్ధతికి ప్రజలు ఎక్కువగా అలవాటుపడు నంతవరకూ ప్రభుత్వం సాధ్యమయినంత ప్రచారం యిచ్చి, సామాన్య ప్రజలు ఏ విధంగానూ కూడ నష్ట పోకుండా చూడాలి. నెహ్రూ అన్నట్లు 'రెలిటివిటీ' సిద్ధాంతాన్ని గాని మరే శాస్త్రీయ విధానాన్ని గాని ప్రజలందరినీ సంప్రతించి అవలంబించ నక్కరలేదు. (ఈ పద్ధతిని అవలంబించుటవలన దేశీయ విదేశీయ వాణిజ్య వ్యాపారములలో ఏవిధమైన ఆర్థికకష్టనష్టాలు కలుగవు ) విజ్ఞానరంగానికి అభివృద్ధి కార్యక్రమాలకు అనువుగా వున్న ఈ విధానాన్ని, త్వరలోనే మన మందరము అలవర్చుకోవాలి.

# కొనేవాడు

హితశ్రీ

**బి. ఏ.** పరీక్ష ఆఖరి పేపరు కూడా బాగా రాసిన తరవాత నెత్తిమీద కొన్ని టన్నుల బరువు తీసేసినట్టయి, కులాసాగా ఆ సాయంత్రం షికారుకి బయలుదేరిన రంగారావుకి బజారంతా కొత్తకొత్తగా కనిపించసాగింది. అధమం రోజుకోసారైనా బజారు మీదగా పోవటం అతని కలవాటే. కాని బజారువైపు పరకాయించి సావధానంగా, సావకాశంగా చూడటమనేది అతని జీవితంలో అదే మొదటిసారి. అంతకి ముందు సర్వకాల సర్వావస్థల్లో నీడలా వెంటపడి భయపెట్టే పరీక్షా పెనుభూతం అతనిని ఏ ఇతరవిషయాన్ని గురించీ సరిగా ఆలోచించనివ్వలేదు. ఆ తీరికా, కోరికా కూడా అతనికి ముందెప్పుడూ కలగలేదు. ఆరోజు రంగారావు కొత్తమనిషి. హుషారుగా నడుస్తూ కనిపించే ప్రతి దుకాణం బోర్డునీ, ఎదురయ్యే ప్రతిమనిషినీ సావకాశంగా పరిశీలించసాగాడు. రోడ్డుకి రెండువైపులా బారులుతీర్చిన అంగళ్లూ, వొచ్చేపోయే జనం, బళ్లహడావుడీ— ఇవన్నీ ఏవేవో ఆలోచనలు కలిగిస్తుంటే రంగారావుకి అంతా ఏమిటో తమాషాగా కనిపిస్తోంది.

వెల్‌కం - ఫాంటెన్.

సుస్వాగతం.

రంగురంగుల అద్దాల మీద ఆకర్షణీయంగా రాశారు. వెడితే! - టరమ్స్ క్యాష్.

నేడు రొక్కం! రేపు అరువు!

ఇదేమిటి ? ఊరికే కాదూ ? నవ్వుకున్నాడు రంగారావు. మరి స్వాగతం ఎందుకు? బుర్ర తడుముకుని ముందుకి నడిచాడు.

'బహుదూరపు బాటసారీ, ఇటు రావో ఒక్కసారీ' అని శ్రావ్యంగా ఎవరో పిలుస్తున్నారు— ఏదో హోటల్లోంచి. ఎందుకో? పోనీ, ఓసారి వెళ్ళి కనుక్కుంటే!

హోటల్ గడపదాకా వెళ్లాడు.

"పదార్థములు వెన్నకాచిన నేతితో తయారు. కాదని రుజువుచేసినచో రు 116 లు బహుమానం."

మంచిదే!

తగ్గింపు ధరలు.

ఇడ్లీ 0-1 6.

కాఫీ 0-1-6 ఇత్యాది. హోటల్ గడపలోనే బోర్డు. భేష్! ఇవి చూపటానికే కాబోలు. 'థాంక్స్' అనుకుని ముందుకి నడిచాడు రంగారావు. ఆహ్వానం వినిపిస్తూనే ఉంది. 'డబ్బుంటే' అని సవరణ ప్రతిపాదించాడు రంగారావు తన మనసులో.

మరెవరో దయచేయమంటున్నారు.

"నో, థాంక్స్!"

నవ్వుకుని నడక సాగించాడు రంగారావు.

ఓ రెండంతస్తుల మేడ. పిట్టగోడ మూడువైపులా రంగురంగుల అక్షరాలు రోడ్డుమీద పోయే జనంవైపు కళ్లు ఉరిమి చూస్తూ వాళ్ల చూపుల్ని నిర్బంధించి బలవంతాన పైకి లాగి 'సారీ' అన్నట్టుగా చూస్తూ, 'మరేం లేదు, ఇచ్చట మీ కేరకమైన పుస్తకములు కావలసినను దొరకును.' అని సమాచారం అందచేస్తున్నాయి.

సిటిజన్స్‌ది కాబోలు! ఇదేదో బాగానే ఉండేట్టుంది. ఎవరికి నచ్చింది వారు తీసుకోవచ్చునా? సిటిజన్స్ కిలాంటి సదుపాయం ఉండాలిసిందే!

"బై నాలెడ్జ్!"

విజ్ఞానం కొనండి.

కొనాలీ? సిటిజన్స్ సొంతం కాదూ?

నవ్వాపుకోలేక బయటికి నవ్వేశాడు రంగారావు. దగ్గరగా ఉన్న ఇద్దరు ముగ్గురు అతనివైపు వింతగా చూశారు. అతను గబగబ ముందుకి నడిచాడు.

మళ్ళీ ఏదో హోటల్. పెద్ద పెద్ద అక్షరాలతో రాశారు.

"మీ తృప్తే మా ఆశయం."

సంతోషం! అనుకున్నాడు రంగారావు.

"వెల స్వల్పం, ఫల మధికం"

ఫలితమంటే బాగుండును ఓసారి తను ఇక్కడ తిన్న పెసరట్టు తనచేత డాక్టర్ కి పది రూపాయలు ఫీజు ఇప్పించింది. చరచర ముందుకి సాగాడు రంగారావు.

"చెప్పు ల్లేకుండా పోతున్నారా? అయ్యో" అని పరామర్శించి "ప్రమాదం సుమా!" అని హెచ్చరిస్తోంది ఓ బోర్డ్. నిజమే. ఓసారి ఓ జోడు తన పాదాల్ని తెగకరిచి రెండు రోజులు ఇంట్లో మూల పడేసింది తనని. నవ్వొచ్చింది రంగారావుకి. ఎక్కడ చూసినా, ఎటు చూసినా ఈ ఆధునికఫలకాలు ఇంతింత అక్షరాలలో వికృతంగా కనిపిస్తున్నాయి. తను ఏదో క్లాసు చదివేరోజులు జ్ఞాపకం వొచ్చాయి రంగారావుకి. టీచర్ ఇచ్చిన లెక్కల్ని తాటికాయ ల్లాంటి అక్షరాలతో, అంకెలతో గబగబా రాసుకుని, నిమిషాలమీద ఇష్టం వచ్చినట్టు చేసేసి, టీచర్ దగ్గిరికి పరిగెత్తి ఆయన టేబిల్ మీద ఒకరి పుస్తకంమీద మరొకరు పోటీపెట్టి ఆయనకి ఊపిరాడకుండా "ముందు నా లెక్క చూడండి సార్" అని కుర్రాళ్లు గొడవ చెయ్యటం రంగారావుకి బాగా జ్ఞాపకం. ఈ బోర్డు లన్నీ చిన్నపిల్లల పలకల్లా కనిపించాయి అతనికి. నవ్వుకున్నాడు. యథాలాపంగా పక్కకి చూశాడు.

ఐడియల్ బుక్ స్టోర్స్—పక్కనే ఉంది.

బ్యూటిఫుల్ బుక్ షాప్ ఎదురుగా ఉంది.

ఈ అక్షరా లన్నీ—పచ్చవీ, ఎర్రవీ, తెల్లవీ—పరస్పరం ఎల్లప్పుడూ అనుమానంగా, ఈర్ష్యగా, కోపంగా చూసుకుంటూనే ఉంటాయి కాబోలు అనుకున్నాడు రంగారావు. ఆ షాపు యజమాని తనవైపు చూస్తున్నట్టు అనుమానం కలిగి ఆవైపు చూశాడతను. తనవైపే చూస్తున్నాడు. ఓసారి లోపలికి పోవాలనిపించింది అతనికి. కొంచెం తటపటాయించి పక్కకి చూశాడు. ఐడియల్ బుక్ స్టోర్స్ లో కుర్చీలో బల్ల ముందు కూచుని తనవైపు కొంచెం ముఖం చిట్లించినట్టుగా చూస్తున్నాడు—బహుశా ఆ షాపు యజమాని. రంగారావుకి ఎటు పోవటాని తోచక ముందుకి సాగిపోయాడు. ఓసారి వెనక్కి తిరిగి ఆ ఇద్దర్నీ చూడా లనిపించింది. కాని చూడలేదు.

ఎంపోరియంలూ, షాప్ లూ, హౌస్ లూ, కంపెనీలూ దాటిపోతున్నాయి.

వెరైటీ క్లాత్!

న్యూ వెరైటీ క్లాత్!

నియో మోడరన్ టెక్స్టైల్స్!

బ్యూటిఫుల్ పీస్ గుడ్స్!

స్వదేశీ!

సిల్క్!

రకరకాల్లో ప్రత్యేకత.

ప్రత్యేకత లన్నీ ప్రత్యేకంగా చూస్తున్నాడు రంగారావు, రోడ్డుమీదనించే. అతనికో విషయం హఠాత్తుగా తట్టింది. తనకిమల్లేనే ఇంకా ఎందరో అలాగే చూస్తున్నారు. పోతున్నారు. వాళ్ళేమను కుంటున్నారో! కొందరి కళ్ళల్లో ఆశలు ప్రతిఫలిస్తున్నాయి. కొందరి కళ్ళల్లో నిస్పృహ! ఖరీదైన వస్తువులుండే కొట్లవైపు చూసీ చూడగానే పొరపాటుగా తప్పుపని చేసినట్టు కొందరు వెంటనే కళ్లు పక్కకి తిప్పేసుకోటం చూసి రంగారావుకి ముల్లు గుచ్చుకున్నట్టయి వాళ్లవైపు జాలిగా చూశాడు. మరోవిషయం రంగారావుకి వెంటనే తట్టింది. అంగళ్లో యజమానులు రోడ్డుమీద పోయే జనంవైపు అర్థంకాని చూపులతో ఏమిటో వెతుక్కుంటున్నట్టుగా చూస్తున్నారు. చాలామంది జనం మాత్రం ఎవరి దారిన వాళ్ళు పోతున్నారు. ఇది అంత మర్యాదకరంగా తనకే కనిపించటం లేదు. ఇహ కొట్లయజమానులసంగతి చెప్పాలా? పిలిచిన పేరంటానికి పోకుండా ఉండకూడదు! ఆ భావ రంగారావు కర్థమౌతోంది. స్వాగతమండీ, స్వాగతం!! వినిపించుకోరేం, మర్యాదగా పిలుస్తుంటే! మీ తృప్తే మా ఆశయం. ఒకసారి దయచేసిన మీకే తెలియగలదు.

ఇదే దారి...అది కాదు.

ఇటు—ఇటు.

అటు కాదని వేరే చెప్పక్కర్లేదు. క్వాలిటీ అక్కర్లేదూ? రండి! రండి! ఓహోహో! రాజాధిరాజా, మార్తాండతేజా!

రంగారావుకి నవ్వొస్తోంది.

రాజాధిరాజా! మార్తాండతేజా!

'కుడి ఎడమున డాల్ కత్తులు మెరయగ
రాజు వెడలె రవితేజము లలరగ.'

రాజు వెడలె! ఎవరు రాజు!

నవ్వొచ్చింది రంగారావుకి. కాని వెంటనే అతని మనసులో చదువుల సరస్వతి ప్రత్యక్షమై జవాబిచ్చేసింది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో కొనేవాడే రాజు.

*'Under Capitalism consumer is the king.'*

రాజు! ఈ బజార్లో నడుస్తున్న జను లందరూ రాజులే. తనూ!

బలే నినాదం! బావుంది! అద్భుతం.

తను గుకాణం పెడితే ఇదే తన నినాదం. కాని వొద్దు...వొదు. చూస్తూ చూస్తూ రాజ్యం త్యజించటం సామాన్యమైన విషయం కాదు!

స్వేచ్ఛగా ఇష్టం వచ్చినట్టు సంచరిస్తున్న మనసుని అరికట్టి నడుస్తున్నాడు రంగారావు.

బ్యూటిఫుల్ టెక్స్టయిల్స్ గల తన మిత్రుడున్నాడు. తనకోసం — అంటే రంగారావుకోసం కాదు, కొనేవాడు రంగారావుకోసం — నిరీక్షిస్తుంటాడు. ఓసారి విజిట్ చెయ్యటం ధర్మం. ఆ షాపు పెద్దబిల్డింగులో ఓమూల ఉంది. అరడజను కొట్లు దాటి పోవాలి. నెమ్మదిగా ప్రతికొట్టూ పరిశీలిస్తూ నడుస్తున్నాడు రంగారావు.

"ఏం కావాలండీ?"

అందరూ ఆతృతగా అడుగుతున్నారు.

"ఏమీ వొద్దు."

ఒద్దనిపించుకోటంతో కొంచెం చిన్నతనం వేసి ముఖం పక్కకి తిప్పుకుంటున్నారు — షాపుల్లోవాళ్లు. తన మిత్రుడు ఖాళీగా కూర్చున్నాడు. "ఏం గుప్తా" అన్నాడు. అతను కొంచెం ఉలిక్కిపడ్డట్టుచూసి "ఏగోయ్" అన్నాడు. నిజానికి నిన్న కాక మొన్నే ఏవో షర్టింగులూ, కోటింగులూ తీసుకున్నాడు. మళ్ళీ ఇవాళే తనకేం అవసరం వొచ్చిందబ్బా అని ఆశ్చర్యపడుతున్నట్టున్నాడు అనుకున్నాడు రంగారావు.

"ఏం కావాలి?"

ఈ ప్రశ్న వినగానే రంగారావుకి వొళ్లు మండింది. అదేం ప్రశ్న? స్కూల్ ఫైనల్ దాకా కలిసి చదువుకున్నారు గదా! "ఏమిటి సంగతులు?" అని అడగకూడదూ? ఏం కావాలిసొస్తుంది తనకి ప్రతి రోజూ! మళ్లీ అడిగాడు గుప్త మర్యాదగా "ఏం కావాలి?" అని. వెంటనే రంగారావుకి తన రాజరికం జ్ఞాపకం వొచ్చింది. కాని ఏం అడగాలో తెలియలేదు. ఏమీ తోచక "చీర లున్నాయా?" అన్నాడు. "ఉన్నాయా?" అని అడగటమేమిటి, ఎదురుగా బీరువాల్లోంచి వందలకి వందలు కనిపిస్తుంటే! చీరలు అనేమాట వినేసరికి గుప్తకి కొంచెం ముఖం వికసించింది. ఫరవాలేదు — కాస్త గిరాకీ అన్నమాటే. అతనికా సంతోషం కలిగించినందుకు రంగారావుకీ సంతోషంగానే ఉంది. కాని...

"ఏం చీరలు కావాలి? బాంబేప్రింటెడ్, ఫారిన్ ప్రింటెడ్ వాయిల్స్, జార్జెట్, షిఫాన్, బెనారస్ సిల్కు, బెంగుళూరుసిల్కు, ఆర్గండీ, ఇమిటేషన్ ఆర్గండీ, క్రేప్" ఏవేమిటో చెప్పుకుపోతున్నాడు. రంగారావుకి పచ్చివెలక్కాయ నోట్లో పడ్డట్టయింది. తనికి పేర్లుకూడా సరిగా వినలేదింతవరకూ. ఏం చెప్పాలి? గుప్త చెప్పిన మొదటిపేరు జ్ఞాపకం పెట్టుకొని "బాంబే ప్రింటెడ్ చూపించు" అన్నాడు. అనటమే తడవుగా షాపులోని కుర్రాళ్లూ, గుప్తా కలిసి గబగబ బీరువా తలుపులు లాగేసి చీరలు పరిచెయ్యటం మొదలు పెట్టారు. రంగారావుకి అయోమయంగా ఉంది. ఊరుకున్నవాడు ఊరుకోక అనవసరంగా కావాలని చిక్కు తెచ్చుకున్నాడు. పాపం, శ్రమపడి అవన్నీ చూపెస్తుంటే, బెల్లంకొట్టిన రాయిలా అలా చూస్తూ నించోటం ఘోరం అనిపించి "అవన్నీ ఒద్దులే" అన్నాడు. కాని గుప్త ఆ మాట లేమాత్రం సరుకుచేయక, "ఫరవాలేదు లే చూడు," అన్నాడు. యంత్రంలా రంగారావు పరీక్షిస్తున్నట్టుగా ప్రతిచీరా స్పృశించి చూస్తున్నాడు. అతనికి ముచ్చెమటలు పడుతున్నాయి. చీరలు కుప్పలుకుప్పలుగా బల్లమీద పడుతున్నాయి. తను ఏదీ కొనబోవటంలేదు. "ఈ గుప్తకి తనకి

చీరలు కొనే అవసరం ఇంకా రాలేదనే విషయం తెలియదేం? వెధవ వ్యాపారం, వీడూ" అని విసుక్కున్నాడు. కొంపతీసి తనని బాగా ఎరిగినవాళ్లెవరైనా చూస్తే అంతే అంటూ! "పెళ్లి కాకుండానే నీకీ చీరల గొడవేమిటిరోయ్?" అని శకునిలా అనేశారంటే పరువు కాస్తా పోతుంది. గుప్త తనని ఎన్ని శాపనార్థాలు పెడతాడో, ఏదీ కొనకుండా పోతే.

"అంతగా నచ్చలేదు. వొస్తా" అని లేవబోయాడు రంగారావు. కాని గుప్త వదల్లేదు. ఇంకా ఏవేవో చూపెట్టున్నాడు. ఈసారి కాస్త వొళ్లుమండి, "ఎందుకురా? ఇవన్నీ చూపించక్కర్లేదు. వొచ్చిన ప్రతివాడికీ ఇంత శ్రమపడి మళ్లీ చచ్చినట్టు మడతలు పెట్టుకొంటావా ఏం?" అన్నాడు. గుప్త ఏమీ విసుక్కోక "మరి లేకపోతే అమ్మకం ఎలా జరుగుతుంది?" అన్నాడు. రంగారావు కొంచెం ఆశ్చర్యపడి "ఇలా రోజు కెన్నిసార్లు ఈ ప్రదర్శన జరుగుతుంది?" అన్నాడు.

"నీలాంటివాళ్లు ఎంతమంది వొస్తే అన్నిసార్లు"

"ఏమైనా దెబ్బకొట్టాడా?" అనుకున్నాడు రంగారావు.

"సరే ఇక వొస్తా."

"కొనకపోతే మానెయ్. అన్నీ చూసి పో" బలవంతం చేశాడు గుప్త. గుడ్లప్పగించి చూశాడు రంగారావు. ప్రదర్శనానంతరం "సారీ" అని మాత్రం అనేసి వెనక్కి తిరిగాడు.

"థాంక్యూ."

ఎదురుగా బోర్డు ఉంది.

రంగారావు ముఖం జేవురించింది.

ఓసారి వెనక్కి తిరిగి గుప్త ముఖం చూస్తే— రంగారావుకి సాహసం కలగలేదు. ఎన్ని తిట్టుకొంటున్నాడో! "థాంక్యూ!" అని గుప్త ఎద్దేవాగా అన్నట్టుగానే ఉంది అతనికి. కొట్టు దాటిరాగానే పక్క కొట్లవాళ్లు రంగారావు ప్రవర్తనని సి. ఐ. డీ. ల్లా కనిపెట్టి సమయంకోసం కాచుకు కూచున్నట్టుగా ఒకరి తరవాత ఒకరు "మంచి మంచి కొత్త వెరైటీ చీరలున్నాయి. చూస్తారా?" అని ఆదుర్దాగా అడిగసాగారు. రంగారావుకి కాళ్ళు వొణికాయి. ఇంకా కాసేపు అలా నిలబడితే బలవంతాన తడిసి లాక్కుపోయి తమ తమ నమూనాలు ప్రదర్శించి బాధించగలరని భయం వేసి గబగబ ముందుకి నడిచి బయటపడ్డాడు. తను వ్యాపారం పెడితే వస్త్రాలయం మాత్రం జన్మలో ప్రారంభించటం జరగదు.

మళ్లీ బోర్డులు—రకరకాలు.

జనరల్ స్టోర్స్!

ఫ్యాన్సీ స్టోర్స్!

రంగారావుకి ఏదో వెలితిగా కనిపించింది. ఆలోచించగా జ్ఞాపకం వొచ్చింది. అక్కడో ఫేమస్ ఫాన్సీ షాప్ ఉండాలి. ఏమయింది? కనిపించదేం? నిన్న కాక మొన్న చూశాడే! డేరా మేకు పీకేశాడన్న మాట. అసలే చిన్న షాపు. ఎవరూ కొనటం లేదు కాబోలు. రంగారావు వెంటనే ఇంకో విషయం కనిపెట్టాడు. మై ఫాన్సీ—విస్తరించింది. మొదట ఈ రెండు షాపులకీ మధ్య ఇంకేవో చిన్నచిన్నవి రెండు మూడు షాపు లుండేవి. వాటన్నిటిని క్రమంగా మై ఫాన్సీ—కబళించివేసింది. ఇప్పుడు ఫేమస్ షాప్ కూడా అదృశ్యం. 'ఇంతింతై వటుడింతయై..' అన్న పద్యపాదం స్ఫురణకి వచ్చింది రంగారావుకి. ఎవరో బాగుపడ్డందుకు సంతోషం. మూడు పువ్వులూ ఆరు కాయలూ, నిత్యకళ్యాణం పచ్చతోరణం. అదే కావలసింది. కాని ఎవరో బాగుపడలేకపోవటం దురదృష్టం. శోచనీయం. ఏమిటో ఆలోచిస్తూ ఆశ్చర్యంగా చూస్తూ కొట్టుముందు నుంచున్నాడతను.

రంగారావు వైఖరి చూసి కొట్టుయజమాని బిగ్గరగా ఓ కేక పెట్టాడు.

"ఏం కావాలండీ?"

రంగారావు పరిస్థితి గ్రహించి మాట్లాడకుండా ముందుకి వెడితే జనం తనవైపు ఆశ్చర్యంగా చూస్తారనీ, కొట్టుయజమాని నిరాశగా చూస్తాడనీ అనుమానించి కొట్లోకి వెళ్లాడు.

"ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి దర్శనభాగ్యం!" అన్నట్టు కొట్టు యజమాని చిరునవ్వుతో "ఏం కావాలండీ?" అని అతిమర్యాదగా అడిగాడు. రంగారావుకి తన రాజరికం వెంటనే స్ఫురించగా కొంచెం దర్జాగా కొట్టు నాలుగుమూలలూ చూసి "షాపు పెద్దది చేశారే!" అని మెచ్చుకుంటున్నట్టుగా అన్నాడు.

ఆయన నవ్వి "తక్కువ లాభం, ఎక్కువ అమ్మకం. అదే మా లక్ష్యం, మా పాలసీ. అందుకే మీలాంటి వాళ్లు మా కొట్టుకి రావటం." అన్నాడు. రంగారావు మనసులో "మా తృప్తే మీ ఆశయం" అనుకున్నాడు.

"మీకేం కావాలి?"

ఏం అడగాలో రంగారావుకి తోచలేదు. తనకేమీ అక్కర్లేదు.

"ప్రస్తుతం ఏమీ వొద్దులెండి. ఊరికే చూసి పోదామని వొచ్చాను." అనాలనుకున్నాడు, గాని అలా అంటే ముందు తనని లక్ష్యపెట్టడేమోనని "టాయిలెట్ సామగ్రి ధరలెలా ఉన్నాయి?" అన్నాడు.

ఆ షాపు యజమాని వెనువెంటనే తడుముకోకుండా అనర్గళంగా టకటక చెప్పేస్తున్నాడు. ఒక్కొక్క వస్తువూ, ఆ వస్తువు తను ఎంత ధరకమ్ముతున్నదీ, ఇతరులెలా అమ్ముతున్నదీ, కావాలంటే కనుక్కోవచ్చునని అభయం కూడా ఇస్తున్నాడు.

రంగారావు మాత్రం ఆశ్చర్యంగా అతనివైపు చూడసాగాడు. అతని అద్భుతధారణశక్తి అతనికి దిగ్భ్రమ గొల్పుతోంది. తనకొట్లో అమ్మే ధరలే కాక ఇతరులవి కూడా అద్భుతంగా జ్ఞాపకం ఉంచుకుని లిస్టుల సహాయం ఏమాత్రం లేకనే టకటక వరస క్రమంగా చెప్పేయటం చూస్తే, ఈ మానవుడు కాలేజీ చదువు కొనసాగిస్తే యూనివర్సిటీ ఫస్టు మాత్రమే కాక రికార్డులు పగలకొట్టించేవాడని కూడా నిస్సందేహంగా చెప్పొచ్చు అనిపించింది రంగారావుకి. కాని ఆ ఆశ్చర్యం క్రమంగా భయంలోకి దిగింది. ఇంత విని తుస్సున వెళ్ళిపోతే అనర్గళంగా శాపనార్థాలు ఒక్కుమ్మడిగా రావొచ్చు. అయితే అదృష్టవశాత్తూ, ఆ యజమాని ఓ చిన్న పొరపాటు చేశాడు. కావాలిస్తే ఇతరచోట్ల ధరలు విచారించి తన ధరలు తక్కువగా ఉంటేనే కొనొచ్చునన్నాడు. ఈ అవకాశం వెంటనే సద్వినియోగం చేసుకుని "విచారించి వొస్తాన్లెండి" అనేసి అప్పటి అవస్థనించి తప్పించుకున్నాడు. ఎదురుగా ఉన్న ఫాన్సీకొట్ల యజమానుల కళ్లన్నీ రంగారావుని వెంబడించాయి. రంగారావుకి కొద్దిగా భయం వేసి గబగబ నడిచాడు.

మందులు! మెడికల్ లైన్!

ఇంగ్లీషుమందులు, ఆయుర్వేదౌషధాలు హోమియోమందులు వరసగా బీరువాల్లోంచి సీసాలు తొంగి చూస్తున్నాయి.

రంగారావు భయంగా ఆ తెల్లటి అక్షరాల వైపూ, సీసాలవైపూ, ఆ కొట్లయజమానులవైపూ చూశాడు. మెడికల్ షాపుల్ని చూస్తే వాసనా ప్రార్వకమైన అనోభయం అతనికి చిన్నప్పటినించీ. మందుల వాళ్లు కంపెనీల యజమాన్లు-జనంవైపు చూస్తూ ఖాళీగా కూచోటం ఎల్లప్పుడూ వాంఛనీయం అనుకున్నాడు రంగారావు, భయగ్రస్తుడై. తనవైపు ఎవరో దుకాణదారుడు చూస్తున్నాడు. తన చేతిలో చీటీ ఏమీ లేదు అదృష్టవశాత్తూ. గాడ్ ఫర్ బిడ్! మందు లెక్కువైతే మరణా లెక్కువ అని ఓ మిత్రుడు చమత్కరించాడు అమ్మయ్య. 'కాదు అప్పులెక్కువైతే' అని తను సవరించాడు చమత్కారంగా. ఎవరికో కీడు జరిగి మందుల అమ్మకం—కావాలని వాంఛించకపోయినా—వృద్ధికావటం ఘోరం అనిపించిందతనికి. ముందు కీడు జరిగితేనే తరవాత మందులు కొనటం జరుగుతుందని రంగారావు ఆ క్షణంలో ఆలోచించటానికి సిద్ధంగా లేడు. డబ్బిచ్చి పెట్టుబడిమీద లాభాలు ఊరికే తీసుకోమన్నా తను మందుల షాపుమాత్రం కలలో కూడా పెట్టడు! రంగారావు నడుస్తూనే ఉన్నాడు.

కొత్త కొత్త సంగతులు — ఇదివరకెప్పుడూ సూచనగానైనా తను అనుకోనివి—ఎన్నో అనుభవానికి వొస్తున్నాయి.

ప్రకటనలు...

ధరలు...

తగ్గింపు రేట్లు...

అంతకంటే తగ్గింపు రేట్లు.

ఇటు చూడండి...ఇటు—ఈ ఆకర్షణలు...

అటు కాదు.. ఇటు.. ఇటు.

మీరెక్కడ కొనాలో ఏం కొనాలో మీకు తెలియదు...మా సలహా పొందండి. సలహా ఉచితం. వస్తువు కొంటే రేపరు ఉచితం. మీకై ప్రత్యేకం.

రంగారావు తల తిరుగుతోంది.

పోటీ—పోటీ—పోటీ.

ఎక్కడ చూసినా పోటీ—ఎటు చూసినా పోటీ.

# కొనేవాడు

కొనేవాడే రాజు. మహారాజు.

కొనే మహారాజులు. స్వాగతం. సుస్వాగతం.

కొన్నంతసేపూ రాజరికం

కొననంతసేపూ బిచ్చరికం—కనీసం కొట్ల యజమానుల దృష్టిలో.

తను అక్కర్లేనివి అనవసరంగా బేరం చేశాడు. బేరం చేస్తున్నంతసేపూ తీవి వెనక్కి తిరిగితే—"థాంక్యూ!". రంగారావుకి అపహాస్యంగా గుప్త థాంక్యూ అన్నట్టనిపించింది.

అవును, మరి. కొనేవాడే రాజు. డబ్బిచ్చేవాడే మహారాజు. చిరునవ్వుతో ప్రతిఫలంగా కృతజ్ఞతాభివందనాలు. ఎంత నిరీక్షణ! ఎంత ఆశ! ఎన్ని ఆకర్షణలు!

రోడ్డుమీద జనం నడుస్తున్నారు. నడుస్తున్న జనాన్ని చూసి దుకాణదారులు ఆశపడుతున్నారు. జనం ఆశగా వస్తువులవైపు చూస్తున్నారు. తీసుకోమని బతిమాలుతున్నట్టుగా యజమానులు కళ్లతో వాళ్ళని పలకరిస్తున్నారు. ఒకేఒక్క వస్తువు ఇద్దర్నీ-ఇరుపక్షాలవాళ్ళనీ—అడ్డగిస్తోంది. డబ్బు! 'వెధవ డబ్బు' అనుకున్నాడు రంగారావు. గవర్నమెంటు ముద్రకొట్టించి పారెయ్యకూడదూ? వెంటనే నవ్వొచ్చింది రంగారావుకి. తన ఆర్థికశాస్త్రవిజ్ఞానమంతా ఏమయినట్టు? పరీక్షలో ఏకరువు పెట్టిన ద్రవ్యోల్బణ ప్రమాదాలన్నీ గుర్తుకొస్తున్నాయి. అవన్నీ జ్ఞాపకం చేసుకుని మళ్ళీ ఆ నరకయాతన అనుభవించటానికి అతను సిద్ధంగా లేడు. కాని అతని మనసులో ఏదో బాధగా ఉంది. పోనీ, ఉన్నవన్నీ తలా కాసినీ పంచుకోకూడదూ? పంచుకుంటే ప్రతివాడికీ దక్కేది ఏమిటో తనకి తెలియకపోలేదు. ఉత్పత్తి! ఉత్పత్తి ఎక్కువ కావాలి. అందాకా ఏంచేసేట్టు! ఉన్నదేదో ఎంత కొద్దిఅయినా అందరూ పంచుకోటమే న్యాయమనిపిస్తోంది రంగారావుకి. అవన్నీ చిక్కువిషయాలు. ప్రస్తుతం తను అవన్నీ ఆలోచించే స్థితిలో లేడు. మనసు తిప్పుకున్నాడు రంగారావు.

కొనేవాళ్లు బేరాలు చేస్తున్నారు.

తనలాంటి కొనేవాళ్లు కాదుగదా!

తను దుకాణదారుడైతే!

రంగారావుకి ముచ్చెమటలు పట్టాయి. తనవల్ల కాదు. వొచ్చిన ప్రతివాడికీ ఓ నమస్కారం పెట్టేసి వొదిలించుకుంటాడు. అలా అయితే అమ్మకం జరగదు. అమ్మకం జరక్కపోతే డబ్బు రాదు. డబ్బురాకపోతే—? తన రాజరికం నశిస్తుంది.

అకస్మాత్తుగా రంగారావుకి ఓ ఆలోచన కలిగింది. దుకాణదారులూ కొనేవాళ్లే. ప్రపంచంలో ప్రతి మనిషీ కొనేవాడే.

పెట్టుబడిదారీవ్యవస్థలో ప్రతివాడికీ రాజయోగం ఉంది. రాజయోగం! అందుకోసమే ఈ నిరీక్షణ. ఈ వేడికోలు. ఈ ఆశ!

"రండి రండి రాజులూ, కొనండి, కొనండి." అంటున్నారు యజమానులు.

ఏమిటో సర్వం హాస్యాస్పదంగా కనిపించింది రంగారావుకి ఒక్కక్షణం.

ఆలోచిస్తూ నడుస్తూనే ఉన్నాడు రంగారావు.

ఎవరో కాఫీహోటల్ ముందు తచ్చాడుతున్నారు. ఎవరు? ఓ తనకి తెలిసినవాడే. ఎలిమెంటరీ స్కూల్ టీచర్. ఏమిటి ఆలోచిస్తున్నాడు? కాఫీ తాగుదామా వద్దా అని కాబోలు. 'కొనవయ్యా అరకప్పు కాఫీ' అని హోటల్ యజమానితరఫున రంగారావు మనసులో విసుక్కున్నాడు. కాని ఆ టీచర్ కాసేపు అలాగే సంకోచించి, చివరికి ఎదురుగా ఉన్న మల్లెపూల అంగడిలో ఓ బేడా పువ్వులు తీసుకుని వెనక్కి వెళ్లిపోయాడు. రంగారావుకి హృదయంలో కలుక్కుమంది. పాపం! డబ్బులేవు కాబోలు. భార్య గడుసుదై ఉండాలి. మాట జవదాటటానికి జడిసిఉంటాడు. తనో అరకప్పు కాఫీ ఇప్పిస్తే బావుండేది! పాపం!

ఆలోచనలతో నిండిన రంగారావుమనసుని మరో దృశ్యం తనవైపు లాక్కుంది. ఎన్. జి. ఓ అని చెప్పకనే చెబుతున్న వాలకంగల ఓ పెద్దమనిషి చిన్నపిల్లవాడిని నెమ్మదిగా నడిపించుకుంటూ ఓ దుకాణం దగ్గిర ఆగి అరప్యాకెట్ 'సిజర్' సిగరెట్లు అడిగాడు కాని ఇంతలో ఆ పిల్లవాడేదో కావాలని చెయ్యిపెట్టి చూపిస్తూ మారాం చెయ్యసాగాడు. ఆ ఎన్. జి. ఓ ఒక్కక్షణం తటపటాయించి జేబులు తడుముకుని చిన్న నవ్వుతెచ్చుకుని సిగరెట్లు అక్కర్లేదని చాక్లెట్లు తీసుకుని పిల్లవాడి చేతిలో పెట్టి,

చుట్టూ జనం ఉన్నారని కూడా సంశయించకుండా వాడిని హృదయాని కదుముకుని ముందుకి సాగిపోయాడు.

రంగారావు ఒక్క క్షణం తెలెక్కడున్నాడో మర్చిపోయి రోడ్డుమధ్యగా కదలకుండా నిలబడ్డాడు. ఇంతలో పోలీస్‌విజిల్ విని తేరుకుని ఆ దృశ్యం జ్ఞాపకం చేసుకోసాగాడు. అతని హృదయంలో ఏదో వేదన మెదిలింది. పాపం, సిగరెట్ గత్రప్రాణి అయి ఉండీ అవి లేక నే వెళ్లిపోయాడు. సిగరెట్లో, చాక్‌లెట్లో—అదే అతని తక్షణ సమస్య. ఏం చేస్తాడు, పాపం! మనసులో నే ఎన్. జి. ఓ. కి సానుభూతి అందజేశాడు రంగారావు.

ఆ విషయంగురించి ఎక్కువసేపు ఆలోచించాలిసిన అవస్థ రంగారావుకి తప్పిపోయింది. నాలుగడుగులు వెయ్యగానే మరో విశేషం అతని దృష్టిని ఆకర్షించింది. అప్పుడే అంగడిలో అడుగుపెట్టి ఓ పెద్ద మనిషి చేతిలో ప్యాకెట్ విప్పి బల్లమీద పడేస్తూ "ప్రస్తుతం చీర అవసరం లేదులెండి. ధోవతులు చూపించండి." అంటున్నాడు. చీరలు అమ్మినవి వాపసు తీసుకోవటం కొట్టు యజమానికి కొత్త కాకపోయినా ప్రస్తుత పరిస్థితి అతని కేదో కొంచెం వింతగా కనిపించినట్టుంది; కొంచెం ఆశ్చర్యంగా చూసి ఏమీ మాట్లాడకుండా నే ధోవతులు చూపించసాగాడు. ఐతే రంగారావుకి మాత్రం అదేమీ విషమ సమస్యగా కనిపించలేదు. ఆ పెద్దమనిషి కట్టుకున్న ధోవతి అనబడేది ఆ సమస్యని త్వరితంగా నే పరిష్కరించింది. ఆయన శ్రీమతి కేదో పురస్కారం ఏదో సందర్భాన ఇవ్వాలని ప్రయత్నించి ఆర్థికస్థితి అందుబాటులో లేక కాలం కలిసిరానందువల్ల అవసరాలు వాయిదా వెయ్యలేకపోయాడు. 'పాపం' అనుకున్నాడు రంగారావు.

అవసరాలు వాయిదా పడవు.

'నిజం, నిజం' అనుకున్నాడు రంగారావు.

అందరూ సుఖపడితే బాగుండును.

"సర్వేజనా స్సుఖినో భవంతు!"

"తథాస్తు" అనుకున్నాడు రంగారావు.

"సుఖదుఃఖాలు కావడికుండలు" అని జ్ఞాపకం వొచ్చిం దతనికి. "అంతేలే." అనుకున్నాడు. తనకి కొంచెం వేదాంతం అబ్బుతోంది. చిన్నగా నవ్వుకుని జనప్రవాహాన్ని దాటుకుంటూ నడుస్తున్నాడు రంగారావు.

ఒక్కసారిగా రంగారావుహృదయం ఝల్లుమంది. కళ్లు జిగేల్ మన్నాయి మెరుపు మెరిసినట్టయింది.

"ఖటావ్ వాయిల్స్."

ఓ అందమైన అమ్మాయి అందంగా చీరకట్టుకుని నిలబడ్డది నాజూకుగా, వొయ్యారంగా.

అది బొమ్మే! కేవలం రంగులకలయికే నని రంగారావు వెంటనే నమ్మినా నమ్మలేకపోయాడు. ఆ బొమ్మని అతను చూడటం అదిమొదటిసారి ఎంత మాత్రం కాదు. ఎన్నోసార్లు; చెప్పటం కేలిక కాదు. అయినా ఆరోజు అది అతనికి ఎంతో కొత్తగా, తాజాగా, అందంగా, సజీవంగా, ఇంకా ఇంకా ఏమిటోగా కనిపించసాగింది.

ఆ చీర ఎంత బావుంది! చీర బావుందా? ఆమె కట్టుకోటంలోని నాజూకుదనం బావుందా? లేక ఆమె - ఆ బొమ్మ అందమే చీర బావుందనిపిస్తోందా? చీర ఎలా కట్టుకుంటారో కూడా రంగారావుకి అక్షణందాకా కూడా తెలియదు. ఆ మెలుకువ లన్నీ చూస్తుంటే ఇన్నాళ్ళనించీ తను ఆ సుందరదృశ్యాన్ని ఎలా చూడలేకపోయాడో రంగారావుకి అవగతం కావటంలేదు. చూసినకొద్దీ తనకి చూడాలనిపిస్తోంది. ఆ చిత్రకారు డెవరో గొప్పవాడు. జీవకళ ఉట్టిపడుతోంది.

రంగారావులో ఏదో మార్పుకలిగింది. తనలో ఏదో మార్పు కలిగిందని రంగారావుకి తెలిసీ తెలియదు. ఏదో ఆనందంగా ఉంది.

అలా తన్మయత్వంతో చూస్తున్న రంగారావుకి అకస్మాత్తుగా అనిపించింది - తన నా స్థితిలో ఎవరైనా చూస్తే బావుండదు. తెలియనివాళ్లయితే నవ్వుకుంటారు. తెలిసినవాళ్లయితే ఏడిపిస్తారు. సజీవంగా నడిచే అందమైన అమ్మాయిల్ని తను ఇదివరలో చూడకపోలేదు. చిత్తచాంచల్యం తాత్కాలికంగా కలగక పోలేదు. కాని ఇప్పుడదేదో భావం హృదయంలో కలుగుతోంది. అదే భావంతో హృదయం నిండి పోతోంది. ఏదో రసవాహిని ప్రవహిస్తోంది. వాయిల్ చీర బావుంటుంది కాబోలు!

# కొనేవాడు

కాని గుప్త కొట్లో చూస్తే తనకేం నచ్చినట్టు లేదే! తమకేమ నెలవులు దప్పిన—! అనవసరంగా తను అక్కర్లేని బేరాలు చేశాడు. గుప్త ఏమనుకు

అకస్మాత్తుగా రంగారావుమనసులో మెరుపులా ఓ ఆలోచన మెరిసింది.

తనూ ఎప్పుడో కొనాలి! కొంటాడు- చీరలు. రంగారావు హృదయం పరవశించింది. ఆ ప్రణయ బహుమానాలు మనసులో మెదుల్తున్నాయి. ఆనంద తరంగాల్లో తేలిపోతూ అతను ముందుకు నడిచాడు.

నవరత్నాలు రాలేలా నవ్వుతూ పసిపాప పలకరించింది ఎదురుగా కాన్వాస్ మీద తీరిగ్గా కూచుని. జల్లుమంది రంగారావు హృదయం, రెండోసారి రెండో మాదిరిగా. ఆ బోసినోటితో నవ్వే పసిపాప పక్కన ఉన్న అక్షరాలు చదివాడు రంగారావు.

“అమ్మా నీకు తెలిసియుండలేదా?” ఏమిటది? ఆ చిన్న నోటిలో చిన్ని పలువరుస వస్తోంది కాబోలు రంగారావు హృదయం ప్రఫుల్లితమైంది. హృదయంలో ఏదో ఆవేశం ఉబికింది. పక్కనే ఉన్న ఆటవస్తువుల వైపు కోరికగా చూశాడు. ఆ క్షణంలో తన్ను తాను మర్చిపోయిన రంగారావు ఇంచుమించు ఆ ఆటవస్తువుల్లో ఏదో కొనబోయి ఠకీమని తన్ను తాను తెలుసుకుని ఆగిపోయాడు. ఆ పసిపాప చేతిలో ఏదో పెట్టాలని ప్రబలంగా అనిపించింది. ఆ ఊహకి అతనికి నవ్వు రాకపోలేదు.

తనూ కొనాలి; కొంటాడు — ఆటవస్తువులూ, అవీ ఇవీ.

ఏవి?

ఆలోచిస్తున్నాడు రంగారావు.

చీరలూ, (రకరకాలవి)

ఫ్యాన్సీసామాన్లూ, టాయిలెట్ సామగ్రీ, (కొత్త కొత్తవి) నగలూ, (మంచిమంచివి)

ఆటవస్తువులూ, చాక్‌లెట్లూ ఇంకా, ఇంకా ఎన్నెన్నో...

మందులూ, మందులు!!

భయంవేసింది రంగారావుకి. గబగబ ముందుకి నడిచాడు ఆ ఆలోచన మర్చిపోవాలని ప్రయత్నిస్తూ.

ఓ పెద్ద కాన్వాస్ మీద ఓ కుటుంబం.

యజమాని చేతిలో ఇన్సురెన్స్ పాలిసీ.

“మీ కుటుంబం మీపై ఆధారపడియున్నది.”

జీవిత భీమా!

జీవితం! భీమా!

మధురమైన ఆలోచనలన్నీ ఉప్పొంగి కాన్వాస్‌కి కొట్టుకుని శిథిలమయాయి.

భయపెడుతోంది కాన్వాస్. జీవితం!

కొనుక్కోండి పాలిసీ.

కొనేవాడే రాజు. మగ మహారాజు. కొని ఇచ్చేవాడు. అన్నీ కొని తెచ్చేవాడు.

చుట్టూ తిరిగి రంగారావు ఆలోచనలన్నీ మొదటికొచ్చాయి. మళ్ళీ జనంవైపూ, కొట్లవైపూ విచిత్రంగా చూడసాగాడు రంగారావు. ఆగిపోయిన వీణానాదపు ప్రతిధ్వని ఇంకా ఆగిపోలేదు. అది అస్పష్టంగా నేపథ్యంలో వినిపిస్తుండగా రంగారావు అప్పుడప్పుడు తాళంవేస్తూ ముందుముందుకి పోతున్నాడు.

ఎవరో పాడుతున్నారు, వేలంపాట. జనం చుట్టూ మూగారు. వేలంవేసే ఆసామీ హడావిడి చేస్తున్నాడు.

“పది రూపాయలు...పది రూపాయలు...... రెండూ...రెండూ! మంచి తరుణం. ఆలోచించుకోండి. మించిపోవును పది రూపాయలు. రెండు....”

రంగారావు జనంలో జొరబడ్డాడు. పక్కనే ఓ ముసలాయన ఆదుర్దాగా డబ్బు లెక్క చూసుకుంటున్నాడు. ఎన్నిసార్లు చూసుకుంటున్నా అంతే వొస్తోంది కాబోలు; మళ్ళీ మళ్ళీ చూసుకుంటున్నాడు. మధ్యమధ్య వేలంవేసే ఆసామీవైపు చూస్తున్నాడు.

“బంగారంలాంటి సరుకు. షిఫాన్ సిల్కు. అతి చౌక. కారు చౌకగా పోతోంది. తరవాత విచారిస్తే లాభం లేదు. పది రూపాయలు...రెండూ.... రెండూ.”

ముసలాయన నిస్పృహగా నుంచున్నాడు. ఆయన ముఖంలో దైన్యం తాండవిస్తోంది. రంగారావు చూశాడు ఆ ముఖకవళికలు. పాపం! డబ్బు తక్కువైనట్టుంది. కూతురికి కొని పెట్టాలని ఉబలాట

పడుతున్నట్టున్నాడు. పేదవాడని వేరే చెప్పాలిసిన పనిలేదు. ముమ్మూర్తులా కుచేలుడే. అవతల ఆసామీ ఎవరో హుషారుగా ఉన్నాడు. రంగారావుకి ఆ ఉత్సాహం చూసి వొళ్లు మండింది. ముసలాయన్ని పలకరించాడు.

"ఆ చీర కొంటా రేమిటి?"

ఆయన నిరాశగా "ప్చ్" అన్నాడు.

"పాడినట్టున్నారు."

"మన తాహతుకు దాటిపోయింది."

పది రూపాయలకి పాట పెంచిన ఆసామీ వీళ్ళిద్దరివైపూ చూస్తున్నాడు. ఆ చూపుల్లో ఏదో ఎగతాళి కనిపించింది రంగారావుకి. యువకరక్తం పొంగింది. కొనేవాడు మహా! ఎంగుకా డాబు! ఎందు కేమిటి! కొనేవాడే రాజు! రాజు!

ఉన్నట్టుండి రంగారావు అరిచాడు. "పన్నెండు."

వేలంఆసామీ హుషారుగా కేకేశాడు. "పన్నెండు...రెండు...రెండు. క్లియరెన్స్ సేల్— చౌక చౌక...రెండూ."

అవతల ఆసామీ తెల్లబోయాడు. తటపటాయించాడు. ఏదో అనబోయాడు. సంకోచించి ఆగాడు. మళ్ళీ ఏదో ప్రయత్నించసాగాడు. "రెండూ, రెండూ....మూడూ! తీసుకోండి."

కాలహరణం సహించని వేలంఆసామీ పన్నెండుకి పాట ఫైసల్ చేశాడు. రంగారావు గర్వంగా చూశాడు. కొనేవాడు రంగారావు!

అయితే ఆ ఉత్సాహం విసురుగా చేతుల్లో చీర పడగానే ఒక్కసారిగా అణగారింది. తనేం చేశాడు! పన్నెండు రూపాయలు! తనేం చేసుకుంటాడు చీర? ఏం చేయాలని పాట పాడాడో అంతరాంతరాలు చెప్పినా రంగారావుకి ఏదోగా ఉంది. తెగించి డబ్బు అవతల పారేసి ముసలాయనతో జనంలోంచి బయటికొచ్చాడు. ముసలాయన దృష్టి అంతా చీరమీదే ఉంది

"మీ రెంతవరకూ పాడారు?"

"ఎనిమిది"

"ఆ ఎనిమిది రూపాయలూ ఇచ్చి, ఈ చీర తీసుకుంటారా!"

ముసలాయన ఆశ్చర్యంగా చూశాడు.

"ఎందుకు? మీకు అక్కర్లేదా?"

"నాకెందుకు? బ్రహ్మచారిని."

"అయితే ఎందుకు పాడారు?"

"చెప్పలేను." నిజంగా నే అలా అనిపించింది రంగారావుకి.

"చిత్రంగా మాట్లాడుతున్నారే."

"చిత్ర మేమీ లేదు."

"చూస్తూ చూస్తూ నాలుగు రూపాయలు నష్టపడేవాళ్ళని నే నెక్కడా చూడలేదు."

"నన్ను చూశారుగా."

"అందుకే ఆశ్చర్యంగా ఉంది."

"మనుషులు ఆశ్చర్యకరంగానే ప్రవర్తిస్తారు. ఓవిధంగా నేనూ ఆశ్చర్యపడుతూనే ఉన్నాను."

"మీరు కేవలం నాకు సహాయం చెయ్యాలనే ఉద్దేశంతో వేలం పాడినట్టున్నారు."

"నా కంత ఔదార్యం ఉందని నే ననుకోను. ఆలోచిస్తే ఇలా చేసేవాడిని కాదేమో. కాని మనం అన్నీ పనులూ ఆలోచించి చెయ్యం చూడండి."

"మీరు తమాషాగా మాట్లాడుతున్నారు."

"జరిగింది కొంచెం తమాషాగా ఉన్నమాట వాస్తవమే. ఐతే ఇవాళ నేను చాలా మంచి 'మూడ్'లో ఉన్నాలెండి. ఇవాళే పరీక్షలైనాయి. అదీ కారణం."

ముసలాయన కొంచెం నవ్వాడు. రంగారావు వ్యవహారంలోకి దింపాడు. ఆయన మొహమాట పడ్డాడు. తీసుకోకపోతే తనకి నాలుగు రూపాయలే కాక పన్నెండూ దండగేనని రంగారావు నచ్చచెప్పిం తరవాత ఆయన తప్పనిసరిగా తీసుకున్నాడు. ఆ చీర తీసుకుంటున్నప్పుడు ఆయన సంతోషం అంతా ఇంతా కాదు. ఆ సంతోషం చూసి రంగారావు కూడా హృదయపూర్వకంగా సంతోషించాడు— లోలోపల కొంత బెంగగా ఉన్నా. తను నాలుగు రూపాయలు పోగొట్టుకున్నాడు. కాని అది సద్వినియోగం అయినట్టే నని సమాధానపరుచుకున్నాడు.

"మీ సహాయం మర్చిపోలేను. అమ్మాయికి ఒక్క మంచిచీర కొనిపెట్టాలని ఎన్నాళ్ళనించో

ఎంతో ప్రయత్నించాను. కాని సాధ్యంకాలేదు. ఇవాళేదో అదృష్టవశాత్తూ చవగ్గా వొస్తుందని ఆశ పడితే అది కాస్తా అడియాస అయే సమయంలో మీరు సహాయంచేశారు."

"ఇదికూడా ఓ గొప్ప సహాయంలా మాట్లాడ కండి."

"ఎందుకు కాదు? ముక్కూ మొహం ఎరగని వాడికి ఎవరైనా ఇలా తోడుపడతారా? మీ అడ్రస్ చెప్పండి. ఈసారి ఫస్ట్ తారీకున మీ నాలుగు రూపా యలూ ఇచ్చేస్తాను."

"అబ్బే, ఎందుకులెండి. నేను అప్పుగా ఇవ్వ లేదుగా. మారుబేరాని కిచ్చేశాను అంతే."

"ఇంత మంచి హృదయంగలవాడివి, నీ పేరే మిటి నాయనా?"

ఇలా అకస్మాత్ గా ఏకవచనంలో పిలిచేసరికి రంగారావు కొంచెం తికమకపడ్డాడు. ఆ సంబోధన లోని ఆర్ద్రత, స్వరంలోని కంపనం అతన్ని కొంచెం కలవరపెట్టాయి.

"ఏకవచనంలో పిలిచానని ఏమీ అనుకోకు. తండ్రిలాంటివాడిని, బహువచనంలో సంబోధించి గౌరవిస్తే ఆయు క్షీణం అంటారు."

రంగారావు హృదయం కరిగింది.

"మీ ఇష్టంవొచ్చినట్టు పిలవొచ్చు. నా పేరు రంగారావు."

"సంతోషం. ఏం చేస్తున్నావు నాయనా?"

"చెప్పాను కదూ? బి. ఏ. పరీక్ష ఆఖరి పేపరు ఇవాళే రాశాను."

"సంతోషం, బాబూ. తప్పక ప్యాసవుతావు. నీలాంటి సహృదయుల్ని నే నెంతోమందిని చూడ లేదు. జీవితంలో నీలాంటివారి అండదండలే ఉంటే ఇన్ని కష్టా లనుభవించేవాడిని కాదేమో."

రంగారావు ఆసక్తిగా అడిగాడు. "జీవితంలో చాలా ఇబ్బందులు పడ్డట్టున్నారు."

ఆయన చిన్నగా నవ్వాడు. "అవును కాని వాటినిగురించి నే నెప్పుడూ విచారించను. అయిన వాళ్ళని కాదని, లోకాన్ని ఎదిరించి వర్ణాంతరం, అందులో వితంతువివాహం చేసుకోకపోతే ఇన్ని కష్టాలు ఉండేవికావేమో. కాని తృప్తి కూడా ఉండేదికాదు. నాకు జీవితంలో ఇప్పుడు మిగిలిం దల్లా అదొక్కటే సుఖమే. ఇప్పుడు అమ్మాయి తప్ప నా అనేవాళ్లెవరూ నాకు లేరు. పిచ్చిపిల్ల."

ముసలాయన విషాదంగా, ముసిముసిగా నవ్వు కోటం ఎందుకో రంగారావుకి సరిగా అర్థంకాలేదు.

"నేనంటే ఎంత ప్రేమ! నేను సాయంత్రం బడినించి—నేను ఎలిమెంటరీ స్కూల్ టీచర్ నిలే నాయనా; వేషంమాసి కనిపెట్టేఉంటావు—ఏం చెబుతున్నానూ? ఆఁ... నేను బడినించి వొచ్చేదాకా తను కూడా కాఫీ తాగకుండా నాకోసం చూస్తూనే ఉంటుంది. పాపం, ఇవాళ ఎంతో ఆలస్యమైంది. నాలుగింటికే పోయేవాడిని. ఆపనీ ఈపనీ తగిలి ఆగి పోయాను. ఇంతలో ఈ వేలంవెర్రిలో పడ్డాను. షిఫాన్ సిల్కు! పిచ్చిపిల్ల ఎంత సంతోషిస్తుందో! డబ్బే ఉంటే! ఎందుకులే. ప్చ్. అమ్మాయివేదిగులు."

రానురాను ఆయన అర్ధస్వగతంగా మాట్లాడ టంతో రంగారావు సంభాషణలో ఏమీ కలగచేసు కోకుండా ఊరికే వినసాగాడు. సంజచీకటి పడు తోంది. ముసలాయన ఓ చిన్న పూరింటి గుమ్మం ముందు ఆగి 'ఓసారి లోపలికొచ్చి కూచుని పో బాబూ' అని ప్రార్థనాపూర్వకంగా రంగా రావుతో అని తలుపుతట్టాడు.

తలుపు తెరుచుకుంది.

మెరుపు మెరిసింది; కాదు, చుక్క తళుక్కు మంది; కాదు. ఓ అమ్మాయి కనిపించింది. ఆ అమ్మాయి రంగారావు అనే ఒకానొక వ్యక్తి ఆసమ యంలో ప్రత్యక్షమవుతాడని ఏకోశానా అనుకో లేదు. అనుకుంటే చాటుగా దాగేదేమో. పారి పోయేదేమో. కాని ప్రస్తుతం బెదిరి రంగారావు కళ్ళలోకి సూటిగా చూసింది క్షణం. తరవాత జరి గింది తెలిసి, సిగ్గుపడి చివాలున లోపలికి వెళ్ళి పోయింది.

రెండూ, రెండూ నాలుగు కళ్ళూ కలిసిన క్షణంలో రంగారావు శక్తిని యావత్తు ఏదో అయ స్కాంతశక్తి ఆకర్షించి రంగారావుని బొమ్మలా, శిలావిగ్రహంలా నుంచోపెట్టింది.

ముసలాయన హెచ్చరిక విని తేరుకున్నాడు రంగారావు.

"ఆ కుర్చీ ఇలా వెయ్యమ్మా, శారదా!"

శారద!

"శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా...." బి. ఏ. పార్టు టూలోని పద్యం గ్రామఫోను రికార్డులా రంగారావు మనసులో తిరిగింది.

యాంత్రికంగా ఆ పాతకుర్చీలో కూలబడ్డాడు రంగారావు.

"కాఫీ ఉందామ్మా?"

"ఊం. తెస్తున్నా"

ఆ సన్నటి స్వరంలోనే సంగీతశాస్త్రమంతా ఇమిడిఉందనిపించింది రంగారావుకి.

కాఫీకప్పు కింద—తన దగ్గరగా—శారద పెట్టినప్పుడు బాణంలా వంగిన ఆ మృదుల తనూలతని మనసులో ఫొటోగ్రాఫు చేశాడు రంగారావు.

ముసలాయన ఏదో మాట్లాడుతున్నాడు. తను వింటున్నాడు కానీ వినటంలేదు. అమ్మాయితో తన విషయం చెప్పినట్టు చూచాయగా అతనికి తెలిసింది. అప్రయత్నంగా ఆమెవైపు చూశాడు.

మళ్ళీ...నాలుగుకళ్ళూ!

రంగారావు హృదయంలో ఎవరో వీణ మీటుతున్నారు. వీణ మీటేదెవరు? ప్రశ్నించుకున్నాడు రంగారావు. "శారద కదూ?" అప్రయత్నంగా జవాబిచ్చింది అతని హృదయం—పోనీ, మనసు.

ధ్వనితరంగాలు — ఆనందతరంగాలు! వాటి మీద తేలిపోతూ రంగారావు!

ముసలాయన దగ్గర సెలవుతీసుకొని రంగారావు వీధిలో ప్రవేశించి ముందుకి నడుస్తూ వెనక్కి చూస్తూ సందు తిరిగి ఎలాగో రూమ్‌కి చేరుకున్నాడు. క్షణాలూ, నిమిషాలూ గడిచిపోతున్నాయి.

గదిలో క్యాలెండర్ ఎదురుచూస్తోంది. ఆ విషయం ఎప్పుడో ఓసారి జ్ఞాపకంవొచ్చి టైంచూసి ఉలిక్కిపడి ఆ మొక్కుతీర్చుకుని పడుకుని మళ్లీ ఆలోచనాసాగరంలో పూర్తిగా మునిగిపోయాడు రంగారావు.

"తనూ ఎప్పుడో కొనాలి; కొంటాడు—చీరలు"

కొంటాడేమిటి! కొన్నాడు! బి. ఏ. ఆఖరి పరీక్ష రాసేసిన రోజే—ఆ సాయంత్రమే.

ఐపోయాయి పరీక్షలు. వదిలింది భారం.

మధుర మధురమైన జీవితం. ముందున్నదంతా అదే.

ఆ చూపు! కళ్ళల్లోంచి ప్రవహించే ఆ విద్యుత్తు.

అవి చూపులు కావు. తూపులు. కళ్లలోంచి దూసుకుపోయి గుండెల్లో గుచ్చుకుని హృదయాన్ని గాయపరిచాయి.

అదే హృదయబాధ.

పుష్పబాణ విలాసం! చెఱకు విలుకాని తుంటరితనం!

ఖటావ్ వాయిల్స్ మనసులో మెదిలాయి రంగారావుకి.

షిఫాన్ సిల్కు! మధురస్మృతి.

కొనేవాడు రంగారావు కొన్నాడు. కొనేవాడే రాజు. రంగారావు రాజు. రాజాధిరాజు.

రోడ్డుమీద పోయే జనం 'రూల్స్' అతిక్రమించి రంగారావు మనసులో జొరబడ్డారు.

రంగారావు హృదయంలో ఏదో బాధ.

పుష్పబాణ విలాసం కాదు. రంగారావుకి అదే ఆలోచించాలని ఉంది. కాని మనసేదో ఆలోచిస్తోంది. రెండూ స్థలంకోసం పోటీ పడుతున్నాయి. ఆ విషయం అతనికి చప్పున తెలిసిపోయింది.

పోటీ! పోటీ!! తనలోకూడా ఏదో పోటీ! తనకి కూడా పోటీ తప్పదు!

బి. ఏ. ప్యాస్ కాగానే ఉద్యోగానికి పోటీ. ఫస్టుక్లాస్, సెకండ్‌క్లాస్ ... పోటీ దారులు. తనకి థర్డ్‌కంటే రాదు. అలా అయితే ఉద్యోగం - రాదా? రాకపోతే? డబ్బుండదు. ఉండదు. ఉండకపోతే! కొనలేడు, ఏవీ—చీరలూ, వస్తువులూ...

రంగారావుకి ముచ్చెమటలు పోశాయి.

ఇన్సురెన్సు బొమ్మ కనిపిస్తోంది.

జీవితం! భీమా!

కుటుంబాన్ని అన్యాయం చెయ్యకండి! భీమా చెయ్యండి. ఉత్తమోత్తమమైన భీమా కుటుంబం లేకపోవడమే!

# కొనేవాడు

ఎందుకో వెంటనే అలా అనిపించింది రంగారావుకి.

కాఫీ తాగలేని ఎలిమెంటరీ టీచర్; సిగరెట్ కొనలేని ఎన్. జి. ఓ.; చీర కొనలేని పెద్ద మనిషీ జాలిగా రంగారావు వైపు చూస్తున్నారు.

జీవితం వాళ్లని మోసగిస్తోంది. ఘోరం.

జీవితం! రంగురంగుల బోర్డులన్నీ పరస్పరం ద్వేషించుకుంటూ ఈర్ష్యగా చూస్తున్నాయి. పోటీ పడుతున్నాయి.

"రండి రండి, రాజులూ...ఏరీ, ఏరీ ?"

"కావాలి, కావాలి...ఎలా, ఎలా ?"

ఏం కావాలి? ఎన్నో కావాలి! ఇంకా ఎన్నో!! అదే జీవితం.

అవసరాలు

సుఖాలు

విలాసాలు !

ఇవన్నీ కలిస్తే జీవితం. వాటికోసం పోటీపడటమే జీవిత పోరాటం. అతిరథ మహారథులే, రాజాధిరాజులూ, మార్తాండ తేజులూ. యోధానుయోధులకే రాజయోగం.

రంగారావు కింకో ఊహతట్టింది.

బతికేవాళ్లందరూ యోధానుయోధులే. అతిరథ మహారథులు కాకపోవొచ్చు.

వేలంపాటలో చిత్తయిన ముసలాయన కనిపించాడు రంగారావుకి. అంతే, అంతే! అందరూ! ఆ రోజున ఆయన — తరవాత మరొకరు — ఒక్కొక్కరూ! ఎప్పుడో తనూ...!

భయం వేసింది రంగారావుకి.

జీవితాన్ని కాలసర్పం కాటు వేస్తోంది! లాభం లేదు. కాలాన్ని నిర్లక్ష్యంచేసి ఏమరుపాటుగా ప్రవర్తిస్తే జీవితం ఆఖరు.

నేడు పుష్పబాణ విలాసానికి వశమైతే, రేపు?

కొనలేనివాడు ఉండీ లేనివాడు. జీవన్మృతుడు.

రాజుని చూసిన కళ్ళతో మొగుణ్ణిచూస్తే మొత్త బుద్ధిపుడుతుంది!

రంగారావు మనసులో ఈ ఆలోచన బాణంలా గుచ్చుకుంది. అతని ముఖం చిన్నబోయింది. తనని పైకి రానీయదు ప్రపంచం. తనని లక్ష్యపెట్టరు ఎవరూ, ఆ అమ్మాయి కూడా.

రంగారావు నిస్పృహగా, ఆలోచించటం మానేశాడు. కళ్ళు మూసుకున్నాడు. నిద్ర రావటం లేదు. ఎలా వొస్తుంది నిద్ర? తనకి నిద్ర రాదు! ఆశలన్నీ అడియాసలయాయి. మళ్లీ ఆలోచనలు.

ఆ అమ్మాయి, శారద—పాపం—నిస్సహాయురాలు. ఆ చూపులో ఏదో ఉంది. ఆ అమాయకత్వంలో ఏదో అయస్కాంతశక్తి ఉంది. కాంతత్వంతో కాంతత్వం కలిగించవచ్చు. అలా తనవైపే చూస్తే, తన నేత్రాలుకూడా అయస్కాంతాల్లా—ఆకరించలేవా?

రంగారావు హృదయం జల్లుమంది. శరీరం గగుర్పొడిచింది. కాని, కాని... అయ్యో! తను నిస్సహాయుడేనా? చేతకానివాడేనా? ఏం చెయ్యగలడు? డబ్బే ఉంటే, ఈ క్షణంలో ఆమె దగ్గరవాలి... ఎందుకు దంభోక్తులు! డబ్బులేకుండా దాన్నిగురించి ఆలోచించటం అనవసరం. జీవితం ఇలా అడవిగాచిన వెన్నెలా ఐపోవలసిందేనా? ఇద్దరికోసం తనామెని కాపాడలేడా? ఆమె సంగతేమిటి? పాపం, ఆ బీద ఎలిమెంటరీటీచర్ ఆమెకి మొగుణ్ణి ఎక్కడ కొనితేగలడు? ఆమెగతి అంతేనా, పాపం! తనూ, బీదవాడే! ఏం చెయ్యగలడు? ఆమె కసలు వివాహంకాదేమో! ఎన్నోచిక్కులు. తనకీ కాదు. తను జీవితంలోంచి పారిపోతున్నాడా?

రంగారావుకి కోపంవొచ్చింది, తనమీదే. తనెక్కడికీ పారిపోవటంలేదు. హాయిగా మంచం మీద పడుకుని నిద్రపట్టక తన్నుకుంటున్నాడు! కళ్లు మూసుకున్నాడతను. నిద్ర రాదు. ఆలోచనలు, క్షణాలూ, నిమిషాలూ, గంటలూ గడిచిపోతున్నాయి. టైమెంతయిందో? ఎంతయితే ఏం?

చివాలున మంచంమీదనుంచి లేచి తలుపు తీశాడు రంగారావు. చీకటిగా ఉంది. అలా చల్ల గాలికి తిరిగితే నిద్రపడుతుందేమో! తలుపు దగ్గరగా వేసి ఆ చీకట్లోనే బయలుదేరాడు. రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది.

ఆలోచిస్తూ, మానేస్తూ, నడుస్తూ, ఆగుతూ తిరుగుతున్న రంగారావుకి ఆ చీకట్లో గట్టిగా ఓ ఎదురు దెబ్బ తగిలి 'అబ్బా' అని రోడ్డుమీద కూలబడి

పోయాడు. వేలికి కంకర్రాయి తగిలి నెత్తురు వస్తున్నట్టుంది, చెయ్యి తడిఅయింది. దిమ్మరపోయి కాసేపు ఆ వేలుపట్టుకుని అలాగే కూచున్నాడు. ఆ అవస్థలో అతనికి శారద జ్ఞాపకం వొచ్చింది. అలా తన వేలినించి రక్తం వస్తుంటే ఆమె ఏం చేసేదో! పాపం, శారద! ఆ సాయంత్రం తను ఆమెకి కాఫీ లేకుండా చేశాడు. తన ఎదటనే ఫ్లాస్క్‌లో కాఫీ రెండుకప్పుల్లో పోసి తనకొకటే, తండ్రికొకటే ఇచ్చేసింది. అయినా ఆమె విసుక్కున్నట్టుగా ఏమాత్రం కనిపించలేదు. పైగా ఆప్యాయంగా తన దగ్గరగా వచ్చి ఇచ్చివెళ్ళింది! అప్పటికింకా తను వాళ్ళకి సహాయం చేసినట్టుకూడా ఆమెకి తెలియదు. ఎంత మంచిది! ఆమె దగ్గరుంటే కట్టుకున్న షిఫాన్‌సిల్క్ చీర బోర్డర్ చింపి తనవేలుకి...! ఎంత మనోహర దృశ్యం!

నెమ్మదిగా లేచి నుంచుని రూమ్‌కి వెళ్ళటానికి వెనక్కి తిరిగి అడుగులో అడుగువేస్తూ రంగారావు యథాలాపంగా ఆకాశంలోకి ఎదురుగా చూశాడు. ఆ నీలాకాశంలో ఉజ్జ్వలంగా తెల్లటి చుక్క ధవళ కాంతులు విరజిమ్ముతూ మెరుస్తోంది. వేగుచుక్క పొడిచింది. ఆ ఉదయ సౌందర్యాన్ని రంగారావు రెప్ప వేయకుండా అలాగే చూడసాగాడు.

సౌందర్యం! అది అనిర్వచనీయం! ఎవరికి వారే అనుభవించాలిసిన అద్భుతం.

ఆ వేగుచుక్కని చూస్తే అతనికేదో జ్ఞాపకం వొస్తోంది. ఆ ఉదయ సౌందర్యం చూస్తుంటే అతనికేదో మరో సౌందర్యం మనసులో మెదుల్తోంది.

ఎవరెవరో మనుషులు రంగారావు స్మృతిలో కదుల్తున్నారు. అందరూ పాతవాళ్ళే. కాని కొత్త కొత్తగా కనిపిస్తున్నారు.

పువ్వులు కొంటున్న ఎలిమెంటరీ టీచర్. అతని వదనంలో రంగారావుకేదో అరుణకాంతి కనిపిస్తోంది.

చాక్‌లెట్లు కొంటున్న ఎన్. జి. ఓ—కళ్లలో ఏదో మెరుపల్లే మెరిసి అందులో పాప ప్రకాశించాడు.

చీర వాపసు ఇచ్చి ధోవతులు తీసుకుంటున్న పెద్దమనిషి—సగభాగమే కనిపించాడు.

కాఫీ మానేసిన టీచర్, సిగరెట్లు మానేసిన ఎన్. జి. ఓ, ధోవతులు తీసుకున్న యువకుడూ చిరునవ్వులు నవ్వుతుంటే ఆ నవ్వుల కాంతిలో నేత్రాలు మెరుస్తున్నాయి. ఆ మెరిసే నేత్రాలన్నీ మరుక్షణంలో రెండే రెండు కళ్లుగా మారాయి. వృద్ధోపాధ్యాయుడి నేత్రాలు! ఆ బీద నేత్రాలు ఎంత కాంతిమంతాలు!

ఆ వేగుచుక్క! వేగుచుక్క ప్రకాశిస్తూ రంగారావుని చిరపరిచితంగా పలకరిస్తోంది. ఆ చుక్కని చూస్తే ఏం జ్ఞాపకం వొస్తోందో రంగారావుకి క్రమంగా తెలిసిపోతోంది. ఆ ఉదయ సౌందర్యానికి సమానమైన దేదో దిగంతాలకివతలే ఆ సాయంత్రమే తను చాలాసార్లు చూసేడు. చివరిసారిగా సంజచీకట్లో నాలుగు కళ్లూ కలుసుకున్నప్పుడు దేదీప్యమానంగా వెలిగిన ఆ రెండు చుక్కలికీ ఆ సౌందర్యం ఎక్కడినించి వొచ్చింది? ఏదో నిరంతరజ్యోతి ఎక్కడో వెలుగుతూ కళ్లలో ప్రతిఫలిస్తుంటే, ఉదయ సౌందర్యానికి తుల్యమైన ఆ సౌందర్యాన్ని ఏదో ఇచ్చి తను కొనేశాడు.

దాని మూల్యం అమూల్యం.

అది కొనేవాడే రాజు!

# 'పారడైజ్ లాస్ట్'

శ్రీ ఎ. ఎఫ్. త్యాగరాజు

ఆ మహాగ్రంథం అవతరించి మూడు శతాబ్దాలైంది. నాటినుంచి నేటివరకూ ఆంగ్లవాఙ్మయంలో సాటిలేని మహోత్కృష్ట కావ్యంగా వెలుగొందుతోంది. పాఠకునియొక్క గాని, పండితునియొక్క గాని, విమర్శకునియొక్క గాని, సాహిత్యాభిరుచికీ, అవగాహనశక్తికి విలువలు నిర్ణయించే నికషోపలంగా వుంది. అతఃపూర్వం ఇలాంటి ఉత్కృష్ట రచన అవతరించటానికి సావకాశం వున్నదని ఎవ్వరూ ఊహించనైనా ఊహించగలిగిన సంగతి కాదు. కాని అది ఈ జగత్తులో ఉద్భవించిన ఒకటి రెండు సంవత్సరాలలోనే, డ్రైడెన్ చెప్పినట్టు, సమకాలీన రచనలనే కాక ప్రాచీన కావ్య పరంపరనంతా కూడా నరికివేసింది. ఈ రచన, అద్భుతావహమైన ఇలాంటి మహా విజయాన్ని సాధించిందంటే ఈ రచనకు వున్న విశిష్టగుణం లేదా గుణసముదాయం యేమిటి? చాలామంది 'శైలి' కారణమంటారు. నిజానికి, మహాకవి మిల్టన్‌లా ఆంగ్లభాషను అంత హుందాగానూ, హృదయ తంత్రులను ప్రతిధ్వనింపజేసే ఉద్గీతిగానూ, చాలనం చేసినవారు మరొకరెవరూ లేరు. ఈ విషయంలో షేక్స్‌పియర్ వంటి మహామహుడు మిల్టన్‌ముందు ఎందుకూ కొరగాడంటే, ఇతరుల విషయం తడవ నక్కర్లేదు. కాని కేవలం 'శైలి' మీదనే ఆధారపడి ఏ కళాఖండమూ చిరకాలం మనలేదు. శిల్పమూ వస్తువూ రెండూ కూడా మహోజ్జ్వల స్థాయిలో సంయోగం పొందినప్పుడే అమరమైన మహాకావ్యం సిద్ధించగలదు. శైలికి సంబంధించినంతవరకూ మిల్టన్ సృష్టించిన సంగీత తరంగపరంపరతో విమోహితమై విమర్శకలోకం యావత్తూ ఆనతమై జోహారులర్పించివేసింది. కాని కావ్యవస్తువుయొక్క విలువను గాని సందేశాన్ని గాని సమగ్రంగా బోధపరచుకున్నవారు ఎంతమంది వున్నారనేది సందేహాస్పదమైన విషయం. అసలు, కావ్యం ప్రతిపాదించుతున్న మహార్థం ఇదమిద్ధం అని తేల్చటంలో విమర్శకలోకంలో ఒకరికొకరికి ఏకీభావం కుదరలేదు. తలా తోకా లేకుండా తలొకటీ చెప్పారు.

మతైకదృష్టిగల మిల్టన్ సమకాలికులు ఈ కావ్యాన్ని కేవలం ఒక మతగ్రంథంగా పరిగణించారు. అనేక ఆంగ్లేయగృహాల్లో, బైబిలు, బనియన్ రచించిన 'పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్' ఫాక్స్ రచించిన 'బుక్ ఆఫ్ మార్టీర్స్' మొదలైన గ్రంథాలశ్రేణిలో ఈ గ్రంథాన్ని కూడా వుంచి, ఆరకమైన మతగ్రంథంగానే ఆదరించుతూ వచ్చారు.

స్వర్గ నరకాలనుగురించి యిప్పుడు క్రైస్తవప్రపంచంలో వ్యాప్తిలోవున్న భావాలన్నీ మిల్టన్ భావనలో ప్రభవించినవే గాని, ఇతరత్రా బైబిలు ప్రతిపాదనలనుంచి ఉత్పన్నమైనవి కావు. మిల్టన్ భావన అటు స్వర్గసీమలనుంచి ఇటు పాతాళగుహాకుహరాల వరకూ పరిక్రమించింది. దేవదానవులనూ, భూస్వర్గాల సృష్టికర్తనూ, భగవంతుని కుమారునీ కూడా సుపరిచితులైనట్టు వ్యక్తీకరించింది. దారీడొంకా లేకుండా దురవగాహంగా వుండే క్రైస్తవమత శాస్త్రానికి విస్పష్టమైన కావ్యరూపాన్ని ప్రసాదించి ద్యోతమానం చేసింది. మానవజాతిపట్ల భగవదిచ్ఛ ఎలా వుంటుందో? వ్యక్తీకరించి, దాని ఉత్కృష్టతను స్థాపించటానికి ప్రయత్నించింది. ఈ కారణాల చేతనే 'పారడైజ్ లాస్ట్'ను భగవద్విషయికమైన ధర్మబోధలుగా పరిగణించటం జరిగింది. ఈ పరిస్థితులను పురస్కరించుకుని, విమర్శకులే మంటున్నారంటే: ఏ మతవిశ్వాసాలను ఆధారం చేసుకుని ఈ కావ్యం నిర్మింపబడివున్నదో అవన్నీ నేడు తలక్రిందులై ప్రాచీన మూఢవిశ్వాసాలక్రింద త్రోసివేయబడినై. ఆలోచనాపరులైన ఆధునికులు దేవతలనూ దయ్యాలనూ నమ్మేస్థితిలో లేరు. అందుచేత ఇప్పుడు ఈ కావ్యానికి విలువేమీ లేదు. కాకపోతే ప్రాచీన కళాఖండంగా పురావస్తుశాలల్లో వుంచి పూజించవచ్చు. ఇది అధునికు డెవ్వడూ అంగీకరించలేని

కాకమ్మ కథను ఆధారంగా చేసుకుని పుట్టిన రచన. సైతాను వాక్యాలలో చెప్పాలంటే: 'నవ్వుకోవటానికి పనికొచ్చే చిత్రకథ.'

పైపైనంగా వాదించటం, కావ్యం ప్రతిపాదించుతున్న ప్రధానాంశాన్నే అవగతం చేసుకోలేకపోవటమని నా అభిప్రాయం. 'పారడైజ్ లాస్ట్' కావ్యవస్తువు భగవంతుడు కాదు — మానవుడు. తొలి రచన నుంచి తుదివరకూ మిల్టన్ ఎప్పుడేది రచించినా ఈ 'మానవుని' గురించే వ్రాశాడు. మిల్టన్ ఏ రచన చేసినా ఒకేఒక కావ్యవస్తువు — 'మానవుడు' — ఆ మానవుడు స్వయంగా తనే, మిల్టన్. ఆంగ్ల సాహిత్య ప్రపంచంలో అంత బరితెగి స్వాతిశయం ప్రకటించుకున్నవాడు మరొకడెవడేనా వున్నాడా? అవును, మీరు స్వాతిశయం అనదలిస్తే అనవచ్చు. కాని కాలరిడ్జి అన్నట్లు, అల్లాంటి వాడు స్వాతిశయం ప్రకటించినప్పుడు, మహోజ్జ్వలమైన ఆ మహాపురుషుని చైతన్యస్ఫూర్తి మనకు ద్యోతమానమవుతుంది. తన కావ్యాలకన్నిటికి, తనకుతాను, మిల్టనే కావ్యవస్తువు; కాని, ఈ మిల్టన్ మానవునకు ప్రతినిధి — నిరంతర సంఘర్షణా స్వరూపుడైన మానవుడు, మిల్టన్; అమరమైన విజయమాలికను చేపట్టటానికి నిరంతర సంగ్రామం సాగుతూవుండే ధూళిధూసరితమూ జ్వాలామాలాక్షీణమూ అయిన భయంకర రణక్షేత్ర స్వరూపుడైన మానవుడు, మిల్టన్. ఇది — తన్ను తాను వ్యక్తీకరించుకోవటమే పరమలక్ష్యంగాగల ఈ పద్ధతి — అతని రచనలన్నిటిలోనూ స్వర్ణలతలా వ్యాపించి మిలమిలగా ద్యోతమానమౌతూ, చీకటి లోకానికి వెలుగునిచ్చే జ్యోతిలా, అతని రచనలనన్నిటినీ తేజోమయం చేసి వేస్తున్నది. 'వెకేషన్ ఎక్సర్‌సైజ్' దగ్గిర నుంచి 'శాంసన్ అగొనిస్టిస్' వరకూ ఏ రచనను పరిశీలించినా ఈ సత్యమే మనకు బోధపడుతుంది. అతని కావ్యరచన యావత్తూ ఈ మానవ సమస్యనే ప్రతిపాదిస్తున్నది. మానవుని ఆత్మలో సాగుతూ వుండే ఈ మహా సంగ్రామాన్నే ప్రతిపాదిస్తున్నది. మానవునియందు అత్యంత సానుభూతి కలవాడై, మానవుని సమస్యను తన సమస్యగా సేకరించి రణక్షేత్రంలో దిగి పోరాడి, అజేయుడై మానవునికి విజయపథాన్ని నిర్మించుతున్నాడు. ఈ సునిశితమైన దృష్టితో మనం మిల్టన్ను అవగతం చేసుకోవలసివుంది.

అయితే, అసలు ఈ మానవసమస్య ఏమిటి అనే ప్రశ్న వస్తుంది. ఒక్క వాక్యంలో చెప్పవలసివస్తే — ద్వంద్వజీవిగా మానవుడు తనతో తాను జరుపుతున్న మహా సంగ్రామం.

సౌందర్యవిలసితమైన జగత్తులో మానవుడు ప్రతిష్ఠించబడుతున్నాడు. ఆ సౌందర్యాన్ని అనుభవించమని ప్రేరేపింపబడుతున్నాడు. కాని సుఖమయమైన ఈ నందనోద్యానంలో అడుగు ముందుకు వెయ్యగానే అవాంతరం ఎదురౌతోంది. హఠాత్తుగా నైతిక శాసనం ఆవిర్భవించి అడ్డునిలుస్తోంది — యుక్తాయుక్త సమస్య ప్రభవించుతోంది. 'ఇది తగదు' అనే అక్షరపంక్తితో త్రోవకడ్డంగా, ఒక ప్రకటన విచిత్రంగా వెలుస్తుంది. కనులు పైకెత్తితే కనుపిస్తుంది, ముగువులు గులుకుతూ నిషిద్ధఫలం. ఈ నైతిక ప్రబోధంతో ప్రచలితమై అతని అంతరాత్మలో ఏదో శక్తి ఉద్బుద్ధమవుతుంది. కొమ్మక్రింది గొల్లపసముతో కులాసాగా వినోదించాలనీ, నిండు జడనొక్కులను స్పృశించి ఆనందించాలనీ అతనికి హృదయం కొట్టుకుంటూనే వుంటుంది. కాని ఈ ఆకాంక్షలను జయించి నిష్ఠురజీవితానికి సన్నద్ధుడవైతేనేగాని, స్వచ్ఛందమైన నీ అంతరాత్మకు ఆవిష్కృతి లేదు, అని ఆ శక్తి హెచ్చరించుతుంది. దీంతో సంఘర్షణ ప్రారంభమవుతుంది:

*The genius and the mortal instruments*
*Are there in Council, and the state of man*
*Like to a little kingdom, suffers then*
*The nature of an insurrection.*

'యుయుత్సువులైన సచ్ఛక్తులూ అసచ్ఛక్తులూ
మానవక్షేత్రమందు సమవేతములు కాగా,
విప్లవము చెలరేగిన సామ్రాజ్యమువలె
మానవక్షేత్రము సంక్షుభితమైపోయినది'

ఈ ఆంతరంగిక సంక్షోభాన్నంతా మిల్టన్ అనుభవించాడు — ఈ నరకకూపంలోనుంచి అనుగనుగ పరిక్రమించి జయశీలుడై బయటపడ్డాడు. ఆ అనుభవమే మహోజ్జ్వలమైన కవితా సరస్వతిగా రూపొందింది. ఎవ్వడుగాని, సంఘర్షణరూపమైన ఈ గానుగలో నలిబిలిగానలిగి, రక్తాన్ని చిందించుకుంటేనే గాని కళాకారుడుగా, రూపొందలేడు. ఒకవైపున

# 'పారడైజ్ లాస్ట్'

మిల్టన్ కళాజీవి—సౌందర్యోపాసకుడు. సౌందర్యం ఏరూపంలో దృగ్గోచరమైనా—పల్లెపడుచు హార్టన్ యువతి రూపంలోగాని, కామోన్మీలిత నయనలైన ఇటలీకన్యల రూపంలోగాని, లేదా, ఇంకా ప్రౌఢయౌవన సమ్మోహన విలాసాలకు ఆలవాలమైన 'డెలీలా' రూపంలో గాని—అతని హృదయతంత్రులన్నీ చలించిపోయినై అనాదిసిద్ధమూ, నగ్నమూ, నైతికానైతిక ద్వంద్వ నిరాకరిష్ణువు, సమ్మోహన మూర్తి అయిన సౌందర్యజగత్తు, హిమానీ రుచిరములైన బాహువుల నెత్తి చేసన్న బిలిచింది. పారిజాలసుల వంటి మోహనగీతికలతో లాలనగా ఆహ్వానించింది యౌవనాన్ని వృథాచేసుకోవద్దని హెచ్చరించింది. డాన్‌లో). (కోమస్‌లో):

'ఈజిప్టులో తోన్‌పత్ని, భగవత్పుత్రి హెలీనాకిచ్చిన మంత్రౌషధి కూడా ఇలాంటి మహదానందాన్ని ఇవ్వలేదు' అని హెచ్చరించింది. స్వర్గ ఫలాన్ని చూపె మోజు కొల్పింది — ఈవ్ మృగుల హస్తంలో వున్న ఫలాన్ని—'పారడైజ్ లాస్ట్'లో. 'పారడైజ్ రీగైన్డులో' సర్వకామ్యసంసిద్ధమైన విందు నేర్పాటుచేసి విందనై వినోదించ మని ఉవ్విళ్ళూరించింది. 'శాంసన్ ఎగొనిస్ట్‌లో' డెలీలా రూపం ధరించి, విభ్రాంతి గొలిపింది— అందుకే 'ప్రమాద కారణమే అయినా, సౌందర్యానికి అనిర్వచనీయమైన విచిత్రశక్తి వున్నది' అన్నాడు.

కాని మిల్టన్ కేవలమూ, సౌందర్యోపాసకుడైన కళాకారుడు మాత్రమే కాదు. భగవంతునియందు పరమపూజ్యభావం గల ఆస్తికుడు. భగవంతునిదృష్టిలో పరమపవిత్రుడైన ఉత్తమజీవిగా బ్రతకటం అతని ఆశయం. తన జాతికి తాను సేవచెయ్యాలి; తన జాతి కొరకు తను పోరాడాలి. ఆంగ్లదేశంయొక్క భవిష్యత్తునుగురించి భగవదిచ్ఛ యేమున్నదో దాన్ని సాధించటానికి పుట్టిన కారణజన్ముడు తను. తన భావ్యత తన్ను హెచ్చరించినప్పుడు ఇక ప్రేమడోలికలలో ఊగుతూ నిద్రపోలేడు. సౌందర్యోపాసనాప్రలోభమైన స్వభావ మొకవైపూ, ఇంద్రియ వ్యాలోలత నంతా జయించి పరమశాంతిని చేపట్టాలనే నైతికశక్తి ఒకవైపూ సంఘర్షణకు దిగినై. ఇదే మిల్టన్ జీవితాని కంతటా ఒక మహాసమస్యగా తయారైంది.

'మానవుని పతనం' (*Fall of Man*) మిల్టన్ తన మహాకావ్యానికి కావ్యవస్తువుగా ఎందుకు సేకరించాడు. అనేదానికి ఇదే సమాధానం చెప్పవలసి వుంది. మిల్టన్, 'రినైసెన్సు'యుగంలో అవిర్భవించిన మానవతత్వవాదులలో (*Humanists*) ఒకడు. (ఈ వర్గం గ్రీకు సంస్కృతిని పునరుద్ధరించటానికి ప్రయత్నించారు). ప్లాటో సంప్రదాయాన్ని శిరసావహించినవాడు గ్రీకు వేదాంతుల ప్రవచనాలు అతనికి ఊతకర్ర. గ్రీకు నాటకకర్తల విషాదాంత రచన లన్నిటిని అతను జీర్ణించుకున్నాడు. గ్రీకుల దృక్పథంలో తిరిగి జీవశక్తిని దృగ్గోచరం చేసుకున్న రినైసెన్సు యుగపు పండితులలో మిల్టన్ ప్రముఖుడు. గ్రీకు పౌరాణిక గాథలన్నీ ధర్మబోధకమై అతని హృదయాంతరాళాలను జ్వలింపజేసినై. మిల్టన్ ఆర్ఫ్యూస్‌లాగా, రాలరప్పలనుసహితం కరగింపగల దివ్య మురళిని సంపాదించాడు. అక్టన్‌లాగా ప్రకృతియొక్క నగ్న సౌందర్యాన్ని విస్ఫురిత నేత్రుడై తిలకించాడు. విచిత్రమైన ఎన్నా ఉద్యానంలో ప్రోసర్‌పైన్‌లాగా పువ్వులు కోశాడు. గ్రీకుల వలెనే విజ్ఞాన మన్నా, సౌందర్య మన్నా అతనిలో తీరని దాహం. గ్రీకుల వలెనే స్వతంత్రేచ్ఛ, గ్రీకులవలెనే మానవుని ప్రాధాన్యతను గుర్తించాడు. అతను, ట్రాయ్ కోటగోడల ముందూ, సముద్రాంతరాలపైనా దేవతలతో తలపడి పోరాటం సలిపిన మహామహుల జాతికి చెందినవాడు. తన సర్వశక్తులనూ సమీకరించుకుని మహాకావ్య నిర్మాణానికి సన్నద్ధుడైనప్పుడు, తనకు ఆరాధ్యులైన ఆ ప్రాచీనగ్రీకు మహారచయితలు సంతోషింపగల కథా వస్తువును సేకరించాడు. వారికి ముదావహములైన అనేక విషయాలను ఆ రచనలో చొప్పించాడు- ఉండీ లేనట్టు కించిత్ పరిహాసధోరణి, మానవ సమస్యకు అత్యంతమైన ప్రాధాన్యత నివ్వటం, కథను త్రిలోక పరివ్యాప్తంగా చాలనం చెయ్యటం ఇత్యాది. కాని గ్రీకులలో లేని ఒకమహాగుణం మిల్టన్‌లో ప్రభవించింది. మానవసమస్య మిల్టన్‌లో గ్రీకుమహారచయితలు తలపోసినట్టు పరిష్కారరహితమైనది కాదు. ఆ సమస్యకుగల పరిష్కారమే మానవుణ్ణి ఉత్తమజీవిగా నిలబెట్టుతోంది. ఒక మహాపురుషుడు—అవును ఒక మహాపురుషుడు మనను పతితావస్థనుంచి ఉద్ధరించి, తిరిగి పవిత్రతరమైన ఆ ఉన్నతస్థానంలో ప్రతిష్ఠించగలడు.

ఆ విధంగా మానవవాదం పారడైజ్ లాస్ట్‌లో ఫలోన్ముఖమైనట్టు మనం అవగతం చేసుకోగలం. మానవుడు అని పిలువబడే, బలహీనుడూ, నిస్సహాయుడూ అయిన ఈ జీవిచుట్టూ ఈ కథ అల్లుకుని వుంది. కాని యెంత బలహీనుడైనా ఆ మానవుడే ఈ బ్రహ్మాండాని కంతకూ కేంద్రంగా వున్నాడు. అతనికోసం ఈ సృష్టి యావత్తూ జరుగుతోంది. అతనికోసం లోకాలు నిర్మింపబడినై. అతని శ్రేయాన్ని గురించి స్వర్గసీమల్లో సహితం ఆందోళన పడుతున్నారు. అతని విముక్తికి స్వర్గంలో సభలు జరుగుతున్నయ్. అతని వినాశంకోసం నరకంలో సైతాన్ ప్రభృతులు మార్గాలు అన్వేషించుతున్నారు. ఈ పరిస్థితే మానవునికి ఒక మహోన్నత స్థానాన్నీ, ప్రతిపత్తినీ కలుగజేస్తోంది—గ్రీకు పురాణాలలోగాని నాటకాలలోగాని, మానవుని చిత్రణ కేవలం ఇందుకు భిన్నమైనది. పారడైజ్ లాస్ట్‌లో చిత్రించబడిన మానవుడు ప్రతిఘటింప సాధ్యంకాని యే శక్తికి బద్ధుడుకాడు. 'తుంటరి పిల్లలకు ఈగ లెలాగా మనం దేవతలకు అలా, దేవతలు తమ వినోదం కోసం మన్ని నలిపేస్తారు' అనే వెర్రి ధోరణికి మిల్టన్‌లో స్థానం లేదు.

పై రకం వెర్రి సిద్ధాంతాన్ని అంగీకరించిన తరువాత, ఆ కళాకారుడు ఎలాంటి ప్రతిభావంతుడైనా ప్రయోజనం వుండదు. అలాంటివాని రచన గ్రీకు విషాదాంత నాటకాలలో వలెనూ, థామస్ హార్డీ నవలలలో వలెనూ ప్రయోజన శూన్యమైన నిరాశావాద ధోరణిగా రూపొందుతుంది.

పారడైజ్ లాస్ట్‌లో, విమర్శకులు ఈవ్ ప్రతిపత్తిని అవగతం చేసుకున్నంత జాగ్రత్తగా ఆడమ్ ప్రతిపత్తిని అవగతం చేసుకోలేక పోయారు. నిజానికి మానవజాతికి చిహ్నంగా వున్నవాడు ఆడమ్. సర్వథా మానవుడు. ఆ పేరులోనే ఆ సూచన వుంది. దేవతలతో ఆడమ్ జరిపిన దీర్ఘ సమాలోచనలలో — నిశితదృష్టిలేని విమర్శకులు వీటిని ఎంత తెగనాడినా— సమాధానం దొరక్క అనాదిగా మానవుని వేధించుతున్న ప్రశ్నలన్నీ వున్నయ్: నేనెవరు? నేనెక్కడనుంచి వచ్చాను; నా భవిష్యత్తు ఏమిటి? విచిత్రమైన ఆకర్షణతో ఈవ్ అతని ముందు ఆవిష్కరించబడినప్పుడు ఎనలేని సమస్యాపరంపర, అయోమయస్థితి అతనిలో ఉత్పన్నమై కలవరపరచినై.

ప్రేమ—ఇది లేనిది మానవుడు జీవించలేడు, నిజమే—కాని, ఇది ఒంటరిగా రాదు. దీనితోపాటు కళవళం, కన్నీరూ, అనుమానాలూ, బాధలూ ఇవన్నీ సంక్రమించుతాయి; స్నేహం వుంది— దానితోపాటు మోసం క్షమా యివ్వన్నీ వస్తయ్.

నిష్ఠురమైన ఈడెన్ ఉద్యాన జీవితానుభవంతో ఒక్క విషయం విస్పష్టంగా తేల్చాడు మిల్టన్; మానవుడు నిష్ఠురమైన ఈ గుణపాఠాన్ని తెలుసుకో నిరాకరిస్తున్నాడు. కాని భగవన్నిర్మితమైన ఈ విశ్వంలో మనదలచివుంటే విధిగా తెలుసుకు తీరాలి. నైతిక ధర్మానికి తల వొగ్గితేనే శాంతిభద్రతలకు హామీ వుంటుంది. నైతికోల్లంఘన చేసిన వెనువెంటనే సుఖశాంతుల దివ్యస్వర్గాన్ని చేజార్చుకుంటాం— అకృత్రిమమూ అమాయికమూ అయిన హృదయంలో వుండే ఆ స్వర్గం అదృశ్యమైపోతుంది.

పారడైజ్ లాస్ట్ చదివే చాలామంది పాఠకులకు, మిల్టన్ సైతానుపట్ల అత్యంత సానుభూతి వున్నవాడుగా కనుపించి విభ్రాంతు లౌతారు. మంచికీ చెడుకూ జరిగే ఈ సంగ్రామంలో, సర్వవిదుడు, సర్వసత్వసంపన్నుడూ అయిన పరమేశ్వరునిపక్షం వహించడానికి మారుగా నరకస్వరూపుడైన సైతానును మెచ్చుకున్నట్టు కనుపించుతున్నాడేమిటా అనిపిస్తుంది. సైతాను పాత్రను సృష్టించటంలో మిల్టన్ తనకున్న ప్రతిభాసంపత్తినంతా వినియోగించినమాట వాస్తవమే. కాని అంతమాత్రంచేత సైతానుపక్షం వహించాడనటం పొరపాటవుతుంది. భగవంతుని పట్లకంటే సైతానుపట్ల మిల్టన్ ఎక్కువ అభిమానను చూపించటానికి ఒక కారణం వుంది: మానవునిలో ఏ సంఘర్షణ వుందో, అదే సంఘర్షణను— అదే ద్వంద్వాన్ని—సైతానులోనూ మిల్టన్ దర్శించగలిగాడు. అంతరాత్మనుంచి ఉజ్వల వాహినిగా సదసద్వివేకం ఉద్బుద్ధమౌతూ వుండటం, దాన్ని బలవంతాన అణచివేసుకుని తెలిసి తెలిసి, కావాలని అవివేకాన్నీ దౌష్ట్యాన్నీ చేపట్టి వ్యవహరించటం— మానవజాతిని వికారంగా మార్చివేసిన ఈ మహాసత్యాన్ని మిల్టన్ దర్శించి ద్యోతమానం చెయ్యటానికి ప్రయత్నించాడు. నిజానికి, మిల్టన్ సృష్టించింది తీవ్రస్వరూపుడైన మానవ సైతాన్. అతనికీ హృదయముంది. బాధలు అనుభవిస్తాడు. ఆడమ్ ఈవ్‌లు పర

స్పర్శాలింగనంలో స్వర్గానందం అనుభవిస్తూవుండటం చూచి, తనకు అలాంటి ఆనందం అనుభవించే భాగ్యం ఎన్నడూ లభించ దని ఈర్ష్యతో కుమిలిపోతాడు. ఈ దృష్ట్యా సైతాను కూడా మిల్టన్ ప్రతిమూర్తి; ఆడమ్ మిల్టన్ ప్రతిమూర్తి. అనంతర రచనలలో, గాజాలో అంధుడై బానిసలతో పాటు మిల్లులో ఇడుము లను భవించి అనుభవించి, తుదిలో భగవదిచ్ఛాస్వరూపుడై దుష్టనిర్మూలన కారణుడై మహావిజయాన్ని చేపట్టిన శాంసన్ కూడా మిల్టనే.

కనుక, మానవజాతిపట్ల అనురాగం కలవారికీ, మానవజాతి ఔన్నత్యంపట్ల విశ్వాసంకలవారికి, మానవుని స్వాతంత్ర్యం కొరకూ, హక్కులకొరకూ పోరాడుతూవుండే వీరులకూ, మిల్టన్ ఈ వారసత్వాన్ని అందజేసిపోయాడు—హృదయోల్లాసకరము, ఆత్మోన్నత్యప్రపదమూ, వీరమార్గమూ అయిన పారడైజ్ లాస్ట్ సందేశాన్ని. ఈనాడు, పూర్వం ఎన్నడూ లేనంతగా ధర్మవీరంయొక్క అవసరం ఏర్పడివున్నదనటంలో ఎవరికీ ఎలాంటి సందేహమూ లేదు. మానవసమస్యలు మానవావధులలో పరిష్కరించటానికివీలు లేదనే అనోమయస్థితిని పటాపంచలు చేస్తూ మిల్టన్ అందచేసిన ఈ సందేశాన్ని మనం ఆశంకించవలసిన పనేమీ లేదు. ఈ మహా సత్యాన్ని శిరసావహించటంమీదనే మన భవిష్యత్తు ఆధారపడి వుంది. మిల్టన్ కలలుగన్న సజ్జనులు నివసించే ఆ నూతన స్వర్గమూ నూతన విశ్వమూ ఏర్పడగలదు.

'చిరకాలం బాధామయ జీవితం గడిపినా
సత్కార్యాలు ఫలించే
స్వర్ణదినాలు చూస్తారు
పవిత్ర సత్యం జయించి
ప్రేమోల్లాసాలు వెల్లివిరుస్తాయి.'

# ఆంగ్లభాష భవిష్యత్తు

శ్రీ మొదలి శివకామయ్య

ఆధునిక యుగమున ఆంగ్లభాషకు గల వ్యాప్తియు, ప్రాముఖ్యమును, ప్రపంచచరిత్రమున నొక అపూర్వ విషయము. ఆంగ్లదేశము యూరపు ఖండాంతర్గత మగు నొక చిన్న దేశము. విస్తీర్ణతయందును, జనసంఖ్యయందును, నింతకంటె ఎన్నియోరెట్లు అధికములగు దేశములందు వ్యవహరింపబడుభాష లనేకములు కలవు. కాని ఆంగ్లభాషకుగల వ్యాప్తి వానిలో నే భాషకును లేదు. ఇందుకొక కారణము — ఆధునిక యుగమున వలసకుబోయి, దూరదేశములందు, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా మొదలగు విశాల ఖండములందును, పెద్ద వలసరాజ్యముల నేర్పరచుకొనినవారిలో, ఆంగ్లేయులు అగ్రగణ్యులగుట. ఐరోపాఖండమునందలి, ఫ్రాన్సు, జర్మనీ, హాలెండు మున్నగు నితరదేశములవారుగూడ నిట్టి వలసరాజ్యముల నేర్పరచుకొనినను, ఆంగ్లేయుల వలసరాజ్యములకు కలిగినంత, విస్తీర్ణత, జనసంఖ్య, రాజకీయబలము, ఆర్థికసౌభాగ్యము, ఇతరదేశీయుల వలసరాజ్యముల కేర్పడలేదు. ఈ వలసరాజ్యములందంతటను ప్రజలు ఆంగ్లేయుల సంతతి వారగుట వలనను, ఆంగ్లభాష వారి మాతృభాష యగుట మూలమునను, ఆ భాషకు ఎక్కువ వ్యాప్తి యేర్పడెను. ఇదిగాక, అనేక దేశములకు, వ్యాపారమునకై వెళ్ళి, ఆంగ్లేయులు, ఆ దేశీయులు బలహీనులగుటనో, అనాగరికు లగుటనో, వెనుకబడియుండినందున, తమ ప్రభుత్వము నేర్పరచికొని పరిపాలనాధికారమున, పరిపాలకుల భాషగా నాంగ్లభాషకు వ్యాప్తి నెక్కుడు చేసియుండిరి. క్రమముగ ఆధునికయుగమున యంత్రసాహాయ్యమున వస్తూత్పత్తిచేయు విధానముల నవలంబించుటయందు, ముందంజ వేసియు, రవాణావ్యాపారము నంతను తమ కధీనము జేసికొనియు, అంతర్జాతీయ వ్యాపార రంగమున ఆంగ్లజాతి ఉన్నతస్థానము నాక్రమించినందున, ఆంగ్లదేశముకంటె నెక్కువ విస్తీర్ణమును, జనసంఖ్యను, ప్రాచీన, నాగరికతను కలిగియుండిన పెక్కు పెద్దదేశములగు చైనా, రష్యా, ఇండియా మొదలగు దేశములందుగూడ, ఆంగ్లభాషకు కొంత వ్యాప్తి యేర్పడి అందలి ప్రజలు తమ ఆర్థిక ప్రయోజనములకును, ఆధునిక విజ్ఞాన సంపాదనకును, సాంస్కృతిక వ్యవహారములకును, ఆంగ్లభాషను నేర్చుకొని, ఉపయోగించుట కలవడిరి. కాని, ఇన్నింటను, భారతదేశమున నాంగ్లభాషకు కలిగిన ప్రాముఖ్యము అద్భుతావహము. స్వతంత్ర భారతమున కూడ నిప్పటికిని ఆంగ్లభాషయే ప్రభుత్వ పరిపాలనాభాషగా నిలచియున్నది. విద్యావిధానమున ఆంగ్లభాషకు గల స్థానము అత్యుత్కృష్టము. ఉన్నతవిద్యాసంస్థలందంతటను నాంగ్లభాష అవశ్యపఠనీయ మగుటయే కాక, ఆధునిక విజ్ఞానమంతయును ఆంగ్లభాషలోనే గఱపబడుచున్నది. దేశమునందలి వివిధప్రాంతముల వారికిని పరస్పర వాణిజ్య, సాంస్కృతిక, సాంఘిక సమావేశములందు ఆంగ్లభాషయే విరివిగా నుపయోగపడుచున్నది. ఆంగ్లభాషాజ్ఞానమున కున్నంత, ఆర్థికపువిలువ, సాంఘిక గౌరవము, వైజ్ఞానిక ప్రాచుర్యము మరి ఏ దేశీయ భాషకుగాని లేదు. విద్యాధికు లందరు ప్రత్యేకముగా నవసరము లేని సందర్భములందుగూడ, తమ సాంఘిక వ్యవహారములలో అభిప్రాయప్రకటనకును, ఒక్కొక్కప్పుడు సాహిత్యసృష్టికిని గూడ ఆంగ్లభాష నే వాడుట కుత్సహించుచున్నారు. ఇట్టి విపరీత పరిస్థితి ఎంతకాలము నిలచి యుండగలదు? దేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము లభించినది గనుక, ముందుముందు ఈ దేశమున ఆంగ్లభాష కెట్టిస్థాన ముండగలదు? ఉండతగును? అను విషయములు ప్రస్తుతము వివాదగ్రస్తములు. దేశమున నీ విషయమున తీవ్ర మగు నభిప్రాయ భేదములు గలవు. కాని, సరియైన అభిప్రాయము నేర్పరచుకొనుటకు, ఈ పరిస్థితికి బీజభూతములైన కారణము లేవి? ఇన్నాళ్లు ఇట్టి పరిస్థితి నిలిచియుండుటకు గల కారణము లేవి? అని ఆలోచించి గ్రహించుట అవసరము.

వర్తకమునకై మనదేశమున ఇతర ఐరోపాదేశీయులతో పాటు చేరిన ఆంగ్లేయ వర్తకసంఘము దేశమునందు సుస్థిర మగు ప్రభుత్వము లేక, వివిధప్రాంతములందు, చిన్నచిన్న పరిపాలకులు స్వతంత్రులై తమలో తాము ఎల్లప్పుడును, కలహించుకొనుచున్నందున, దేశమున అరాజకపరిస్థితులు ఏర్పడినందున, అట్టి సమయమున ఆధునిక యుగమున, నాగరకతలో ముందడుగు వేసి, ప్రకృతిశాస్త్రజ్ఞాన మార్జించి, యంత్రసాహాయ్యమున విరివిగను, చౌకగను, వస్తువుల నుత్పత్తి చేయుటయందేగాక, మారణయంత్రములలోను, యుద్ధపరికరముల యందును సమర్థులగు, ఐరోపాదేశీయులలో,

దూర దృష్టిలోనూ, రాజనీతిలోను, విశిష్టులగు, ఆంగ్లేయులు దేశీయ రాజకీయములలో జొరబడి, తమకు ఒక స్థానమును కల్పించుకొని, కొన్ని ప్రాంతముల పరిపాలనాధికారమును సంపాదించి, క్రమముగా తక్కిన ఐరోపా దేశీయులను, దేశీయ ప్రభువులను, అనేక ఉపాయములచే నోడించియు, లోబరచుకొనియు, దేశమునందు చాలభాగము నాక్రమించిరి. పిమ్మట, తమ మాతృదేశముకంటె పెక్కురెట్లు విశాలమగు, ఇంత భూభాగమును పరిపాలించు బాధ్యత నొక వర్తకసంఘమునకు వదులుటయందలి అనౌచిత్యమును గుర్తించి బ్రిటిషు ప్రభుత్వమే దేశపరిపాలనా బాధ్యతను వహించి బ్రిటిషుపార్లమెంటుకు లోబడిన ప్రభుత్వమును దేశమున స్థాపించి, ఒక పరిపాలనావిధమును క్రమముగా పెంపొందించెను. ఇట్టి పరిపాలనా విధానమున, పాలకులు అల్పసంఖ్యాకులగుటచే దేశీయోద్యోగుల సాహాయ్యమెంతైన నవసరమయ్యెను. దేశీయులందు ఆంగ్లభాషాజ్ఞానముగలిగి, పరిపాలకులకు, పరిపాలనయందుపయోగపడగలవారు తయారు కావలసిన అవసరము గూడ ఏర్పడెను. అట్టివారిని తయారు చేయుటే ముఖ్యోద్దేశముగా కలిగిన విద్యావిధానము కూడ నేర్పరుపబడెను. దేశీయవిజ్ఞానమును బోధించు సంస్థలకు ఆదరణ తగ్గి ప్రభుత్వవిధానమున విద్యను గఱపు సంస్థలకు వ్యాప్తి హెచ్చెను. ఈ సంస్థలందు ఆంగ్లభాషకు సహజముగ ప్రముఖస్థానమేర్పడెను. పైగా దేశీయులకు ఆధునిక విజ్ఞానమును సంపాదించు నవకాశము నేర్పాటుచేయు సదుద్దేశముతోను, దేశభాషలలో విజ్ఞానాభివృద్ధికి దోహదమగు, అనువగు, సాహిత్యము లేదను నభిప్రాయమువలనను, పాశ్చాత్యనాగరకతా ప్రభావమునకు దేశీయులను లోబరచినగాని తమ ప్రభుత్వము సుస్థిరముగ నుండదను రాజకీయ స్వార్థదృష్టితోను, విద్యాసంస్థలలో ఉన్నత విద్యయంతయు, ఆంగ్లభాషలోనే బోధించుపద్ధతి ప్రవేశపెట్టబడెను. ఆంగ్లభాష నభ్యసించినవారికి ప్రభుత్వోద్యోగములు సులభముగా లభించుచుండినందున దేశమున నట్టి విద్యకు, ముఖ్యముగా నాంగ్లభాషాజ్ఞానమునకు, కోరిక హెచ్చయ్యెను. సహజముగ విజ్ఞానార్జనమునను, భాషాశాస్త్రాన్వయమునమునను, ప్రతిభ, ఆసక్తిగల దేశీయులు త్వరగా నాంగ్లభాష నభ్యసించి అందు ప్రావీణ్యమును పాండిత్యమును సంపాదింపగలిగిరి. ఆంగ్లసాహిత్యముయొక్కయు, ఆంగ్లభాషయందలి బహుముఖములగు, భౌతిక, సాంఘికాది శాస్త్రగ్రంథములయొక్కయు పరిచయమున, దేశీయులకు నిజముగ విజ్ఞానాభివృద్ధియు, ఆంగ్లభాషయందు ఆసక్తియు, ఆదరమును హెచ్చెను ఆంగ్లభాషయందు ప్రావీణ్యమును సంపాదించి, తద్వారా ఆధునిక విజ్ఞానమును సేకరించి, ప్రభుత్వోద్యోగములద్వారా ఆర్థికాభివృద్ధినంది, సంఘమున గౌరవము నొందుట, విద్యాధికులకును విద్యార్థులకును, జీవితపరమలక్ష్య మయ్యెను. తన్మూలమున ఆంగ్లభాషకు క్రమముగ ప్రాముఖ్యము హెచ్చి ఇప్పటి విపరీతపరిస్థితి ఏర్పడినది.

కాని, ఎవరును నుద్దేశింపని ఫలితములు కూడ కొన్ని సంభవించినవి. ఆంగ్లభాషయొక్కయు, ఆంగ్లసాహిత్యముయొక్కయు, విశిష్టమైన సుగుణములవలన గూడ భారతదేశప్రజలు ఆకర్షింపబడిరి. ఆంగ్లదేశ చరిత్ర, ఆంగ్ల రాజనీతి, ఆంగ్ల రాజకీయ ఆశయములు ఆదర్శములు గూడ భారతీయుల నాకర్షించెను. తమ దేశము గూడ స్వతంత్రమై, సౌభాగ్యవంతమై, ఆధునిక ప్రపంచమున నొక గౌరవప్రదమగు స్థానము నాక్రమింపవలెనను వాంఛ దేశప్రజలకును, నాయకులకును గలుగుటకు కూడ ఆంగ్లభాషాజ్ఞానమే కారణమని ఎన్నువారును గలరు. దేశమునందలి వివిధప్రాంతముల విద్యాధికులు, పరస్పరము గలసికొని సమాలోచన చేయుటకును, ఆందోళన చేయుటకును, దేశాభ్యుదయమునకై పాటుపడుటకును, ఆంగ్లభాషయే సామాన్యభాషగా ఉపకరించినది. దేశమునందంతటను ఒకే పరిపాలనా విధానము ఏర్పడి ఒకే ప్రభుత్వముండుటవలన ఎన్నడును లేని ఐక్యభావము దేశీయులకు కలిగెను. కొంతవరకు పరిపాలకు లుద్దేశించినట్లు, పరభాషా, పరసాహిత్య, పరవిజ్ఞాన, పర సంస్కృతులందు వ్యామోహమును, భావదాస్యమును, దేశీయులకు సంక్రమించినను, అందువలననే, అసంతృప్తియు, ఆత్మవిమర్శనయు తమ ప్రాచీనవిజ్ఞాన సంస్కృతుల విమర్శయు, అభ్యుదయ, స్వాతంత్ర్య, అభిలాషలును, దేశాభిమానమును, ఆత్మవిశ్వాసమును గూడ, వారలయందు హెచ్చెను. స్వాతంత్ర్యోద్యమ కాలమున, అందును ముఖ్యముగ ఇరువదియవ శతాబ్దమునందలి, స్వాతంత్ర్య సమర సమయమున ఆంగ్లభాషాసాహిత్యములందును, సంస్కృతి యందును, విరోధభావమును, ఏవగింపును గూడ వృద్ధిపొందెను. భాషాపారతంత్ర్యమే రాజకీయ పారతంత్ర్యమునకును, భావదాస్యమునకును, మూలకారణముగ నెంచబడెను.

కాని, దేశమునకు స్వాతంత్ర్యము లభించి దేశనాయకులు పరిపాలనాధికారమును కైవసముచేసికొని, జాతీయ పరిపాలనా విధానమును, రాజ్యాంగ పద్ధతిని ఏర్పాటు చేసికొనిన పిమ్మటగూడ, ఆంగ్లభాషయొక్క విశిష్టమైన స్థానమున గణింపదగిన మార్పేమియును రాలేదు. మార్పు రావలెనను వాంఛ తీవ్రతరముగ నున్నది. కావున నది రాకతప్పదు. కాని, మార్పు వలన నష్టము కలుగునను భయము, అనుమానమును గూడ

లేకపోలేదు. కనుకనే మార్పునకు ప్రయత్నములు చాల నెమ్మదిగ సాగుచున్నవి. అట్టి మార్పు క్రమముగనే రాగలదు. అధిక సంఖ్యాకులకు మాతృభాషయై సులభగ్రాహ్యమైనందున, రాష్ట్రభాషగా ప్రజాప్రతినిధులచే నిర్ణయింపబడిన హిందీ భాషలోగాని, తదితర ప్రాంతీయభాషలలోగాని, ఆంగ్లభాషా స్థానమును పరిపాలనా విధానమునను, విద్యాసంస్థలందును, ఆక్రమించి అట్టి మార్పువలన నష్టము కలుగదను ధైర్యము నొసగు పుష్టి, సంపద గలిగిన భాషయగపడదు. ముఖ్యముగ విద్యావిధానమున ఆంగ్లభాష కున్న స్థానమును, ఆయా ప్రాంతముల నున్న దేశీయభాషలకీయవలెనా? రాష్ట్రభాషయగు హిందీకీయవలెనా? అనునది ఒక జటిలమగు సమస్య. ఆంగ్లభాష స్థానమున హిందీని గద్దె నెక్కించిన, మాతృభాష కాని పరభాషలో బోధనవలన నిబ్బంది ఏమంత తొలగునని ఆశపడ వీలు లేదు. మాతృభాషకే ఆ స్థానము నొసగిన బోధనా సౌలభ్య ముండును గాని, ఆయా శాస్త్రములను గఱపుటకవసరమగు పారిభాషిక పదజాలము గాని, భావప్రకటనా శక్తిగాని, గ్రంథసముదాయము గాని, ఇన్ని భాషలలోనూ వెంటనే లభించుట అసంభవము. ఈ భాష లన్నియు నభివృద్ధి చెంది, పుష్టిని, తగువిశాలమైన సాహిత్యమును, పెంపొందించుకొనిన పిమ్మట గాని అట్టి మార్పువలన నష్ట ముండదని ధైర్యము కలుగదు. అంతవఱకు మార్పువలన కొంత నష్టము తప్పదనియే భయముండుట సహజము.

అదియును గాక, ఉన్నతవిద్య నభ్యసించిన విద్యాధికులును, ప్రభుత్వోద్యోగులును, మాతృభాషయందె ప్రవీణులై, తమ కార్యకలాపము లన్నిటిని నిర్వహించుకొనిన దేశైక్యమునకు గూడ దెబ్బ తగలవచ్చును. ప్రత్యేకత, విభిన్నత వృద్ధిచెంది, పరస్పర సహకారము, సామరస్యము తగ్గ నవకాశ ముండును. దేశ సమైక్యదృష్టికి భంగము కలుగకుండ, రాష్ట్రప్రభుత్వ భాషయై విద్యాధికులకును, ప్రజాసామాన్యమునకును గూడ హిందీ భాష పరిచితమైనప్పుడు, ప్రాంతీయభాష లన్నియు విద్యా సంస్థలలో ఆంగ్లమున కున్న స్థానము నాక్రమించుటకు తగిన సామర్థ్యము సంపాదించిన నాడు, ఎట్టి మార్పు వలనను ఎట్టి నష్టమును వుండదు. కాని, త్వరపడిన నష్టము తప్పదు.

అదియును గాక, దేశీయభాషల నట్లు అభివృద్ధి చేయు ప్రయత్నము ముందు జరుగవలెను.

మార్పు తప్పదు కాని, ఆ పిమ్మటకూడ అంతర్జాతీయ వ్యవహారములకై మన కిదివరకు పరిచితమైన ఆంగ్లభాష దేశమున కొంతవరకు నిలచియే యుండును. రాజకీయముగను వటుంచి వైజ్ఞానికముగను, సాంస్కృతికముగను, ఇతర దేశములతో మనకు గల సంబంధములను వ్యవహారములను, సులభముగా నిర్వహించుటకు, పెంపొందించుకొనుటకు ఆంగ్లభాషయే ఉపయోగింపబడవలసియుండును—ప్రపంచ సభ్యత, మానవ నాగరకత, ఏకముఖముగా నడచు దినములు ముందు దగ్గరకు వచ్చినట్లు సూచనలు కనబడుచున్నవి. భవిష్యత్తు నీ దృష్టితో చూచిన మన నాగరకత, మనసాహిత్యము మన ప్రాచీనపరిజ్ఞానము, సంస్కృతి యందలి ఉత్తమ రచనలను భావములను, ప్రపంచమున కందించి, ఇతర భాషల సాహిత్యమును, విజ్ఞానమును, మనము కూడా గ్రహించి ప్రపంచమున భారతదేశమున కొక గౌరవప్రదమైన అర్హస్థానమును సంపాదించి నిలుపుకొనవలెనన్న, మానవజాతి ఐకమత్యభావమునకు, శాంతికి, కల్యాణమునకు మనము కూడ పాటుబడవలెనన్న, ఆంగ్లభాషయే మనకు ఎక్కువగా, ఆ పనుల కుపకరింపగలదు.

కనుక, దేశభాషలకును, రాష్ట్రభాషకును అవసరమగు పుష్టిని, సంపదను, సంపాదించు ప్రయత్నమును, త్వరితముగా సాగించుచు వీలైనంత త్వరలో పరిపాలనా భాషగా, రాష్ట్రభాషను, విద్యాబోధనకు మాతృభాషను క్రమముగ నుపయోగించుచు, ఆంగ్లభాష కిప్పుడున్న ప్రాముఖ్యమును తగ్గించుట అవసరము. కాని, మన కున్న ఆంగ్లభాషా పరిజ్ఞానము తగ్గకుండ, సర్వ అంతర్జాతీయ వ్యవహారములకును, వైజ్ఞానిక, సాంస్కృతిక ప్రయోజనములకును ఉపయోగింప దగిన స్థితిలో, మనము ఆంగ్లభాషను నిలుపుకొనుట కూడ నవసరమే. సామాన్యముగ నందరును, ఆంగ్లభాష నభ్యసింప వలెనను నియమము గాని, ఉన్నత విద్య యంతయు ఆంగ్లమున నే గఱపబడుట గాని, అవసరము లేదు. కాని, విద్యాధికుల కందరకును సముచిత ఆంగ్లభాషా జ్ఞానము నుండవలెనని ఏర్పాటును, అభిలాష, ఆసక్తి, అవసరము. కలవారలకు, ఆంగ్లభాషయందును, అందలి సాహిత్యమునందును, ప్రత్యేక పాండిత్యమును సంపాదించుటకు అవకాశములును, తగ్గకుండ, జాగ్రత్త పడవలెను.

# కలగూరగంప

## శకుంతలోపాఖ్యానము

శ్రీ కొడవంటి శంకరనరసింహబ్రహ్మం

గత (ఆగస్టు) భారతి కలగూరగంపలోని సమాధాన వ్యాసమును గనుఁగొంటిని. దత్సమాధాన పరామర్శన మొనర్చి నా సిద్ధాంతము లెంతవఱకు సుప్రతిష్ఠితములో పర్యవేక్షణ మొనర్చుకొనవలసియున్నది.

మిత్రుల తొలివిమర్శ శీర్షికపైన. ఆ శీర్షికతోడనే శ్రీ మల్లేశ్వరశర్మగారు రుపక్రమింపఁగా నేనును దాని నే గ్రహింపవలసినవాఁడ నైతిని. గారి వ్యాసము వును బరిశీలించు సందర్భములో నిది గాక యే యుచితము! ఈ గాథ సంభవపర్వాంతర్గతమగుట సత్యమే. కాని 'సంభవం భరతస్యాహం చరితం చ మహామతేః శకుంతలాయా శ్చోత్పత్తిం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః దుష్యంతేన చ వీరేణ యథా ప్రాప్తా శకుంతలా' ఈ మొదలుగా జనమేజయునిచేఁ గోరఁబడి వైశంపాయనుఁడీ విస్తర కథన మొనర్చియుండుటచేతను ఇతఃపరకథాభాగమున శకుంతలావృత్తాంతమే ప్రధానముగా నుంటచేతను దీనిని శకుంతలోపాఖ్యానమనుటయే లెస్సయనియుఁ దోఁపకపోదు.

అట నుండుగాఁ గొంత నన్నయ ప్రాభవ విషయము "'వ్యాసునికి మెఱుఁగులు దిద్దె నన్నయ' యన్నదానిలో వ్యాసునిపై గౌరవభావమూ బాధించునది, నన్నయపై నిర్లక్ష్యమూ?" అనియు "వ్యాసులు సమీచీనులై నన్నయ కాకపోయెనా తెలుఁగువారికి?" అనియు ననసన ప్రశ్నకల్పన తొలిప్రశ్నకు నా వ్యాసమందలి మొదటి పేరాలోని కడపంక్తులే సమాధానము గాఁగలవు. శకుంతలోపాఖ్యానమున వ్యాసుని లోపముల నన్నయ సవరించెనను వీరేశ్వరశర్మగారి పలుకులో నెంత సత్యమున్నదో పరామర్శించుటకే యీ నా వ్యాస ముద్దేశింపఁబడినట్లు స్పష్టముగానున్నది. నన్నయ మహానుభావుఁడు గాఁడని కాని యాతఁ డాంధ్రజాతికి భాషకు నొనర్చిన మహోపకారము మరువఁదగినదని కాని యెవ్వఁ డనఁగలఁడు? ఐన నా విషయములు వేఱు. నన్నయ భట్టారకుఁడు సర్వాంధ్రావనికిని సర్వదా సర్వథా వంద్యుఁడై యున్నాఁడు. అటఁ గావలసిన కృతజ్ఞతా భావము (ఆయన చేసినదేమో యథార్థ మెఱుఁగుట) తదితర విషయ పరిశీలనమును గలుషించుచో నది యీ పేరికిఁ దగదు. నిజమునకు నన్నయార్యుని గుణదోషములను రెంటిని నిరూపించవలసిన విమర్శన వీథులలో దోషములను సైతము గుణములని భ్రమించుచోఁ నాయనకు గౌరవముఁ గొనివచ్చుట గాదు.

" 'మూల భారతమునకు కాళిదాసుగారు మెరుగులు దిద్దినార'నిరి. కొన్ని వ్యాసభగవానుని నితర కవులతో బోల్చి తక్కువ పరచుట వారికి సమ్మతమే యనిపించుచున్నది" అని యొక వాక్యము. నా వ్యాసములో నేను వ్యక్తిగత విశేషముల విమర్శింపఁ బూనలేదనియు సంస్కృత భారతాంతర్గత శకుంతలోపాఖ్యానమును నన్నయ యాంధ్రీకరణమును బోల్చి తారతమ్య పరీక్ష యొనర్చినాననియుఁ సర్వజనవిదితమని తలంతును. మఱియు వ్యాసుఁ డొనర్చిన యనౌచిత్యములఁ బరిహరించి యాయన లోపములఁ దీర్చె ననుటయు నాతని రచనకు మెఱుఁగు బెట్టెననుటయు నొక్కటి కావని యెఱుంగవలెను. తొలిదానిలో మూలకారుని దోషోద్ఘాటన మున్నది. రెండవది యాయన మార్గమునే యనుసరించి విస్తరించుటను దెల్పును. "మూలమున నున్న పితా దుహితా శబ్దములనే వాడిన కాళిదాసు మూలమునకు మెరుగెట్లు పెట్టెనో తెలియదు" అనిరి.

కాళిదాసాది పదములయొక్క ప్రాధాన్యమును గుర్తించినాఁడు. ఆ శకుంతలాజన్మవిషయమెల్ల నెఱింగిన వైఖానసులామెను బూర్వి 'దుహిత' అనియే చెప్పినారు. కాని దుష్యంతునకా విషయ మప్పటికి తెలియకుండుటచే నా పదమునకు సామాన్యముగాఁ గుమార్తెయని యర్థము చేసుకొనినాఁడు. భగవంతుఁడైన కాశ్యపుఁడు శాశ్వతబ్రహ్మచారిగదా యాతని కీమె యెట్లు కలిగినదని సహజమైన సందేహ మాతనికిఁ గలిగినది. తన్నివారణార్థమే 'తత్కాత్మజేతి కథమ్' అని ప్రశ్నించినాఁడు. ఇది యెంత స్వభావ సహజము! ఎంత సుందరము!! ఇది మెఱుఁగుఁ బెట్టుట. ఇట మూలకారుని మార్గమునే యనుసరించియు నూత

నావకౌశలము గల్పించుకొని శ్రోతృవిశేషమును గూడఁ గూర్చినాఁడు. ఆ చమత్కార కల్పన కాధారము మూలభావమే కదా.

తెనుఁగు కవు లానందవర్ధనుని యాదేశమును గొంతవఱ కనుసరించిరనియు నాంధ్రీకరణ సందర్భముల యథామూల పరివర్తనమును జేయలేదనియుఁ జెప్పి శ్రీనాథభాషితము నుదాహరించి తెనుఁగుకవులు భాషాంతరీకరణమునను మార్పులు గావించుటకుఁ గొంతవరకు స్వతంత్రత వహించిరని చూపుటకుఁ బ్రయత్నించితిని. మార్పులు నౌచితీసంపాదనార్థమే కావింపవలయుట కానందవర్ధను ననుశాసనము నిచ్చితిని. అంతియేకాని యాట శ్రీనాథుఁడా చెప్పిన దెంతవఱకు సాధించెనో నాప్రసక్తి లేదు. తిక్కనాదుల కవితావిశేషమును జర్చనీయాంశము గాదు. అట్టి స్వతంత్రతఁ గలిగియుండియు ననౌచిత్య భాగము లేవేని యున్న వాని నౌచిత్యవంతములుగా నొనర్చుటకు వినియోగింపవలసిన స్వతంత్రతను వినియోగించియు నౌచిత్యవంతముల ననౌచిత్యదూషితములఁ జేసినాఁడు నన్నయ యని కొన్ని యుదాహరణముల నొసంగితిని. అంతకన్న యథామూల పరివర్తనము లెస్స గదా. "ఏ కవి రచనా శిల్పము వానిదే! ఏ కథాకథన మార్గము వానిదే"నఁట. అట్లని యూరకున్న బాగుండెడిది. కాదని తారతమ్యపరీక్షకు దిగినప్పుడు యథార్థము నన్వేషించి నిరూపింపఁ బ్రయత్నించుట తప్పా?

"మహాభారతబద్ధ నిగూఢితార్థము నే రచనా కౌశలమున వ్యంగ్యవైభవము మెరయ గోరంత వాచ్యము చేసి కొండంత ధ్వనింపచేయఁగూడదా?......అతడే చెప్పెను గదా...లోనారసినగాని మేలనజాలననియు. కావున దురూహ్యమే. ఇతనిరచన ప్రత్యక్షరవ్యంగ్య వైభవ విభాసితము" అని యొకచోట. రాజు సభామధ్యమున నన్నయభట్టును గోరినది 'భారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు'మని. ఇట బద్ధ, నిరూపిత, ఏర్పడ శబ్దముల స్వారస్యమును గనుఁడు. సంస్కృతమున నర్థము బంధింపబడి యున్నది. అనఁగా గూఢముగా నున్నదనుట. దానిని నిరూపించవలయును. అట్టి నిరూపితా (సుప్రకటితా)ర్థము నేర్పడునట్లుగా తేటతెల్లముగా (తెనుఁగున) రచింపుమని కోరెను. సంస్కృతమను కోశగర్భమున బంధింపఁబడిన యర్థసంపదను నిరూపించి యెల్లఱకును గొల్లగా నొసంగుటకై యీ ప్రయత్నము. నన్నయ భట్టారకుఁడు నందులకుఁ బూనుకొనినాఁడు. 'ప్రసన్న కథాకలితార్థయుక్తి'* మేలనునట్లుగా నిర్వహింతునని ప్రతిజ్ఞ యొనర్చినాఁడు. ప్రసన్నత యనఁగా శబ్దార్థముల స్ఫుటతిస్ఫూర్తియే కదా! అట్టి విధముగాఁ జెప్పిన తన కథాకవిత (*Narrative Poetry*) యందలి (మూల) అర్థ సంఘటనము యనవలెనఁట. ఇదియే కదా యేర్పడ రచించుట. ఎఱ్ఱన యేమనుచున్నాఁడో యాలకింపుఁడు.

"భాసుర భారతార్థముల
  భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు
  త్రవ్వు తెనుంగువారికిన్
వ్యాసుని ప్రణీతి పరమార్థము
  తెల్లఁగఁ జేసినట్టి యా
శాసన కల్పులన్ దలఁతు నాద్యుల
  నన్నయ తిక్కనార్యులన్."

ఇట్టిపట్టున నన్నయ చెప్పినదానికన్న సూచించిన దెక్కువనుట యసంబద్ధము. అతని రచన "దురూహ్య"మనుట భారతోపక్రమశ్లోకార్థము నెఱుఁగకుండుటే. లేనిచో నర్థనిరూపణావసరమే పట్టి యేర్పడఁ దెల్పుట కావలసివచ్చునుగదా! నన్నయరచన "ప్రత్యక్షరవ్యంగ్యవైభవ విభాసిత"మఁట. ఇది విమర్శనగా? కవిత్వమా? అతిశయోక్తులకు నాద్యగ్రసునిశితవిమర్శనపద్ధతులలోఁ దావు లేదు. ఈ విమర్శకులు ప్రత్యక్షరవ్యంగ్యవైభవము నుదాహరణపూర్వముగా నిరూపించియుండిన బాగుండెడిది కదా.

ఇఁక నీ యల్పవిషయములనటుంచి ప్రధానార్థమునకు వత్తము. పితృ, గురుత్వశబ్దములను నన్నయ గావించిన జనక, ఆత్మజ శబ్దముల మార్పునుగూర్చి (విగతార్థమున నే—నా ముందు వ్యాసమున విశేషార్థమున) విజ్ఞుల మాట యెట్లున్నను రసికులకుఁ జెప్పనక్కరలేదు. "వ్యాసశకుంతలకు కణ్వుడు పాలనపోషణకర్తగనే భావన. నన్నయ శకుంతలకు కన్నతండ్రిగ — ఏది యుత్కృష్టమో మానుఁడు" అని హెచ్చరిక. నన్నయ భారతగాథ ననుసరించియైనఁ గణ్వుఁడు శకుంతలకు జనకుఁడా (జనితా)? రక్షించినవారలను 'నాతండ్రి' అనుట లోకసిద్ధము గాని 'నా కన్నతండ్రీ' అనుట కాదే. (అభినవ) కవిసార్వభౌములును దనకు మహోపకృతిఁ జేసిన శ్రీరామచంద్రునిఁ గూర్చి శతానందుని వాక్యముగా

శా. ఏమీ! యమ్మహిళాతపస్వినియుఁ
  దా నీకుఱ్ఱ కాదీనినన్
శ్రీమన్మోహన మానుషాకృతిని
  దాల్చేక్ జెప్పవే గాధిసూ-
తీ! మా తండ్రియు రామచంద్రుఁ
  డితఁడౌనే రాఘవుం డేమి నో

* 'కవిత' అను ఈ పాఠము కొత్తదిగా నున్నది. సం.

హో! మాయమ్మ యహల్య
యిప్పటికి నొప్పక శాపనిష్కృరమై.

అని బల్కించినచోట 'మా తండ్రియు రామ చంద్రుండు' నియు 'మా యమ్మ యహల్య' యనియు నొకదానిక్రింద నొకటి చెప్పింపఁగల్గియుఁ దండ్రి యనుమాత్రమే కాని కన్నతండ్రి యని యనిపింపఁ జాలకపోయెనుకదా. ఈ రూఢతకు శాస్త్రవాక్య మునకుఁ దప్పక సంబంధమున్నది. 'అట్టిచో నీ కన్న తండ్రి యను భావన యసద్భావన గాక యేమగును? మఱి యిట్టి కన్నతండ్రిభావన లేకున్నచోఁ గాళి దాసుని చతుర్థాంకస్వారస్య మేమున్నదని ప్రశ్న. ఇది కేవల మనాలోచిత జల్పనమని నా మనవి. 'యాస్యత్యద్యే'తి శ్లోకము (4.6) లోని 'వైక్లబ్యం మమ తావ దీదృశ మహో స్నేహా దరణ్యౌకసః పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖైర్నవైః" అను కాళిదాసోక్తిని యందలి యావదర్థపదోక్తి విద్యానిరూఢిని మా మిత్రులు గుర్తించియుండిన నిట్లనియుండెడివారు గారని తలంతును. 'మమ', 'అరణ్యౌకసః' అనుటకు 'తనయా', 'గృహిణః' శబ్దములు వ్యతిరేకస్ఫోరకములు. కష్టముల కల వాటుగా నరణ్యమున నున్నట్టి పోషకుఁడుమాత్ర మైన తనకే వైక్లబ్యకారణమైనచో సుఖముగా గృహముల వసించెడువారలకుఁ దమకుఁ బుట్టిన కుమార్తెల విషయకమైన యెడబాటు దా నెంత పీడాకరముగునోగదా యని యాశ్చర్యచకితుఁడైనాఁడు మహాముని. "తనయావిశ్లేషదుఃఖైః సాక్షాదాత్మజ విరహవ్యథాభిః శరీర భూతత్వాత్ సంవర్ధనాదినా స్నేహోచ్ఛ్రయథా దుస్సహై రిత్యర్థః" అని శ్రీనివాసాచార్యుల వ్యాఖ్య తనకుఁ గలిగినది వైక్లబ్యమే, వారలకు పీడ. ఇట ప్రతిపద స్వారస్యమున్నది. 'అహో' అనుటచే నిట శ్లోకము నతిశయించి శాంత భావ మంగిగాఁ బ్రకటితమైనది. ఇది కదా ప్రత్యక్షర వ్యంగ్యవైభవ సూచనాప్రాయము. ఈ శ్లోక పర్యాలోకనమునఁ జతుర్థాంక రసానుభూతికి కన్న తండ్రి భావన లేకుండుటయు నవసరము లేకుండు టయే కాక బాధకము గూడఁ గాఁగలదు. మఱియు నీ పట్టున నింకొక్కటి. "భయత్రాణ మనగా— ఆపద్భయమునుండియు, భవభయమునుండియు నని తెలియదగును. కావనే గురువుల మనెను" అని సమా ధాన కల్పన. శకుంతలకుఁ గణ్వుఁడు భవభయమును దొలఁగించినట్లు పురుష్యకుల కే రహస్య వార్తాహారుల వల్లఁ దెలియవచ్చినదో కదా! ఈ సందర్భమున మల్లే శ్వర శర్మగారి వ్యాసమున 6 వ చిహ్నముగల పేరా (పు. 85. కాలం. 2. పే. 2) చూడదగును నన్నయ భట్టు గురువు లెవ్వరో కూడ నట నే నిర్ణయించియు న్నాఁడు. అట నీ భవభయత్రాత వేఱుగాఁ గనఁ బడదే!

తరువాత మేనకా విశ్వామిత్ర ఘట్టము. అస లిది చెప్పవలయు కారణమేమని తొలి విచారణ. ఒక సమాధానాభాసము. మూల కథయందుఁ గారణ మున్నది. 'శకుంతలాయా శ్చోత్పత్తిం శ్రోతు మిచ్ఛామి' అని జనమేజయుని కోరిక. ఆ విషయ వివరణకై యొక యవకాశ కల్పన. పునరుక్తి లేకుం డుటకై కణ్వుఁ డింకొకరితోఁ జెప్పినట్లుగా శకుంతల నోట. ఇఁక నన్నయ భారత కథయందీ జనమేజయ ప్రశ్న లేకుండుటచే నసలు కారణమే లేదు. కావున నీ కథాభాగ మెల్ల నప్రస్తుతమే; తొలఁగింప నయ్యెడిది. అయినను నన్నయ యీ యనౌచిత్య కల్పనఁ గావించి నాఁడు. మఱి 'దిగంబరయై సిగ్గుతో భూమికి దిగి' అను సున్నితమైన కథా కథనమునకు 'బయల్పడియె వల్దకుచంబులుఁ గక్షయుగ్మమున్' మొదలైన వివరణ మునకు భేదము లేదన్నచో నిఁక విచక్షణతకు స్వస్తి. వస్తు వొకటేయైన నుక్తి విధానమున నుచితానుచిత ములు గలవనుటకు లక్షణికుఁడైన దండివాక్యమే ప్రమాణము 'కన్యే కామయమానం మాం నత్వం కామయసే కథం ఇతి గ్రామ్యోఽయ మర్థాత్మా వైరస్యాయైవ కల్పతే' అనియు 'కామం కందర్ప చండాలో మయి వామాక్షి నిర్దయః త్వయి నిర్మత్సరో

వేటూరి—

దిష్ట్యే త్వగ్రామ్యోర్ధ్వో రసావహాః' అనియు నా మహామహుని యూహించెను. రెంటను చెప్పఁదలఁచిన భావార్థ మొక్కటేయైనను నీ నీరసత్వ రసావహత్వము లుక్తివిధాన భేదమునఁ దటస్థించినవే కదా! అది యట్లుంచి యీ విమర్శకుల సమాధానసారమును గనుఁడు. "ఇచ్చట దుష్యంతుఁడు మరింత సందేహాస్పదుఁడగును." మఱికొన్ని విషయముల గురించి కూడ సందేహాస్పదుఁ డగునేమో? శకుంతల యవికూడఁ జెప్పవలసినది పాపము! తాను మేనకా విశ్వామిత్రుల తనయ నని చెప్పినచో నా రివరకు నెట్టి సంఘటన గల్గినదని రాజు సంగ్రహించునఁట. అది తీఱుటకై, కొఁగుకొట్టి సందేహము గలుగకుండుటకై మేనక 'వల్కలవంబు'ల నివయసులో నున్న మునిబాలిక యా నాగరిక పరపురుషునితోఁ బ్రస్తావించెనఁట. ఇంకను బరిశీలింపుఁడు. "అదియును గాక తనతండ్రి వచ్చువనుక దుష్యంతుఁడు తన కతిథి గాన నాతనితో మాట్లాడుచుండవలెను. అప్రస్తుతమును, రసభంగకరమును నైన విషయము పనికిరాదు కదా?" ఆహా! ఎక్కడిదో యీ శాస్త్రమర్యాదలు. తమ యిండ్లకెవ్వరేని వచ్చినప్పుడు తమ యాఁడుపిల్లలింటిలోనుండి యీ వలకు వచ్చి 'వారు లేర'ని చెప్పఁగా 'నీ వెవరిపిల్లవమ్మాయి!' అని యాగంతుకుఁ డడిగినచో నా పిల్ల తనతండ్రి వచ్చునంతకు నాతని మాటలాడించవలయుటయు రసవంతముగా మాటలాడవలయుటయు ధర్మము లన్నమాట. ఆ రసవంతములైన మాటలు నెట్టివిగా నుండవలెనో యీ ఘట్టమునుబట్టి నేర్చుకొనవలసినట్లున్నది. "అదియు గాక ఆత్మకథ చెప్పుచున్నది. ఎంత యుత్సాహముండును." ఆయుత్సాహావేశములో నింకను నేవేవో చెప్పక యింతటితో విడిచినందులకైన సంతోషింతము. ఇది యేమిరసమో నాకుఁ దెలియదు. రసికశేఖరుల కీ విషయనిర్ణయభారము వదలుచున్నాను. పైగాఁ బరపురుషుఁడైనఁ దప్పేయైనను గాఁబోవు భర్తగనుక సప్రయోజకమఁట! కాఁబోవు విషయములఁ బట్టి గతించిన నడవడికయొక్క ధర్మాధర్మ నిర్ణయమా? ఒక యువతియు యువకుఁడును స్వేచ్ఛావిహారులై సంచరించియుఁ బరిస్థితులు వికటించి, తప్పక, పెండ్లియొనర్చుకొన్నచోఁ గాఁబోవు దంపతులు గనుక వారి పూర్వపు నడత మంచిదనఁ జెల్లునా? సాధుతా నిర్ణయముపట్ల నిదియా నిదానము? "నేఁటి మన పరిసంఘటనములతో మన నాగరికతాదృక్పథముతో నాఁటి యాశ్రమమర్యాదల జూడఁగూడ"దఁట. "కాళిదాసుని శకుంతలకును వ్యాసుని శకుంతలకును భేదముండవచ్చు"నఁట. ఇట మా మిత్రులు సాధింప యత్నించుచున్నది నన్నయ శకుంతల ప్రవర్తనకు నందలి సాధుత్వము. మననాఁటను, కాళిదాసుని నాఁటను, వ్యాసునినాఁటను కూడ లేని నూతన ధర్మప్రమాణము నీనాఁట నున్నదని వారివారి సారాంశము. ఏనను దత్తత్ప్రతిగుణములఁ జూచిన నిచ్చటి కల్పన మనౌచిత్యదూషిత మని పై వాక్యములచే నొప్పుకొనకయు నొప్పుకొనినట్లైనది. ఇంతకును వారీ సమాధానపద్ధతిచే నన్నయకుఁ దెచ్చిపెట్టినది గౌరవమో యన్యమో సహృదయు లూహించుకొనఁ గలరు.

ఇఁక 'ఉతి రుచిరాగతుండయునః' అను పద్యార్థమును గూర్చి. నా విమర్శనమున నేను సంస్కృతిభాగమునకు వ్యాసభగవానుని భావమును వివరించినాను. అది దండాన్వయముగాఁ బోవపడి మన్మిత్రులది సరిగా లేదనియు నింకను నేమేమో వ్రాసినారు. మఱియు రాజును డెబ్బదిమంది సముఖ తప్పఁట. ఇతరులెవ్వరును లేరఁట. పరిశీలింపవలసినగని వారికి నామనవి. 'ద్రుమాః కుసుమ శాఖినః పుష్పవృష్టిం విచిత్రాంను వ్యసృజంస్తే పునః పునః' ఇత్యాదిగాఁ జెప్పఁబడిన వనుక రాజు వనముఁజొచ్చి కొంతదూర మేగినట్లును మీఁదట "మహాష్టం కౌశ్యపం శ్రేష్ఠ గాఢ తపోధనం ధ్వజినీ మశ్వసంబాధాం పదాతి గజసంకులాం అవస్థాప్య' అని చెప్పఁబడినది. కావునఁ బైపుష్పవృష్టిసమయమునకుఁ బరితరులును గలరనుట నిర్వివాదము నన్నయయు నీ సేనలు పట్టుటను 17 వ పద్యమునఁ జెప్పి "చని చని ముందట" నని 22 వ పద్యమును రచించి "వలయు ననాత్యులన్ దగినవారల నుండఁగఁ బంచి" అని 26 వ పద్యముచే నంతఃపురజనముతో నొంటి స్పష్టపఱచినాఁడు. "పూలు రాలుటకు కారణమును చూపవలెనుగదా?" అని యాదినారాయణగారు సంగ్రహించినారు. పక్షుల యెలజడియే దానికిఁ గారణముగా మూలకారుఁడు నిర్ణయించినాఁడనియు నదియే నన్నయ కల్పించిన సుమ్మెలల సంతలనముకన్న (సంపతత్ అనునది నిపాతమును వివరించును) సుందరమును సహజమును నని యేఁబుంగవలెను. ఇప్పటిన వాల్మీకమును గనుఁడు—ఉత్పేతుశ్చ ద్విజగణాః పక్షిసంస్థాః సమాహతాః అనేకవర్ణ విహగా మముచుః పుష్పవృష్టయః—పక్షు లెగిరిపోయినవని వ్యాసుఁడు వాచ్యముగా జెప్పలేదు, నిజమే, కూడినవనెను. నిశ్చలమును ప్రశాంతమునైన వనవాటికలో వృక్షాగ్రములఁ బక్షులుండ రథాశ్వగజసమ్మర్దముగా జనముందుఁ బ్రవేశించుచో నా ప్రశాంతతకు భంగము సంభవించి పక్షులు సంచలించుచు—ఎగిరిపోవుచు మరల వ్రాలుచు—కూయుట స్వభావసిద్ధమును సహజసుందరమును నని చెప్పనక్కర లేదుకదా! ఆ సంక్షోభమునఁ బుట్టిన గాలిచేత పూలు రాలుట జరిగినది. ఈ విషయమును దృష్టించినాఁడు కవి. ఇది

బాహ్యవిషయము. ఈ మాత్రమును జిత్రించినను 'స్వభావోక్తి' యని మెచ్చుకొనియుందుము. కాని కవి యాశించుకొనుట కింతమాత్రము చాలదు. "దర్శనాత్ వర్ణనాచ్చాథ లోకే రూఢా కవిశ్రుతిః" అని భట్టతేతుని గమనిక; 'విచిత్రభావ ధర్మాంశ తత్త్వప్రఖ్యా చ దర్శనమ్' అని వివరణము. 'కనుఁగొనుకంటె నద్భుతముగా వెలిఁగింతు రతీంద్రియార్థముల్...... సత్కవుల్'. ఈ కవియు నా సంఘటనయం దొక దివ్యభావమును దర్శించినాఁడు; మహోదాత్త ధర్మమును గుర్తించినాఁడు; దానా యతీంద్రియార్థము నిటఁ జిత్రించినాఁడు. నే నాసమస్తమును విపులముగా వివరింపక సూచనగా "ద్విజాశీర్వాదములతోఁ జేతులెత్తి పూలు చల్లి యభ్యాగతుని సత్కరించు నీతి చెట్లును నెట్లు నేర్చెనో యనిపించి కణ్వాశ్రమప్రభావ మని సూచించెనని వ్రాసియుంటిని. అసలీ ఘట్టము నే యర్థము చేసుకొనక, నా వాక్యమును గుర్తింపక "వృక్షములు కర్తృత్వము వహించి కోరి వదలుచున్నవని యర్థము." ఇత్యాదిగా సూ మిత్రు లేమేమో నే నెరుంగనిది చెప్పుచున్నట్లు వ్రాసిరి. అట్టుచుట నిప్పుడిటు సంపూర్ణముగా వివరింపవలసివచ్చినది. తత్పూర్వమింకొక విషయము. స్త్రీలు మేడలెక్కి పూలు చల్లుట నాగరకపద్ధతి యనియు ఋషివాటికల నాశీర్వాక్కులతో నక్షతలు చల్లుట స్త్రీజనము కాక మునులే చేయు టాచారమును ధర్మము ననియు నేను వ్రాసిన దాని కాదినారాయణగారు గావించిన యాక్షేపమును కాళిదాస నవమాలికావృత్తాంత నిదర్శనము సమ్యక్కులు. త్రోవలోఁ దారసిల్లిన రాజు నాశీర్వదించినది వైఖానసులు. నవమాలికాగులు పూలను జల్లలేదు, రాజు త్రోవం దారసిల్లిన వాఁడును గాఁడు. ఇఁక రెండవది. పక్షులు బెదరిన వనుట తప్పఁట. ఎల? కాళిదాసు 'విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహంతే మృగాః' అనెనఁట. ఆదినారాయణగారప్పటి 'మృగాః' అను శబ్దసారస్యమున గ్రహింపరైరి. లేళ్లను దపోవనవాసులు పెంచి మచ్చిక చేయుచుండెనే కననగునుకదా! పెంపుడులేళ్లు బెదరలేదు. ఇది సాధారణముగా నాస్థల మాత్రమున్నపొంత మనుట రాజు గుర్తించెను. కాళిదాస కవితావిశేషముల గుర్తింపక యిట పక్షులెట్లు బెదురునని యాక్షేపణమేమి? పక్షులం బెంచుట రాణివాసములఁగాని మునివాసములఁగాదు. ఈ శంకల కిట్లు సమాధాన మిచ్చి యిఁక ప్రధానఘట్టవివరణము వత్తము. దుష్యంతుఁ డింటినుండి బయలువెడలిన సందర్భములో 'తాః స్త్రియః ప్రేక్ష్య నరాధిపం తుష్టువుః పుష్పవృష్టిం చ ససృజుస్తస్యమూర్ధని' అని వ్యాసభగవానుఁడు దెల్పియున్నాఁడు. ఇది నగర విషయము. మఱి యిటనో 'ద్రుమాః కుసుమశాఖినః పుష్పవృష్టిం విచిత్రాం తు వ్యసృజంస్తే పునఃపునః' అని చెప్పెనాఁడు. ఇట వృక్షకర్తృకమే కాదసలు విశేషము; 'ద్రుమాః' అను పదప్రయోగము. అది పుంలింగ బహువచనరూపము. కుసుమశాఖినః — చేతులయందు పూలుగల మునిజనముతో సామ్య మిట ధ్వనితము. బహువచనసారస్యముచేఁ ద్రోవపొడుగునను దన కెదురైన యట్టి యనుట. ఇట్లు కావించినది జడములైన వృక్షములగుటచే మును లొనర్పవలసిన సత్కారము నివియును జేయఁగడంగుట యా స్థలవిశేష మని భావన. ఈ యతీంద్రియార్థ పరంపరను తాను స్వయముగా దర్శించి వ్యంగ్యముఖమునఁ జిత్రించినాఁడు వ్యాసభగవానుఁడు. నన్నయ 'లతాలలనల' విషయము. ముత్తైదువలు సేసలు జల్లరాదా యని ప్రశ్న. స్త్రీజన మట్లు చేయుట మున్యాశ్రమ ధర్మము గాదని చెప్పియే యుంటిని. మఱియును వారు 'లలన'లఁట లలన యను పదము స్త్రీసామాన్యవాచి గాదు, విశేషవాచకము, 'లలతి విలసతీతి లలనా' అని వ్యుత్పత్తి. విలాసవతులని యర్థము. ఇఁక దాని యౌచిత్యమెంతవఱకో చదువరులే గ్రహింపఁగలరు.

'తన్వీ, పయోజదళాయతాక్షి *' పద్యమును గూర్చి "ఈవర్ణనము చేసినది కవియా దుష్యంతుఁడా? దుష్యంతుఁడేయైన నష్టమేమి?" అని రెండు ప్రశ్నలు. కవి మాటలుగనే యున్నమాట నిజమే. కాని యిట వర్ణన ప్రధానము గాదు, దుష్యంతుఁ డా శకుంతలను జూచెనని చెప్పుటయే విధేయాంశము. కావున నిది వర్ణనఁగాదు, కవి చేసిన వర్ణనము గాదు దుష్యంతుఁ డీవర్ణనఁ జేసెననుటయు సందర్భము లేనిమాట. ఐనచో నిఁక నేమందురా? కవి దుష్యంతుఁడు శకుంతలను జూచెనను విషయమును జెప్పుచు నెట్టి దానిఁగాఁ జూచెనో యనఁగా నాతని దృష్టి ప్రసరించిన తావులేవో సూచించె నన్నమాట. ఇది కామాంధమైన దృష్టి గాదా? అనుచో మిగిలిన సమాధానభాగము నిఁకఁ బరామర్శింపనక్కర లేదు.

కణ్వునిశిష్యు లేమైరని మల్లేశ్వరశర్మగారు శంకించుట దుష్యంతుఁడు వచ్చునాఁటిమాట గాదఁట. ఆదినారాయణగారు శర్మగారి వ్యాసమునందలి 1 గా గుర్తింపబడిన పేరాను (82 పు. 2 కాలం. 2 పేరా) చదివినట్లు లేదు. లేనిచోఁ జదువఁ బ్రార్థితులు.

శకుంతలా దుష్యంతులలో నెవరు భయపడవలసినదను చర్చ. "తండ్రికి చెప్పకుండ వరుడు దొరుకగనే స్వతంత్రించి వివాహమాడిన శకుంతల భయమం

గుట యీ పాత్ర కెంతయు మెరుగు" అని యొక వాక్యము. వ్యాస శకుంతల యట్లు చేయలేదు. పైఁగాఁ దపస్సుచేతను దమముచేతను విరాజిల్లుచుండినది. నన్నయగారి శకుంతల కిట్టి దపోదమమ్ములున్నట్టు తోపకున్నను "అనంత విలాసంబున జయంతుం డెపోలె నున్న దుష్యంతుని చూచి బహుశః చకితయైనను దన తండ్రి యంతలో రాఁగలఁడనియు వచ్చిన వెనుక నాతఁ డొసంగినఁ దన్నుఁ గైకొనవచ్చు ననియే చెప్పినది కాని స్వతంత్రించి వరుఁడు దొరకఁగనే వివాహమాడలేదే! ఆమెపై యీ వట్టి దూఱేల? ఈ యపనింద నామెకుఁ గట్టి యామెయే భయపడవలసినదని నిర్ణయమా? ఏమి యన్యాయము? "దుష్యంతుఁడు సర్వసంగపరిత్యాగియై సన్యసింప వచ్చెనా ఆశ్రమమునకు?" లేదు కంటఁబడిన కాంతా జనమును గరగ్రహణ మొనరింపవచ్చెను. అసఁగాక, పరాధీనయైన ఋషివాటికలోని బాలికను రహస్యమును నిర్మంత్రకమునైన వివాహవిధాన మొకటున్నదని ధర్మసూత్రమును వల్లించి కలంచి వెనుక చూడక పలాయితుఁడైన దుష్యంతుఁడే భయంపడవలయుఁగాక. "దుష్యంతుఁడు చేసినది విధిచోదిత ధర్మమే కనుక భయమక్కర లేదు. కణ్వుఁ డటి పట్టుల కనలఁడని దుష్యంతు డెరుఁగును" అని రెండు సత్కల్పనలు విధిచోదితధర్మముఁట. అనఁగా బుద్ధిపూర్వకముగాఁ జేయలేదనియా? శకుంతల "వరుడు దొరకఁగనే స్వతంత్రించి వివాహమాడిన"దఁట, ఇతఁడు "విధిచోదితుఁ"డఁట! ఇది వ్యత్యస్త సృష్టి. 'అంతయు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె" (భా. ఆది 4.76) సభామధ్యమున శకుంతలం దిరస్కరించినవాఁడు దుష్యంతుఁడు! ఎట్టనేని ఏ యల్పదోష మేని నిరూపింపఁబడనిది శకుంతల! ధర్మాధర్మము లెటి తగులూరొందెను! కాదు "విధిచోదిత ధర్మ" మనఁగా శాస్త్ర నిర్ణయమైన విధాన మని యూహ యందురా? అట్టిచో దుష్యంతునకు విధిచోదితధర్మమైన గాంధర్వము శకుంతలకుఁ గాదా? 'తనకు మఱి తాన చుట్టంబు దాన తనకు గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ వనజనేత్రి! గాంధర్వ వివాహ మతి రహస్యమును నమంత్రకమును నగుచు నొప్పు' (భా. ఆ. 4. 58). అట్టిచో శకుంతల మాత్ర మేల భయపడవలె? ఈ సమస్తమును జల్పనామాత్రము. యథార్థమును బరిశీలింపుఁడు. "నీకును నాకును నెమ్మిఁ బరస్పర ప్రేమంబు కాముండు పెంపఁదొడఁగె.' (4. 55) యనుచున్నాఁడు దుష్యంతుఁడు. ఇది తనపట్ల నిక్కము. ఆమె యెడ నాతని భ్రమ గావచ్చును. 'సర్వం తత్కాల మత్పరాయణ మహో కామీ స్వతాం పశ్యతి' అను కాళిదాసోక్తి నాలకింపుఁడు. మఱియు 'నీ వల్కలాజినములకు నీ వన్య ఫలాశనములకు నీ పటుపర్ణకుటీరావాసములకు నుచితిమె నీ విలసితరూపకాంతి నిర్మలగుణముల్.' ఈ మునిపల్లెనుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగా భామిని! నాకు భార్యవయి భాసురలీల నశేష రాజ్యలక్ష్మి మహనీయ సౌఖ్యముల మేలుగ నందు మనిందితేందుపాదామల తుంగ హర్మ్యముల హేరి హిరణ్మయ కుట్టిమంబులన్' (4.53, 54) అని యాశచూపినాఁడు. చూపి గాంధర్వవిధిని వివాహము కమ్మన్నాఁడు. అందుకు శకుంతల 'ఇంతకు మదీయజనకులు చనుదెంతురు వారు వచ్చి నీ కిచ్చిరేనిఁ బాణిగ్రహణము సేయుము నన్నుఁ' (4.56) అని ధర్మబద్ధమైన సమాధాన మిచ్చినది. 'ఇచ్చిరేని' అని యన్నది. ఈయకున్న? ఏల యీ సందర్భమునఁ బలుకుట. గాంధర్వ వివాహధర్మము నుపన్యసించినాఁడు. 'అని దుష్యంతుఁడు గాంధర్వ స్వరూపంబు చెప్పి శకుంతల నొడంబఱిచి' (4-59) నాఁడఁట. వరూధినీ ప్రవరాఖ్యమునందు స్వైరిణకుఁ దబలుట లేదా? గొంటువనం బెఱుంగక తంగటజుంటి చంచంబున నొంటిపాటునఁజిక్కిన ప్రవరుని నొడంబఱుమనప్పటి వరూధిని తిత్తిఱము కన్నులఁ గట్టలేదా? ఇఁక చాలును; తప్పెవరిదో తేలిపోయినది. సత్యమునకు దుష్యంతుఁ డొనర్చినది ధర్మబద్ధమే యైనచో నాతఁ డెద్దానిని ధర్మబద్ధమనియే తలంచినచోఁ గణ్వుని చూచుటయే ప్రయోజనముగావచ్చిన తాను ఫలాహారణార్థమేగిన కణ్వుని 'ఇంతలో' రాఁగల కణ్వుని సమాగమనమునకై యాగక పుట్టి మునిగిపోయినట్లు 'శ్రీఘ్రబుద్ధిః పలాయన'మ్మను మంత్రము నేల పఠింప వలసివచ్చెను? ఇది దోషాంతఃకరణ ప్రభావము!

ఈ వ్యాసమింతటితో ముగించి ప్రచురణార్థమై తే 17-8-55 ది నాఁటికె 'భారతి' సంపాదకులకుఁ బంపియుంటిని. కాని కాలాభావముననో స్థలాభావముననో వారిద్దానిని సెప్టెంబరు సంచికలో ముద్రింపక యిచ్చట సెప్టెంబరు సంచికలోని సంగమేశ్వరరావుగారి వ్యాసమునకుఁ గూడ సమాధాన మొసంగు నవకాశము నా కిచ్చినారు. ఇందలి పెక్కు విషయములకు — ముఖ్యముగాఁ బ్రధాన విషయముల కెల్ల — నీ వ్యాసపు పూర్వభాగముననే సమాధానము గలదు. ఇంతకు నీ వ్యాసకర్తలు నన్నయ విశ్వతోముఖ మాహాత్మ్యవాదులు గారు. పైఁగా మూలభిన్నుఁడై యనుచితపదప్రయోగమును నన్నయ గావించినట్లు "'ఖాండవ'పద మనుచితప్రయోగము గానట్లు దోచుచున్నది", "నన్నయ వ్రాసిన 'అమ్మని యల్గి చూచు

డును నాతుణమాత్రన గోత్రధారు ణీధ్రసుమ్ముఁలు...' యను పద్యము సంశోభితముగ నున్నట్లు గన్పట్టగు", "క్షోపపహృతాలి భామలు వోవ నోవరే' యనుటకన్న 'ప్రదీప్తం పావకమివ కథ మస్మద్విధా బాలా త మభిస్పృశేత్' అనుట మెరుగుగా నున్నట్లున్నది" ఈ మొదలగువానిచే వారు నంగీకరించినారు. నే నన్నదియు నంతకన్న వేఱు గాదుగదా! ఇవను వారి వ్యాసమునందలి యొండు రెండు విషయముల నిట స్పృశించి ముగింతును.

"కొండొకచో నేయొక్క శ్లోకపాదము తన యభిప్రాయమును ఖండించునో దానిని విడిచి"నట్లును "తమ వాదమును వ్యతిరేకించునట్లున్న యాఖరు పాదమును మాత్రము విడిచి మిగతా పాదములను వ్రాసి"నట్లును నాపై నేరారోపణ మొనర్చి 'దివస్పృశో సంఘుష్టాః పక్షిభి ర్మధురస్వనైః, విరేజుః పాదపా స్తత్ర విచిత్ర కుసుమాంబరాః' అన్నది యటి పరిత్యక్త శ్లోకమునియుఁ దానివలన "ఇఱు గెలంకుల నాకాశమునంటు వృక్షములపై విచిత్ర కుసుమాంబరములు ధరించిన స్త్రీలు పుష్పవృష్టి నాతని శిరస్సుపై జారవిడిచిన ట్లాతనికి భాసింపఁజేయుట తెలియుఁ డనుఁనియు నీ విమర్శకు లధిక్షేపించిరి. ఈ సందర్భమును గొంత యీ వ్యాసపూర్వభాగమునఁ జర్చించియున్నాను. ఇట 'కుసుమశోభితాః' అన్న యీ విమర్శకుల పాఠ మసాధువు; 'కుసుమశాఖినః' అనుట యొప్పు. ఇక నియ్యెడఁ గల 'పాదపాః' అను పుంలింగ బహువచనసారస్యము చేతను, 'కుసుమాంబర' (*Saffron dress*) శబ్దసమా త్త్వని విశేషము చేతను ఋషిసంఘమే యిట వ్యంజితమనియు నిది నావాదమునకే యుపస్కారకమనియు వారెఱుంగుదురుగాక! ఇట వనస్త్రీల సూచన కించిన్మాత్రమును లేదని తెలియవలెను. నా సిద్ధాంతమును బలపఱచు నీ శ్లోకమును సైతము స్మరణకుఁ దెచ్చినందులకు విమర్శకులకు నేను కృతజ్ఞుఁడను.

ఇంకొక విషయము శకుంతల భయపడినట్లు నన్నయ వ్రాయుట సరియైనదా కాదా యనునది గాఢ చర్చితాంశము. వ్యాసభగవానుఁడు దుష్యంతుని భీతునిగా నిరూపింప నన్నయ తద్వ్యతిరేక మార్గమును ద్రొక్కుట చమత్కారతరమా యని మాత్రమే. శ్రీ ఆదినారాయణగారి నన్నయ పథ సమర్థనము వివాదాంశనిర్ధారకము గాఁగలదు. కాఁగా 'భీతానా' అను మూలకారవాక్యముచే నా పూర్వనిర్ణయము కెట్టి బాధయుఁ గలుగఁబోదు.

వ్యాసులిలోపముల నన్నయ సరిదిద్దెనను శ్రీ రేవ్యగశర్మగారి ప్రతిజ్ఞకును "మొత్తమున తేలిన విషయములు"గా "మూలమునన్న సొగసులను, సహజ సౌందర్యవర్ణనలను, స్వభావోక్తులను కొన్నిచోట్ల నన్నయ వదలి వేసి"నట్లును, "చాలవఱకు మూలము ననుసరించి కథాప్రాధాన్యత చెడకుండ వ్రాసి"నట్లును, "అతని కవితయందలి సొగసు లనేకములు మూలమునందలి వే" యైనట్లును, "సాధ్యమగునంత వఱకు మూలమునందలి సొగసుల తెనుగునకు దేల్చి"నట్లును సంగమేశ్వరరావుగారు సాధించిన సిద్ధాంతమునకును గల సంబంధము విచక్షణు లెఱుంగకపోరు.

"కేవలము నన్నయను బొగడువానినిగూర్చి" కోపము నాకున్నదనుట పొరపాటు. నా కెవ్వరిం గూర్చియుఁ గోపము లేదు. ఇఁక నేమన 'కేవలము పొగడు' నాచారముమాత్రము తగదనియు గుణదోషముల రెంటిని నిర్ణయించుటయు యథార్థనిరూపణ మొనర్చుటయు విమర్శకపద్ధతి యని మాత్రము హెచ్చరించుచు నీ విషయమును విస్తరభీతిచే నింతటితో ముగింతును.

---

* ఈ చర్చను ఇంతటితో ముగింపు చేస్తున్నాము. —సం

# చిత్ర కళా ప్రదర్శనము

ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ హెచ్. వి. రామగోపాల్ కళాకౌశలాన్ని సమగ్రరూపంలో అవగతం చేసుకోవటానికి మద్రాసు ప్రజలకు ఇటీవల ఒక మంచి అవకాశం లభించింది. తాము అధ్యాపకులుగా వుంటున్న 'గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్' మ్యూజియం హాలులో వారే స్వయంగా ఒక ప్రదర్శనాన్ని యేర్పాటు చేశారు. ఈ ప్రదర్శనంలో వర్ణ చిత్రాలూ, రేఖాచిత్రాలూ, శిల్పాలూ, ఇంచుమించు వారు రచించిన వాటి నన్నిటినీ ప్రదర్శించారు.

ఆగస్టు 23 తేదీనుంచి సెప్టెంబర్ 6 వ తేదీ వరకూ జరిగిన ఈ ప్రదర్శనాన్ని మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తి గా॥ శ్రీ పి. వి. రాజమన్నారు ఆవిష్కరించారు

ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌లో తయారుచేసిన 'బాలశీర్షం' అనే శిల్పం పలువురు ప్రేక్షకులను ఆకర్షించింది.

చిత్రరచనలో వీరి కళావిన్యాసం యేదో వొక ప్రత్యేక బాణీలోకి కుంచితమైపోకుండా విస్తృతమైన వైవిధ్యవైభవం కలిగివుంది.



సమయవేది
ట్యూబ్ పెయింటింగ్



బాలకుని శీర్షం
పారిస్ ప్లాస్టర్ శిల్పం

రేఖాచిత్రణ—ముఖ్యంగా రామచావరి గారి చిత్రం శ్రీ రామగోపాల్ ప్రతిభకు సుస్పష్టసూచకంగా వుంది.

ఈ ప్రదర్శనలో తక్కినవాటి అన్నిటికంటే 'ట్యూబ్ పెయింటింగ్' అనే పద్ధతిని రచించిన చిత్రాలు మరింత చూడ ముచ్చటగావున్నయ్. బ్రష్‌తో నిమిత్తం లేకుండా కళాకారుడు రంగుల ట్యూబులను గ్రహించి వాటితోనే చిత్రాన్ని రచించే పద్ధతిని 'ట్యూబ్ పెయింటింగ్' అంటారు. ఈ పద్ధతి చిత్రరచన ఈ ప్రాంతంలో విశేష వ్యాప్తిలో లేదు. ఈ పద్ధతిలోనే రచించిన, 'చిత్రకారుడు,' 'పంట భూములు,' 'ఆనంద చంద్రుడు' అనే చిత్రాలు కొనియాడదగివున్నయ్. వాటి ప్రక్కను నీటిరంగుల చిత్రాలు కొంత వెలా తెలా బోతున్నయ్.

శ్రీ రామగోపాల్ కళాకౌశలం పరిణతస్థాయి నందుకుంటున్నది.

# గ్రంథ విమర్శనము



## శ్రీశైల పండితారాధ్య చరిత్రము

పుల్లకవి ప్రణీతము; ప్రకాశకులు : శ్రీ జ. ని. పుస్తకభాండారం, నెం 49, హెచ్. బి. సమాజం రోడ్డు, బెంగుళూరు-4. వెల రు. 5-0-0.

కృతమున రేవణుడు త్రేతలో మరుళుడు ద్వాపరమున ఏకోరాముడు కలిలో మల్లికార్జునపండితుడు శైవమతమునకు గురువు లని అభియుక్తోక్తి. పాల్కురికి సోమన ద్విపదరూపమునను శ్రీనాథుడు పద్యరూపముననను రచించిన పండితారాధ్య చరిత్ర పై మల్లికార్జున పండితునిదే. పండిత త్రయ మని ప్రసిద్ధు లయిన శ్రీపతి, మంచన, మల్లికార్జున పండితులను వారిలో కడపటి వానినిగ మల్లికార్జున పండితుని పరిగణించుటయు గలదు. తెలుగుదేశమున శ్రీపతి, మల్లికార్జున పండితుల వంశజులను 'పండితారాధ్యుల' వారని వ్యవహరించుట కలదు. ప్రకృతము ఈ శ్రీశైల పండితారాధ్య చరిత్రము వీరెవ్వరికి సంబంధించినది గాదు. వీరశైవమతపీఠము లైదింటిలో 'పండితారాధ్యుల' ను పేర శ్రీశైల మఠాధిపత్యమును వహించిన జంగమస్వాములది. ఈ పీఠమునకు శిష్యులగుటచేత నే శ్రీపతి పండితాదులకు 'పండితారాధ్య' పదము పీఠాధిపతులగు జంగమస్వాములచే ననుగ్రహింపబడిన దని ఈ గ్రంథము చెప్పుచున్నది. ఇది మిగుల వివాదాస్పదమైన విషయము. ఆరాధ్య పదము తెనుగుదేశమునందలి శ్రౌతశైవులయందే రూఢ మని ప్రసిద్ధముగ దెలియుచున్నది. వీరికి చాతుర్వర్ణ్య గురుత్వమును గలదు. బసవేశ్వరోపజ్ఞ మతానుయాయులు జంగములు. వీరు 'ఆరాధ్యులు' గ వ్యవహరింపబడుట ఇంతకుమునుపు వినఁబడదు.

సుప్రసిద్ధమైన పండితారాధ్య చరిత్రము కాదని తెలియుటకు 'శ్రీశైలపండితారాధ్యచరిత్ర' మని నామకరణము చేయబడిన ప్రకృతగ్రంథములో పండితారాధ్యుల ప్రసక్తియే యెచ్చటను కనబడుట లేదు. విరూపాక్ష దేశికుడు బసవేశ్వరున కర్వాచీను డని ఈ గ్రంథములో నే కలదు. ఈయన మల్లికార్జున పండితారాధ్యునివలె నే భీమేశ్వర మహాలింగమునుండి యుద్భవించెనట! 'పూర్వము ధేనుకకర్ణ నామమున ఒక పండితారాధ్యు డుద్భవించి శైవము నుద్ధరించె ననియును నీ వాతని సింహాసనము నధిష్ఠించి పండితారాధ్యోపపదముతో వీరశైవమును ప్రచార మొనరింపు' మనియును శ్రీశైల మల్లికార్జునస్వామి విరూపాక్ష దేశికున కాదేశించిన ట్లీ గ్రంథమున గలదు. బసవేశ్వరాదులు కైలాసప్రాప్తినందిన పిమ్మట భూమిలో శివభక్త్యుద్ధరణమునకు శివాజ్ఞచే విరూపాక్ష దేశికు డుద్భవించెనని, ఈ గ్రంథ ఫక్కిక! బసవేశ్వరునకు మల్లికార్జున పండితుఁడు సమకాలికు డనుట చరిత్ర సిద్ధము. ఇట్టి మల్లికార్జున పండితునకన్న పూర్వుడును, పండిత త్రయములో ప్రథముఁడు నగు శ్రీపతి పండితుడు అర్వాచీనతముడైన ఈ విరూపాక్షునిచే పరాజితుడై లింగధారణము చేయింపబడి (అంతకు మునుపు శ్రీపతి పండితునకు ధారణ లేదనుటకు ప్రమాణము లేదు) పండితారాధ్య పదముచే అనుగ్రహింపబడెననుట జంగములు స్వోత్కర్షార్థము చేసిన కల్పన యని బుజువగుచున్నది! మఠాధిపత్యముతోను, సన్న్యాసముతోను ప్రసక్తిలేని జగద్గురుత్వము. పండితారాధ్యపదము, శ్రీపతి, మల్లికార్జున పండితులకూ తద్వంశజాలకు చిరప్రసిద్ధములై యున్నవి.

వివాదాస్పదములైన పై విషయములను విడిచినచో ఈ గ్రంథము 'నిడుమామిడి' మఠాధిపతులైన జంగమస్వాములపరంపరను వర్ణించు చరిత్రగ్రంథ మని యేర్పడుచున్నది. ఆయా కాలములలో ఈ మఠాధిపతులు చేసిన దేశసంచారములు జానపదవశీకరణకు గా ప్రదర్శించిన మహిమలు రాజులవలన

పొందిన సన్మానములు — దేవాంగులు, సజ్జనులు, (తెలకులు) రెడ్లు, మున్నగు వర్ణములవారిని శిష్యులనుగ పరిగ్రహించి లింగధారణముచేసి జగద్గురుత్వమును వెలయించుట — ఆయాక్షేత్రములలో ఉపమఠములను స్థాపించి 'చరంతు' లను నిలిపి వీరశైవమును ప్రచారముచేయుట — పునఃపునః అనువృత్తమైన ఇందలి వస్తువు.

ఇది వదనరూపమున నిబంధింపబడినను నేగి లేదు.

దేశములో పద్యరచనాభినివేశము నేటికిని వెనుక పట్టలేదు. కవి పదునెనిమిదవశతాబ్దివాడు. గ్రంథాంతమున నీయబడిన పట్టికలు నిడుమామిడి మఠవిషయజిజ్ఞాసువులకు ఉపయోగించునవిగ నున్నవి. వస్తువట్టిది? కావ్యత్వసిద్ధికలదా? లేనిదా? అన్న విచారణతో పనిలేదు. ఏవస్తువునైనను పద్యరూపమున అవతరింపవచ్చును. కనుక ఆనాడిది పద్యరూపమున నిబంధింపబడియుండుటలో అంత ఆశ్చర్యములేదు నిజమునకు — ఇందలి రచనయు నంత తీసివేయదగినదికాదు. మొన్నటివరకు కవి యగుటకు కావలసిన కనీసపు సాధనసంపత్తి—అనేక కవిసమయజ్ఞత, పూర్వప్రబంధముల సమగ్రపరిశీలన, నిఘంటుబలము, శబ్దముమీది యధికారము — ప్రకృత గ్రంథకర్తలో కొఱవడలేదు. ధారాళమైన శైలి. అప్రయత్నపతితములైన సంస్కృతపదగుంఫనలు, ఇందలి పద్యభాగమునకన్న గద్యభాగము నే ఓజోవంతమొనర్చినవని చెప్పవలయును. ఇక — ప్రతిభ, భావన, ఉక్తివైచిత్రి మొదలగునవి దైవ మీయవలసిన కవితాగుణములు. గ్రంథకర్తయైన ప్రతిరచయితయందు వీనినైయన్వేషించుట సాధ్యము కాదు. మొత్తముమీద రచనాశక్తికి సరియైనవస్తువును కవి స్వీకరించినట్లు తోచదు

పీఠికాకర్తలు సూచించినట్లు 'గ్రంథము కన్నడదేశమున ముద్రితమగుట సంపాదకులకు ఆంధ్ర భాషావ్యాకరణనిధులతో తగినంత పరిచయము పరిపాటిలేకుండుట కారణములుగ' అనుపదము దొరలిన ముద్రాదోషముల నోప్పరికించి, గ్రంథముద్రణము మాత్రము సుందరముగ నున్నదని ప్రకాశకులతో బాటు సంతోషించుటకన్న చేయదగినదిలేదు. ఈ తెనుగుగ్రంథమునకు మూఱుపుటలకు పైబడిన కన్నడపు పీఠిక ఎట్టి పాఠకులను దృష్టియందుంచికొని కూర్పబడినదో తెలియుటలేదు. —శి. శి.

## అడిదము సూరకవి జీవితము

రచన : శ్రీ అడిదము రామారావు; కవి జనరంజనము (పిల్లవసుచరిత్ర), చంద్రాలోకము (అలంకారశాస్త్రము), కవి సంశయ విచ్ఛేదము (వ్యాకరణ లక్షణ గ్రంథము), ఆంధ్ర నామశేషము (నిఘంటువు), మొదలైన ఉద్గ్రంథములను రచించి ఆంధ్రవాఙ్మయమునకు ఆంధ్ర సారస్వతమునకు అపూర్వమైన సేవజేసిన మహామహుడు అడిదము సూరకవి. నేటివరకూ లభించిన చారిత్రక విషయము లన్నిటినీ సేకరించి, సూరకవి చరిత్రను సమగ్రరూపములో నందజేయ ప్రయత్నించిన శ్రీ అడిదము రామారావు గారి కృషి అభినందనీయమైనది; ప్రచురణ: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ మద్రాసు; వెల : రు. 1-8-0.

## మహాంధ్రోదయం

ఖండకావ్య సంపుటి; రచన : శ్రీ దాశరథి; ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం; 327 రెసిడెన్సీ రోడ్డు, హైదరాబాదు. వెల రు 1-8-0.

ఈ సంపుటిలో తెలంగాణ, మహాంధ్రోదయం, కోటి గొంతులు, శిల్పి, మంగళగీతి, నటస్వామి, గుండెలో దీపాలు, పూలలో జ్వాలలు, తెలంగాణా విముక్తి, తెలంగాణా తల్లి, పామలక్ష్మి, మధురథము, మాధురి, రాగబంధము, మూర్ఛన, కపోతీ సందేశము, మంజీర, క్షమామూర్తి, కాపయనాయకుడు, సాహిత్యసామ్రాజ్యము, అని యిరవై శీర్షికలున్నయ్. ఈ రచనలలో చాలభాగము లోగడ భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, స్రవంతి మొదలగు పత్రికలలో ప్రకటించినవే. హైదరాబాదు ఆంధ్రముఖ్యమంత్రులు శ్రీయుతులు బూర్గుల రామకృష్ణరావు, బెజవాడగోపాల రెడ్డి గార్లు ఈ సంపుటికి ప్రశంసావాక్యాలు నందించారు. దాదాపు పదునాల్గు పేజీలవరకూ విస్తరించివున్న శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక ఈ సంపుటిలోని రచనలమీద నేకాక నవ్యాంధ్ర సాహిత్య రంగమంతటిపైనా వెలుగులు జిమ్మి ద్యోతమానం చేస్తున్నది.

'నా యింటి చిన్నది నడుము సన్నముది క
న్నుల తెల్గు సిగ్గులు మొలకలెత్త
నా వైపు చూచి నన్ వలపించుకొన్నది
పాతకాలంపు సౌభాగ్య గరిమ.

# గ్రంథవిమర్శనము

'క్రొత్తనాటి వెలుంగు కూడగట్టినయట్టు
లుంగరమ్ముల జుత్తు నొత్తికట్టి
తెలుగు సింగారాలు తలబ్రాలుగా జార
పూలు ముడిచి ముద్దరాలు వోలె
నవ్వుల వెలార్చి నా యింటి నడుమ సోల
దీపమును కూర్చి పెట్టిన తెలుగుపిల్ల
కన్నడము కన్నడింపని కవన లక్ష్మి
రసభర విజృంభమాణ పూర్ణ కుచకుంభ'

దాశరథి రసస్నిగ్ధ హృదయుడైన కవి. ప్రాచీ నాథు నాతన శోభా విలాసములతో కవనలక్ష్మి అతనికి దృగ్గోచరమై వలచి వలపించుకొన్నది. ఇంట నిల్లాలై కూర్చున్నది. అది రసభర విజృంభమాణ పూర్ణ కుచ కుంభ. ఇతడు తద్రసతన్మయుడు.

దాశరథి ప్రతిభా వ్యుత్పత్తులు రెండునూ కల వాడు. ఈ పద్యాన్ని ఒక్కదాన్ని పరిశీలినచేస్తే ఆ విషయం ఇట్టే తెలిసిపోతుంది.

'గుమగుమలాడి నా మనసు
గొన్న నవాబ్దసఖీముఖానురా
గమున సుమించె చంపకము;
కౌగిలిలో ప్రసవించె గోరటల్
సుమరమణీయమై తగెన
శోకము తచ్చరణాహతిన్; ప్రహా
సమున సుమించె పొన్నలు ప
సందగు నందనదివ్యవాటిలో'

నవాబ్దసుందరి వచ్చినది; దాని రాకతో 'నందన' దివ్యవాటిక ప్రఫుల్లమైనది. ప్రాచీనులనుండి సంప్రదాయముగా వచ్చుచున్న దోహదక్రియలలో క్రొత్తపూవులు పూయించినాడు కవి. ఇందు ప్రతిభను వ్యుత్పత్తి, వ్యుత్పత్తిని ప్రతిభ పరస్పరము దోహదము చేసుకొని విచిత్రముగా విరియబూసినవి. వ్యుత్పత్తి విషయం అటుంచి, రసనృష్టిలో అతనికి గల ప్రతిభ ఏ రెండు పద్యపాదాలను స్పృశించినా తెలిసిపోతుంది:

'నేను వేస్తంభాల నీడలో నొక తెల్గు
తోటనాటి సుమాలు దూసినాను'

'కాంచనాధ్యాణ విరాజమాన
కటియై అరుదెంచిన మా నవాబ్ద
లక్ష్మి నవహాసముల్ బ్రతుకు మేడకు
పువ్వుల దివ్వె లెత్తెడిన్'

*     *     *     *

'ఆంధ్ర సురత్రాణుడై ఢిల్లీ సుల్తాను
వీపు చిట్లించిన వీరమూర్తి.'

*     *     *     *

'నిప్పుల్ గ్రక్కు ఫాలాక్షిలో
పిడుగుల్ పిల్లలు పెట్టుకొన్నటు మహా
మేఘావళీ గర్జనల్
చెవుగుళ్ళూడి భయమ్ము గొల్పునటు తోచెన్
శంభు ఢక్కాధ్వనిన్'.

*     *     *     *

'ఈ శిథిలాలయమ్మున జనించిన చిక్కని శిల్ప రీతిమోరాశి శిఖాగ్రసీమ పదరా! ఒక దీపము పెట్టి వత్తి మా వేశములేని ఈ బ్రతుకు వీథుల వెచ్చని దీప మాలికా పేశల కాంతి నింపుదము పెక్కు తరాల తమమ్ము లింకగన్!'

ఈ సొగసు లిలా ఎన్నయినా రొత్తి చూప వచ్చు. కాని కేవలం ఇలాంటి రచనా వైచిత్రి మాత్రంచేతనే శ్రీ దాశరథి పైకిరాలేదు. దానికి ప్రత్యేక కారణం వుంది. ప్రతిభావ్యుత్పత్తులున్నంతమాత్రంచేత కవిగా ప్రఖ్యాతిలోకి రావచ్చునంటారు. కాని అది యెంతవరకు విశ్వసనీయమో తెలియదు. ఆ రచయితను కావ్యరచనోన్ముఖుణ్ని చేయగల మహావేశ మేదో ఒకటి ఉంటేనే గాని సంపన్నమైన కావ్యం ఉత్పత్తిఅయే అవకాశం లేదనిపిస్తుంది. ఉదాహరణకు కృష్ణరాయలయుగం అనంతరంనుంచీ జాతీయోద్యమప్రారంభంవరకూ వ్యాపించిన ఈమధ్య కాలంలో ఆంధ్రసాహిత్యక్షేత్రం బట్టబంజరై ఉత్తుంకులు పండటానికి గల కారణ మేమిటి. చదువుకున్న పండితులు లేకనా, శబ్దవైచిత్రి నెరిగినవారు లేకనా? నిజానికి ఆ దశలో ఉద్భవించిన కావ్యాలలో (వాటి కాపేరు వాడవచ్చునంటే) ఈ రెండు గుణాలూ మినహా ఇతరత్రా ఏమీ లేదు. అందుచేతనే పరిమళకుసుమరహితములైన ఆకు పసందు చెట్లయి ఎందుకూ కొరగాకుండా పోయినై.

అదృష్టవశాత్తూ దాశరథికి అట్టి మహావేశం కూడా లభించింది. ఈ మహావేశమే ఆంధ్రభూమిలో

అనేకమంది మహాకవుల ఉద్భవానికి కారణభూతమైంది. భారతస్వాతంత్ర్య సమరం ఇల్లాంటి కవియోద్ధలను అనేకమందిని తయారుచేసింది. వీరు ఆంధ్ర ప్రాచీనోజ్జ్వల చరిత్ర నంతా త్రవ్వి యెత్తి వీరావేశంతో శంఖారవాలు చేసి ప్రజాబాహుళ్యాన్ని సమరోన్ముఖులను చేశారు. ప్రత్యేకంగా తెలంగాణా స్వాతంత్ర్య సమరం దాశరథికి అట్టి అవకాశాన్నిచ్చింది. ఆ ఆవేశంలో అతను కవిగా పైకిరావటమే గాక కృష్ణ జన్మస్థానంకూడా అలంకరించాడు. ఆ వీరావేశం వచ్చినప్పుడు దాశరథి కొదమసింగంలా గర్జించుతాడు!

‘ప్రాణము లొడ్డి ఘోర గహ
నాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించ నెము
కల్ మనిజేసి పొలాలు దున్ని బో
షాణములన్ నవాబునకు
స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే!-’

* * * *

‘విషము గుప్పించినాడు నొప్పించినాడు
మా నిజాం రాజు జన్మజన్మాల బూజు’

* * * *

‘బలమగు ముష్టిబంధమున
బ్రద్దలుగొట్టి తరాలనాటి క
త్తుల పెనుఖైదు, దాస్యమును
తుత్తునియల్ పొనరించి క్రొత్త వె
ల్గుల జలకమ్ములాడి తన
కున్ తన వారలకిల్లొకండు కా
వలెనని పట్టుపట్టి పెర
వారల కొంప్రధుడు దారి జూపెడిన్.’

* * * *

నేనురా తెలగాణ నిగళాలు తెగ...
ఆకాశ మంత యెత్తరచినాను
నేను రాక్షసిగుండె నిరుగా పద్యాలు
పాడి మానవుని కాపాడినాను.

* * * *

కుంకుమ చిల్కరింపు నిదిగో
పరిగర్జిత మేఘ మాలికా
పంకిల రోదసీకుహర
భాగ దిగంత భయంకరార్భటిన్
సంకుల కాళరాత్రి తెర
జారిన నాటకశాలవంటి ప్రా
గంకమునన్ మదీయ ఘుసృ
ణారుణహస్తతలద్వయమ్మునన్.

* * *

మంగళగీతి పాడెద
హిమాచల శృంగ సరత్ సురాపగా
భంగ తరంగ రంగముల
పాదము లూని నటించు బాల సా
రంగధరున్ వినీల చికురమ్ములలో
ధరియించినట్టి భ
స్మాంగుని ఫాలనేత్రమున
నగ్ని కణమ్ముల జిమ్ము దానవున్.

మాతృభూమియైన తెలంగాణముపై గల భక్తి భావము శ్రీ దాశరథికి మహాశీస్సుగా పరిణమించి నవ్యాంధ్రసాహిత్యరంగంలో ఆయనకు ఒక ప్రముఖ స్థానాన్ని యిచ్చింది.

ఇక్కడ నొక చిన్న విషయము చెప్పవలసి యున్నది. దీనికి బాధ్యులెవరో తెలియదు గాని, దాశరథి రచనలలోనుండి ఉన్నత శ్రేణి రచనలనన్నిటినీ సేకరించి ఈ సంపుటిలో మన కందించినారు. అందుకు వారికి కృతజ్ఞులము. ఈ సంపుటినుండి ‘కపోతీ సందేశము’ నగూడ తొలగించిన బాగుండెడిది. ఈ శాంతి పావురముల తెచ్చికోలు సంప్రదాయముతో, ఈ రచన ఈ సంపుటిలో చాల వెలవముగ కన్పించుచున్నది. శ్రీ దాశరథి కలలు గనుచున్న మహాంధ్రోదయము మృగతృష్ణగా మారునట్లు కనుపించుచున్న ఈ సమయమున ఈ గ్రంథము వెలువడుట ముదావహము. మహాంధ్రోదయ మగుటకు శ్రీ దాశరథి మొదలైన తెలంగాణాకవులే మహామంత్రముల పఠింతురో ముందు చూడవలసి యున్నది. ‘మహాంధ్రగీతి ‘పాడుటకు’ మూడుకోటుల నొక్క చే ముడి బిగించవలెనుకదా!

— తె. సూ.

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.